

రామేశ్వరంలో శివలింగం

—ఫోటో: టి. రమాదేవి, మార్కాపురం.

విశాలాంధ్ర యందంతట
విజయవంతంగా ప్రదర్శింపబడుచున్నది




మాటలు:
పినిశెట్టి శ్రీరామమూర్తి.

సంగీతం అశ్వత్థామ.

జానకి. మాలతి. రాజసులోచన. గిరిజ.
ఎన్.టి.రామారావు. జగ్గయ్య. రేలంగి. ముక్కామల.
కె.వి.యస్.శర్మ. కుటుంబరావు

చిత్రప్రియా రిలీజ్.

దర్శకుడు సి.యస్.రావు. నిర్మాత కడారు వెంకటేశ్వరరావు *M.A.,B.L.

| సంవత్సర చందా<br>రు. 13-0-0<br>విడిపత్రిక 25 న.పై | # ఆంధ్రపత్రిక<br>సచిత్ర వారపత్రిక | సంపుటము 52<br>సంచిక 27<br>**26-2-58** |
|---|---|---|

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి ఫాల్గుణ శుద్ధ సప్తమి బుధవారం


## ★ విషయానుక్రమణిక ★

★

ముఖచిత్రం :

'ఏక్ షోలే' చిత్రంలో

ప్రదీప్‌కుమార్, మాలాసిన్హా

★



జార్జి వాషింగ్టన్ తైలవర్ణ చిత్రం.

తమ ప్రియతమ నాయకుడూ, ప్రప్రథమ అధ్యక్షుడూ అయిన జార్జి వాషింగ్టన్ చిత్రాలను అమెరికన్ జానపద కళాకారులు 18-వ శతాబ్దంలో తైలవర్ణాలలోనూ తదితర పరికరాలతో అనేకం చిత్రించారు.

ఇది జార్జి వాషింగ్టన్ కంబర్లెండ్ దుర్గంవద్ద తన సేనలను పరిశీలిస్తున్న దృశ్యం; 1795 ప్రాంతంలో కాన్వాస్ మీద తైలవర్ణాలతో ఫ్రెడరిక్ కెమెల్ మెయర్ అనే చిత్రకారుడు రచించినది.

# అమెరికా జానపద చిత్రకళ

అమెరికాలో జానపద చిత్రకళను-దీనినే కొంతమంది ఆదిమ చిత్రకళ అని కూడా అంటారు—చాల దీర్ఘ చరిత్రే ఉన్నది. ఈ చిత్రకళ 17,18 శతాబ్దాల నాటికే వున్నది. కాని 19 వ శతాబ్దం పూర్వార్ధంలో ఈకళ శిఖరస్థాయి నందుకొన్నది. కాని ఆ తరువాత ఈకళలు కనుమరుగైపోయినవి. తిరిగి ఇటీవల దాదాపు 30 సంవత్సరాల క్రితం వీటిపట ఆసక్తీ అభిరుచీ మొలకలెత్తింది. ఆనాటి ఆకళా ఖండాల నమూనాలకోసం అన్వేషణ ప్రారంభమైంది. అంతవరకు మరుగున పడిపోయిన, మనోజ్ఞమైన, నిరాడంబరమైన ఈకళను పునరుద్ధరించటానికి అనేకమంది అన్వేషకులు, ఈ కళను అభిమానవిషయంగా పెట్టుకొన్న పలుకళావస్తుప్రదర్శన కేంద్రాలు (మ్యూజియములు) పూనుకొన్నవి. దీనికితోడు ఆధునిక చిత్రకారులకు ఈ ఆదిమ చిత్రకళలో స్పష్టమైన అమెరికన్ విశిష్టత ద్యోతకమైంది. వారికి దీనిపట్ల అభిమానం ఏర్పడింది. కళను పునరుద్ధరించ పూనుకొన్న సంస్థలకు, వ్యక్తులకు ఇది



1799లో జార్జి వాషింగ్టన్ మరణించినప్పుడు ఆ విషాదచ్ఛాయలలో అతడి ఎడ తమకున్న భక్తిప్రపత్తులను ప్రదర్శిస్తూ అమెరికన్ మహిళలు పట్టువస్త్రాలపై అల్లికత్రో, నీటిరంగులతో ఇలాంటి చిత్రాలను అనేకం తయారుచేశారు. ఇది రోడ్ ఐలెండ్ నివాసిని కేథరిన్ టౌన్సెండ్ వార్నర్ అనే ఆవిడ 1800 లోతయారుచేసిన చిత్రం.



శ్వేతాశ్వారూఢుడైన వాషింగ్టన్

ఇది 1830 ప్రాంతంలో దారువుపై తైలవర్ణాలతో రచించిన చిత్రం. చిత్రకారుడి పేరు ఏమిటో ఇప్పటివరకూ తెలియదు. తెలుసుకోడానికి అమెరికన్ కళాభిమానులు అన్వేషణ సాగిస్తున్నారు.

# ★ అమెరికా జానపద చిత్రకళ ★

మరింత ఊపు, ఉత్సాహం కలిగించింది.

ఈ ఆదిమ చిత్రకళ ముఖ్యంగా ప్రజల కళ. అందుచేత అని నాటి ప్రతి చిత్రానికి నాటి ప్రజలదైనందిన జీవిత లక్ష్యాలే రచనా వస్తువులైనవి. నాటి కులపెద్దలు, వారి ఓడలు, సభాలంకరణలు, వారి కుటీరాల కిటికీ తెరలు, దుకాణాల ముందుకట్టుకొనే సైను బోర్డులు, తరువాత తరంవారికి వారసత్వంగా అప్పగించటానికి వేసే చిత్రాలే ఎంచుకొన్నారా నాడు. ఆనాటి స్త్రీ పురుషుల హస్తనైపుణ్యానికి జీవకళ ఉట్టిపడే ఈ చిత్రాలు సజీవ నిదర్శనాలు. యిరోపా అకాడమీలంటే ఏమిటో ఈ కళాకారులకు తెలియదు. అసలు వీరికి గురువులంటూ ఎవరూ లేరు. జన్మతః అబ్బిన నైపుణ్యమే ఇది. వారికి, వారికుటుంబంలోనివారికి కంటికింపైన వస్తువులు తయారుచేసుకోవాలన్న ప్రగాఢ వాంఛ ఫలితంగానే నాటి కళాఖండాలు ఉద్భవించినవి.

ఆదిమ చిత్రకారుని చిత్రంలో వినిర్మల దృష్టి, నిరాడంబరత్వం, మనస్ఫూర్తి, సృజనాత్మకమైన చైతన్యశక్తి ఉట్టిపడుతుంటవి. అకాడెమీల ద్వారా శిక్షణ పొందిన కళాకారుల చిత్ర రచనలో ఈ గుణాలు చాల అరుదు. ఈ ఆదిమ చిత్రకారులకు దార్శనికలాలిత్యాలు తెలియవు. ఖచ్చితమైన రేఖాచిత్రణ కూడా వారికి అంతగా సాధ్యపడలేదు. అయితే ఇందువలనే ఆనాటి చిత్రకళలో ఒకవిధమైన నిగూఢత్వం, సంగ్రహాత్వం గోచరిస్తుంది.

చేతిపనులలో చేకూరిన ప్రావీణ్యం ఫలితంగా ఉద్భవించిన ఈ ఆదిమకళారచనలో మగవారి పాత్ర హెచ్చుగానే ఉన్నది; అయినా మగువలు కూడా తరచు చిత్రలేఖనం చేసిన సందర్భాలు కనపడుతున్నవి. జలవర్ణాలంకరణం, సున్నితమైన సూది పనులు అవసరమయ్యే సందర్భాలన్నిటిలో స్త్రీల చిత్రలేఖనాలు హెచ్చుగా ఉన్నవి. మహిళలకు కళాశాలలు ఏర్పడకపూర్వం యువతులు తామూ కొన్ని ప్రత్యేక కార్యాలు సాధిస్తే బాగుంటుందని భావించేవారు. ఆనాడు చదువుమీద అంతగా శ్రద్ధ ఉన్నట్టు కనపడదు. సామర్థ్యం, వ్యక్తిత్వం ఉన్నప్పుడు సంఘం విధించిన అవధులను అధిగమించటానికి ఆ నాటి యువతులు ప్రయత్నించారు. ఆ విధంగా కళ విషయంలో ఘనమైన విషయాలు సాధించిన సందర్భాలు కనపడుతవి. పటాలు కట్టుకునే చిత్రాలు వేయటమంటే నాటి స్త్రీలకు ప్రత్యేకాభిరుచి ఉండేది. సమాధి, రోదించే 'విల్లో' వృక్షం, పిలపించే వ్యక్తివంటివి అప్పుడప్పుడు అవసరంకొద్దీ రచించినవి మాత్రమే. కాగా, ప్రతికళాకారిణి ఎన్నో రకాల కళాఖండాలు సృష్టించగలిగిన నిదర్శనలు కనపడుతాయి.

ఈ ఆదిమకళాకారులు తమ చిత్రరచనకు జార్జి వాషింగ్టన్‌వంటి జాతీయ వీరులను ఇతివృత్తంగా తీసుకొన్న ఉదాహరణలు కనపడుతున్నవి.

అమెరికా స్వాతంత్ర్య విప్లవసేనానీ, తొలి అధ్యక్షుడూ అయిన జార్జి వాషింగ్టన్‌ను ఎంతోమంది నాటి కళాకారులు తమ చిత్రరచనకు కథావస్తువుగా తీసుకొన్నారు. వీరిలో చాలమంది ఆయన సమకాలికులు. ఆయన జీవించి ఉండగానే చాల చిత్రాలు ఆయనకు సంబంధించినవి రచించారు. అయితే ఆయన అనంతరం తమ ఊహాశక్తితో రచించినవీ, తొలి చిత్రాలను అనుకరించినవీ కొల్లలుగా ఉన్నవి. వీటిలో జానపద చిత్రకళాశ్రేణికి చెందినవి గమనార్హమైనట్టివి. ★




# శ్రీ కృష్ణమాచారి తరువాత ఎవరు?

న్యూఢిల్లీలో చాగ్లా నివేదిక కలగజేసిన సంచలనం అంతా ఇంతా కాదు. ఒక చిన్న పొరబాటుతో ఏళ్లతరబడిచేసిన మంచిపని అంతా తుడుచుకుపోతుందని ఈ వ్యవహారంలో స్పష్టమైంది.

శ్రీ టి. టి. కృష్ణమాచారి స్వాతంత్ర్య సిద్ధికి పూర్వమే కేంద్రశాసనసభలో సభ్యులుగా ఉండేవారు. రాజ్యాంగ రచనలో పాల్గొన్న మూలపురుషుల్లో ఈయనొకరు. మొదటి పెద్దఎన్నికలతరవాత ఈయన వాణిజ్య, పరిశ్రమలశాఖమంత్రిగా నియమితులయ్యారు. ఈయన ఆధ్వర్యంలో ఆశాఖ చాలా కట్టుదిట్టంగా పనిచేసింది; దిగుమతి కంట్రోలుసంస్థ ఎక్కడా వేలెత్తి చూపడానికి వీలులేనివిధంగా పనిచేయసాగింది.

ఇప్పుడుతయారులోఉన్న మూడుఉక్కు కర్మాగారాలను సక్రమంగా వ్యవస్థీకరించింది శ్రీకృష్ణమాచారే. ఆయన చెప్పినమీదటే కొత్తగా ఉక్కుకోసం ఒకశాఖ నెలకొల్పారు. ఆయనే దానికి మొదటి మంత్రి.

బొంబాయి వివాదంలో పేచీపడి శ్రీ దేశముఖ్ రాజీనామా ఇవ్వటంతో శ్రీకృష్ణమాచారి ఆర్థికమంత్రి అయ్యారు. దీంతో అప్పటిదాకా బాగాఉన్న ఆయన పలుకుబడి తగ్గిపోజొచ్చింది. ఏమిటి దీనికి కారణం? ద్వితీయ ప్రణాళిక తయారుచెయ్యటంలో ఆయనకేమీ ప్రమేయంలేదుగాని, దాన్ని అమలుపరచవలసిన బాధ్యతమాత్రం ఆయనమీద పడింది. దానికోసం దేశంలో ఎక్కడెక్కడఉన్న డబ్బునీ ఏదోవిధంగా సేకరించవలసిన భారంకూడా ఆయన నెత్తినే పడింది. బర్కు అన్నట్లు, పన్నులు వేసేవాడు మంచివాడెప్పుడన్నా అవుతాడా? మొత్తం వ్యాపారస్థులూ, ముఖ్యంగా వ్యాపారస్వేచ్ఛాసంఘమూ ఏకమై ఆయన్ని నిందించనారంభించారు. కమ్యూనిస్టులుకూడా వేరే కారణాలు పెట్టుకుని వ్యతిరేక ప్రచారం సాగించారు. ఎందుకయ్యా ఈ ప్రతికూలత అంటే నెహ్రూగారి సామ్యవాద భారమంతా శ్రీకృష్ణమాచారి తన భుజాస్కంధాల మీద వేసుకున్నారు గనక. ఈ సామ్యవాదానికున్న ఆయుధాలు రెండే రెండు. ఒకటి

**శ్రీ కృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

పన్నులు వెయ్యటం; రెండు, జాతీయం చేయటం. కాని ఈ రెండో దానికి సంబంధించి నంతవరకూ చూస్తే, శ్రీకృష్ణమాచారి ఆర్థిక మంత్రిత్వ కాలంలో ఏవ్యాపారాన్నీ జాతీయం చెయ్యనేలేదు. ఇంపీరియల్ బ్యాంకినీ, జీవిత భీమా వ్యాపారాన్నీ జాతీయంచేసింది శ్రీ చింతామణి దేశముఖ్. ఆయన జాతీయం చేసినవాటిని ఈయన నిర్వహించాల్సి వచ్చింది. ఇక పన్నులవిషయం చూస్తే ప్రొ॥ కాల్డర్‌ను సలహాకోసం పిలిచింది ఈయనకాదు, దేశముఖ్ గారే. ఆయన మంత్రిత్వ కాలంలోనే కాల్డర్ సిఫార్సులను అందరి అభిప్రాయం కోసమూ ప్రకటించారు. శ్రీ కృష్ణమాచారి వచ్చేసరికి, ఆ పన్నుల ప్రతిపాదనలు చాలవరకు స్థిరపడిపోయాయి. వాటినే ఈయన స్వీకరించి ఖర్చు పన్నుగానూ, ఆస్తి పన్నుగానూ శాసనాలు చేయించారు.


శ్రీ కృష్ణమాచారి

ఇక్కడితో కథ అయిపోలేదు. శ్రీ కృష్ణమాచారి ఆర్థికశాఖ గద్దె ఎక్కేసరికి ద్రవ్యోల్బణం పెరిగిపోతోంది. వ్యవసాయోత్పత్తి తరిగి పోతోంది. ఈ పరిస్థితిలో, ప్రభుత్వం ప్రతిష్ఠ, ముఖ్యంగా ప్రధానమంత్రి ప్రతిష్ఠ ఆధారపడిన ప్రణాళికకు డబ్బు తీసుకురావాల్సిన పని శ్రీ కృష్ణమాచారికి తగిలింది. విదేశాల దయాదాక్షిణ్యాలమీద ఎక్కువగా ఆధారపడిన ఇలాంటి ప్రణాళికను ఏనాగరిక, ప్రజాస్వామిక దేశమూ ఇప్పటిదాకా తయారు చేసుకుని ఎరగదు.

సిద్ధాంతరీత్యా, రాజకీయరీత్యా, రాజనీతి రీత్యా ఇన్ని ఇబ్బందులున్నా శ్రీ కృష్ణమాచారి ప్రశంసనీయమైన పనిచేశారని ఎవరైనా ఒప్పుకోక తప్పదు. ఉదాహరణకి, ధరలు నిలకడగా ఉన్నాయి. ఆహార పరిస్థితి మెరుగైంది. విదేశీ ద్రవ్యమారకం పరిస్థితి అదుపులోకి వచ్చింది. పైగా ఇటు ఆయన్ని పదవిలోంచి తరిమేస్తోంటే, అటు విదేశాలనుంచి ధన సహాయం వస్తోంది. ఇంతకీ ఆయన్ని ఎందుకు తరిమేస్తున్నారు? ముంద్రా కంపెనీల్లో జీవితభీమా కార్పొరేషన్ వాటాలు కొనటానికి రాజ్యాంగ రీత్యాను, యథార్థంగానుకూడా ఆయన్నే బాధ్యుణ్ని చేశారు గనక. బొంబాయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అలాగని తీర్పు ఇచ్చారు. ఆ తీర్పును మన్నించి తీర

# న్యూఢిల్లీ లేఖ

వలసిందే.

ఇంకో విషయం. తన వాటాలు తను మళ్ళీ కొనేసుకుంటానని ఈమధ్య ముంద్రా చేసిన వాగ్దానాన్ని జీవితభీమా కార్పొరేషను చర్చించింది. ‘ఆ వాటాలను మనమే ఉంచుకుందా’మని కార్పొరేషను బోర్డులోని పలుకుబడిగల కొద్దిమంది పట్టుపడుతున్నారని న్యూఢిల్లీ వార్తలు తెలుపుతున్నాయి. కాని అధిక సంఖ్యాకుల అభిప్రానుసారం ఆ వాటాలను అమ్మివేసి వచ్చిన నష్టాన్ని పూడ్చుకోవాలని కార్పొరేషను నిశ్చయించినట్లు తెలుస్తోంది.

ఈ వార్తలు నిజమైనటయితే వీటినిబట్టి, చాగ్లా నివేదికనుబట్టి, కార్పొరేషనుబోర్డు సభ్యులు కొందరన్నట్లు ముంద్రావాటాలు బంగారంలాంటి వాటాలే అయితే వాటిని కార్పొరేషనుచేత కొనిపించటంలో శ్రీ కృష్ణమాచారి నిత్య వ్యవహారానికి సంబంధించినపొరబాటుతప్ప పెద్ద తప్పు ఏమిచేశారని? ఏదో తప్పుకు ఆయన బాధ్యుడని అన్నంత మాత్రాన ఆయన పదేళ్ళుగా భారత దేశానికి చేసిన స్వార్థరహితసేవ అంతా బూడిదపాలు కావలసిందేనా?

గడచిన పదేళ్ళలో రాజీనామా చేసిన ఆర్థిక మంత్రులలో నాలుగోవారు శ్రీకృష్ణమాచారి. ‘ఆర్థిక శాఖమంత్రి రాజీనామా చేసిగాని పదవి విరమించరాదు’ అని ఏదన్నా నియమం ఉందేమో! పన్నుల దర్యాప్తుసంఘం వివాదంలోపడి శ్రీ షణ్ముఖంచెట్టి, ప్లానింగ్ సంఘం వివాదంలోపడి శ్రీ జాన్ మత్తయ్, కేంద్ర మంత్రిమండలి పనిచేసేతరహా నచ్చక శ్రీ దేశముఖ్ రాజీనామా చేశారు. శ్రీ దేశముఖ్ ను ఆఖర్న ప్రేరేపించింది బొంబాయి సమస్య అనుకోండి. ఆయన రాజీనామా ఆమోదించిన తర్వాతనే కేంద్రప్రభుత్వం ద్విభాషా బొంబాయిరాష్ట్రానికి ఒప్పుకుంది.

శ్రీ టి. టి. కృష్ణమాచారి నాలుగో ఆర్థిక మంత్రి. తన పూర్వులలాగానే తను కూడా రాజీనామాపెట్టి మరీ తప్పుకున్నారు. బ్రిటిషు పార్లమెంటుకు సహజమరణం లేదంటారు. అలాగే భారత ఆర్థికమంత్రికూడా మామూలుగా పదవినుంచి విరమించడు; రాజీనామా చేస్తాడు.

“మహారాజు మరణించాడు! మహారాజు చిరకాలం వర్థిల్లుగాక!” అనేది బ్రిటిషువారి సంప్రదాయం. శ్రీ కృష్ణమాచారి తరవాత ఎవరూ అని అప్పుడే ఊహాగానం ఆరంభమైంది. ఉషారైన జర్నలిసు ఒకాయన శ్రీ కృష్ణమీనన్ను ఆర్థికశాఖలోను, పాటియా

మహారాజును రక్షణశాఖలోను ఊహించుకున్నాడు. వాషింగ్టన్‌లోని భారత రాయబారినికూడా పలువురు జర్నలిస్టులు ఆర్థిక శాఖకు సమర్థిస్తున్నారు. శ్రీ మురార్జీ దేశాయ్‌ని కొందరు ఈ "కంటకకిరీటానికి" వారసుడుగా సూచిస్తున్నారు. ఈ యన అయితే కావచ్చు. కాని మరో రెండు నెలలదాకా ప్రధానమంత్రి ఎవర్నీ నియమించేటట్లు కనిపించటంలేదు.

వీటన్నిటికంటే ముఖ్యమైన ప్రశ్న ఏమంటే, శ్రీ కృష్ణమాచారి తరవాత తమిళనాడుకు కేంద్రంలో ప్రతినిధిగా ఎవరుంటారూ అని. ఉద్రేక భరితంగా తయారైన తమిళనాడు తనకు కేంద్రంలో ప్రాతినిధ్యం లేకపోవటానికి అంగీకరిస్తుందా?

ఈసారి తమిళనాడు నుంచి బ్రాహ్మణేతరుని, వీలైతే హిందీ వ్యతిరేకిని కేంద్రంలోకి తీసుకుంటారని న్యూఢిల్లీలో కొందరి ఊహ. ఒకవేళ డా॥ పి. సుబ్బరాయన్‌ని తీసుకున్నా ఆశ్చర్యమేమీ ఉండదు.

## శాఖా చంక్రమణాలు

తమిళనాడునుంచి తీసుకోబోయే వ్యక్తికి ఏశాఖ ఇవ్వాలి అనేది మరో ముఖ్యమైన సమస్య. నీటిపారుదల, కార్మికశాఖలాంటి చిల్లర మలరశాఖ ఇస్తే, తమిళులు ఊరుకోరు. తమిళనాడువ్యక్తికి వాణిజ్యశాఖనిస్తే ఆశ్చర్యపడక్కర్లేదు. మొత్తానికి కేంద్రమంత్రి మండలిలో మళ్ళీ "శాఖాచంక్రమణాలు" జరిగే అవకాశం ఉంది. అయితే గియితే వాణిజ్యశాఖకు సర్దార్ స్వర్ణసింగ్, ఉక్కు-గనుల, విద్యుచ్ఛక్తి శాఖకు శ్రీ కె. సి. రెడ్డి, వర్క్సు, గృహనిర్మాణ, సరఫరాశాఖకు డా॥ సుబ్బరాయన్ నియమితులు కావచ్చు. ఇవన్నీ ఊహాగానాలే సుమండీ. ప్రధానమంత్రి ఏమాలోచిస్తోంది ఎవరికీ ఇంకా తెలియదు. అసలు ఈ విషయాలాయన ఇప్పుడు ఆలోచించటమే లేదల్లేఉంది. ఇప్పుడాయన ఆలోచనలన్నీ చాగ్లా నివేదికపైనే ఉన్నాయి. మొత్తానికి ఈ నివేదిక అందరికీ ఎలక్ట్రిక్ షాక్‌లా తగిలింది. ఈ దెబ్బ ఇప్పుడప్పుడే మానిపోదు.

చేతులు కాలినతరవాత ఆకులుపట్టుకోటం వల్ల లాభంలేదు గాని, శ్రీ ఫిరోజ్ గాంధీ చేసినపని మంచిదేనా అని ఇప్పుడనుమానం కలుగుతోంది. ఆయనకు పలుకుబడికేమీ తక్కువలేదు గనక, ఆర్థికశాఖ లోలోపలనే విచారణ జరిపేట్లు ప్రభుత్వాన్ని ఒప్పించలేకపోయారా ఆయన? దీనివల్ల ఇంటిగుట్టు రచ్చకెక్కాల్సిన అవసరం తప్పేదిగదా? ఒకవిధంగా చూస్తే, స్వాతంత్ర్యం వచ్చిన తరవాత చాగ్లా విచారణ, నివేదిక కేంద్ర ప్రభుత్వంమీద చేసినంత ఘాటైన విమర్శ ఇప్పటిదాకా ఎవరూ ఎక్కడా చేయలేదనిపిస్తోంది.

అంతర్జాతీయంగా చూసినా, భారత దేశానికి విదేశీ సహాయం రావటం ప్రారంభమైన తరుణంలో ఈ నివేదిక వెలువడటం కొంత ఆందోళనకే కారణమైంది. కాంగ్రెస్ పార్టీలో క్రమశిక్షణ లేదనటానికి ఈ సంఘటనకంటే నిదర్శనమేంకావాలి? చాగ్లా నివేదిక ఫలితంగా, ప్రభుత్వ యంత్రాంగాన్ని క్షాళనం చేయాలన్నా, ప్రభుత్వం నెలకొల్పిన కార్పొరేషనను పునర్వ్యవస్థీకరించాలన్నా ప్రభుత్వపక్షం చేయాల్సిన పనేమిటంటే, దర్యాప్తు అవసరమైన విషయాలను ప్రభుత్వపక్ష సభ్యులే ప్రభుత్వ దృష్టికి తీసుకురావటానికి తగిన అవకాశాలు, సౌకర్యాలు కలిగించాలి.

ప్రభుత్వం తన ఇల్లు తనుముందు చక్కదిద్దుకోవాలనుకున్నట్లయితే, మంత్రులకు వారి క్రింద పనిచేసే శాశ్వతోద్యోగులకు ఉండవలసిన సంబంధాలను స్పష్టంగా నిర్వచించాలి.

ఇకపోతే మరొక ముఖ్యమైన విషయం ఉంది. ప్రభుత్వపక్ష సభ్యులు దైనందిన పరిపాలనా విషయాల్లో జోక్యం చేసుకోవటం ఎక్కువైపోతోంది. దీన్ని గట్టిగాఅరికట్టాలి. పార్లమెంటుసభ్యులు ఢిల్లీ పరిపాలనను ఎలా నాశనంచేసింది నేను చాలాసార్లు ఈ లేఖలో వ్రాసిఉన్నాను. ఈ మాదిరి జోక్యం అవినీతికి దారితీస్తోంది. దీన్ని అరికట్టవలసిన బాధ్యత మంత్రులది.

వర్తకులు, పారిశ్రామికులు తమతమ వ్యవహారాలు సునాయాసంగా నెరవేరేందుకు, దేశంలో ఎంతపెద్ద వలపన్ని కూర్చుంది చాగ్లా నివేదికద్వారా బయటపడింది. వీరి తరఫున పనిచేసే 'ఏజెంట్లు' పార్లమెంటు లోపలా ఉన్నారు, బయటా ఉన్నారు.

బ్రిటిష్‌హయాంలో, ఇలాంటి రవ్వ రటూ రాకుండా చేసేందుకు ఒక పద్ధతి అవలంబించేవారు. బ్రిటిష్ అధికారులు దేశంలో పర్యటన చేయాల్సివస్తే ఎప్పుడూ వర్తక ప్రముఖుల ఇళ్ళల్లో బసచేసేవారు కాదు. కలెక్టరుబంగళాలోనో, సర్క్యూట్ బంగళాలోనో, లేక తమ రైల్వే పెట్టెలలోనో బసచేసేవారు. కాని మనమంత్రులకు వర్తకప్రముఖుల ఇళ్ళలోతప్ప ఇంకెక్కడా బసచేయరాదనే నియమం ఉన్నట్లుంది.

* * *

## అల్లరి విద్యార్థులు

పిల్లలు రౌడీలుగా తయారయ్యారనీ, పెద్దలంటే బొత్తిగా భయంభక్తీ లేకుండాపోతోందనీ పదే పదే పలువురు అంటున్నారు. తల్లిదండ్రులనీ, మేష్టర్లనీ, ఊళ్లో పెద్దలనీ ఎవర్నీ కుర్రవాళ్ళు లెక్కచెయ్యటంలేదు. ఈ పిల్లలు పెరిగి పెద్దవారై సంఘాన్ని అరాజకంలో పడేస్తారు.

పిల్లల్ని పెద్దవాళ్ళు తమ స్వార్థానికి నీచంగా వినియోగించుకోవటమే ఈ పరిస్థితికి కారణమని కొందరి అభిప్రాయం. వీరు దీన్ని అరికట్టటానికి ఈ సూచనలు చేస్తున్నారు:—

1. సెలవుదినాలను బాగా తగ్గించెయ్యాలి.
2. విద్యార్థులను రాజకీయ పక్షాలు తమ ప్రయోజనాలకు ఉపయోగించుకోరాదు. వాళ్ళని ఊరేగింపుల్లోను, ప్రదర్శనల్లోను వాడుకోటం మానెయ్యాలి.
3. పిల్లలు నేరాలుచేస్తే అమెరికాలో మాదిరిగా తల్లిదండ్రులని బాధ్యులుగా చెయ్యాలి.

దేశంలో సెలవులు ఎక్కువగా ఉన్నాయని, వీటిని తగ్గించాల్సిన అవసరం ఉందనీ అంతా ఒప్పుకుంటారు. ఈ విషయమై ఆందోళన వ్యక్తంచేస్తూ సెకండరీ విద్యా సంఘం లోగడ ఈ క్రింది సూచనలు చేసింది:—

పాఠశాల పనిచేసే రోజులు ఏడాదికి రెండువందలకు తక్కువ ఉండగూడదు. ఒక్కొక్క పీరియడ్ 45 నిమిషాలచొప్పున వారానికి కనీసం 35 పీరియడులైనా ఉండాలి. వారానికి ఆరురోజులుబడి ఉండాలి. అందులో ఒకరోజున ఒకపూటమాత్రమే పాఠాలు; ఇంకోపూట విద్యార్థులు, ఉపాధ్యాయులు సరదాగా కలిసి గడపవచ్చు. ప్రభుత్వం సెలవుగా ప్రకటించినరోజునే పాఠశాలకు కూడా సెలవు ఇవ్వాలని పెట్టుకోగూడదు. మామూలుగా వేసవికాలంలో రెండునెలల సెలవు, మరొక రెండుసార్లు పదినుంచి పదిహేనురోజులదాకా సెలవులుఇస్తే చాలు.

రాజకీయప్రచారానికి, ఎన్నికల ప్రచారానికి 17 ఏళ్ళలోపు పిల్లలను ఉపయోగించుకుంటే ఎన్నికలనేరంగా పరిగణించాలని ఒక శాసనంచేస్తే బాగుంటుందని కూడా పైసంఘం సూచించింది. 




[ఉద్యోగపర్వంనుండి]

ఆ. పాండురాజసుతులపాలికిఁ జని యిప్డు, సంజయుండు వచ్చి సమ్ముఖమున
నన్నుఁ జాల దూఱి నాకు రే పచ్చటి, పనులు సెప్పవాఁడ ననుచుఁ జనియె.

క. అప్పటినుండియు నెవ్వగ, గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడు మేనున్
నిప్పులఁ బొరలినయట్లయి, చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా.

వ. అనిన విదురుం డిట్లనియె.

క. బలవంతుఁడు పై నెత్తిన, బలహీనుఁడు ధనము గోలుపడినయతఁడు క్రము
చ్చిల వేచువాఁడుఁ గామీ, కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా.

క. ఇక్కాఱగాములలోపల, నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ యొరు సొ
మ్మొక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గత మేమి సెపుమ నిద్ర సెడుటకున్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ, ధర్మసుతు మాటచొప్పెవ్విధంబొ యెఱుఁగ
కునికిఁ జేసి చింతిల్లితి నోపు దీవు, దెలియఁ జెప్ప నా యలమట మలుఁగఁ జేయ.

చ. అనవుడు నిట్లనున్ విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునుం దగుభటుండును బ్రెగ్గడయున్ గురుండుఁ గాఁ
డె నృపవరేణ్య నీకుఁ బ్రకటీకృతసత్త్వుఁడు శాంతమూర్తి స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు గీఁడు వల్కునే.

ఆ. నీవుఁ గొడుకు వారి నెఱి లేక పఱిచితి, రదియ చాలు నుచితమైన పాలు
పంచి యిండు పిల్లివట్టిన యీరువు, సేసి యున్న నేల చెల్ల నేర్చు.

వ. మీరు శకుని కర్ణ దుశ్శాసనులమీఁద రాజ్యభారంబు వెట్టికొని యుండుదు రిది దుదిముట్ట నే రదెట్లంటేని.

క. తముఁ దా రెఱుఁగుట వేగపడమి దాలిమి విడుపు గలుగుటయు లేని ప్రభు
త్వము గలదె వారియం దీ, సుమానుషము లోకఁడుఁ బట్టి చూడం గలఁడే.

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కపు తండ్రివని తగవు నమ్మి చాల సైరించియున్నవాఁ డది నీవ యెఱుంగు దనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె.

తే. సంజయునిచేతఁ గార్యంబు చంద మెల్లి, యెఱిఁగి మన కెద్ది సేయంగఁ దెఱుఁగు దానిఁ
బనిచి చేయింపు మిపుడు నా మనము దల్లడిలుట హితభాషణంబుల డిందుపఱుపు.

వ. నీవు ధర్మాధర్మవిదుండవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరం బొనరుచున్న సంతాపం బుపశమించినట్లు భవద్వచనామృతంబు నా యుల్లంబున వెల్లి గొల్పుమనిన విదురుం డిట్లనియె.

క. జనులకు నొడఁబా టగువిధమున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁ
దని యొకని కలిమి కులుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము నను నివి, కాపురుషగుణంబు లండ్రు కౌరవ నాథా.

క. ఏలినవానిని దైవము, నాలిని బంధులను సముచితారాధన సం
శీలతఁ బ్రీతులఁ జేయని, పాలసుఁ డా ఫలము లానపడు మనుజేంద్రా.

క. నెమ్మిగలవారి నొల్లరు, త మ్మొల్లనివారివెనుకఁ దగులుదు రధిక
త్వ మ్మెఱిఁగి మెఱిఁగి తొడరుదు, రి మ్మెయిఁ గనియట్టివార లిభపురనాథా.

క. ధనమును విద్యయు వంశం,బును దుర్మతులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ, యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా.

క. అరిదివిలుకాని యుజ్జ్వల, శర మొక్కని నొంచుఁ దప్పి చనినం జను నే
ర్పరి యైనవాని నీతి, స్ఫురణము పగరాజు నతనిభూమిం జెఱుచున్.

తే. ఒకటిఁ గొని రెండు నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే
ల్కని యునికియుఁ గార్యాలో,చనముఁ దెరువు నడచుటయును జనదొక్కనికిన్.

క. నడవడి యను మున్నిటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి తా
నోడఁ గూడు ననిన సత్యము, గడచినగుణ మింక నొండు గలదే యరయన్.

క. క్షమియించువారిఁ గని చా, లమి పెట్టుదు రైననుం దలంప ననూన
క్షమయ కడు మెఱయు తొడ వు,త్తమరూపము గోరువారు తాల్తురు దానిన్.

క. పురుషుండు రెండు దెఱఁగుల, ధర నుత్తము డనఁగ బరఁగుఁ దా నెవ్వొడలం
బరుసములు వలుక కునికిన్, దురితంబులు వొరయుపనులు దొఱఁగుటకతనన్.

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడుఁ బేదవడియును నర్థికి బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య, పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య.

ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు న,పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ నెట్టన రెండు వి,ధములఁ గీడు దొడరు ధరణినాథ.

తే. వెలఁది జూదంబు పానంబుఁ వేఁట పలుకు, బ్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత, య నెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

తే తగిన వేషంబు దనుఁ దానపొగడుకొనము, నొచ్చియును గీడువలుకమి యిచ్చి వగవ
కునికిఁ దన కెంత నడవకయున్నఁ బథము, దప్పకుండుట నడవడి కొప్పుసేయు.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాదంబుఁ ద్రోపుఁ బాడియు ధమయం
తలవారితోన తగు నధి, కుల హీనులతోడ నైనఁ గొఱగా దధిపా.

తే. కొంచెమైనను దగఁ బంచి కుడుపు మేలు-పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకు నైన-నిచ్చుటయ లెస్స యడిగినయెడ నృపాల.

క. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీ డొకించుక,యును దనదెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్.

వ. ఇట్టి చందంబులు ధర్మనందనునకుం గలవని పలికి విదురుం డది ప్రసంగంబుగాఁ బాండవుల బ్రశంసించి నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి యిప్పు డుపేక్షించి వారల వెలి నుండ నూరకుండం దగునే తగుపాలిచ్చి వారి రావించి నీ కొడుకులతోడివారింగా నడపుట యుచితంబు మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడ రాదనిన నమ్మాటలు వెడవెడ యూకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె.

తే. హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగు దీవ, ధర్మసుతుచందమును విదితంబు నీకు
నట్లు గావున నెఱిఁగింపు మఖిలకార్య, జాతమును జిత్తతాపోపశమము గాఁగ.

క. అనుడు విదురుఁ డాతని కి, ట్లను నిమ్మెయి నన్ను నొత్తి యడిగినఁ జెప్పం
జను నున్నరూపు సెప్పెద, విను మవధానంబుతోడ విమలవిచారా.

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా యిటు దమ్మునిభాగ మీక నీ
వెక్కటి బ్రింగఁ జూచె దది యె ట్లలుగున్ విను మీను లోలతన్

గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పు సూవె యి
ట్లుక్కువఁ జైన నీ కొడుకు నుల్లము నున్నటు లాడఁ గూడునే.

క. అన విని నిరుత్తరుం డయి, మనుజేంద్రుఁడు గొంతసేపు మ్రాన్పడి తలఁపుల్
పెనఁగొన నిద్రాహీనిం, దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్.

క. ఇందాఁక నీదుపలుకుల, డెందము తాపంబు గొంత డిందుపడియె నా
కుం దగ నయానయంబులచందంబులు సెప్పుచుండు సౌజన్యనిధీ.

వ. అనిన విని విదురుం డిట్లనియె.

ఆ. తనియఁ బండ కుండ మును గోసికొనఁ జవి, చేటు కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వమైనఁ గొనిన ఫల మించుఁ జెడదు బీజంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు.

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి, పువ్వుఁ దేనియఁ గొనియెడు పోల్కి నెదురు
గంద కుండఁగఁ గొనునది కార్యఫలము, బొగ్గులకుఁ బోలె మొద లంటఁ బొడువఁ జనదు.

క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న, న్నరుఁడు దెవులు లేని వేదనం బడు నధిపా.

క. ఎదిరికి హితమును బ్రియమును, మది కింపును గాఁగఁ బలుకుమాటలు పెక్కై
యొదవినను లెస్స యటుగా, కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్.

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ, గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం
దులువతనంబును వచ్చును, బలుకుబడిన కాన పొసఁగఁ బలుకఁ గవలయున్.

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దెగిన మ్రానఁ జిగురు వొడముఁ బలుకులం
జెడఁ దునిసినకార్యంబు ని, గుడ నేరదు పిదప నెట్టు గురువంశనిధీ.

క. తనువున విఱిగినయలుగుల, ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్
మనమున నాటినమాటలు, విను మెన్నియుపాయములను వెడలునె యధిపా.

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు నీకొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్
వెక్కలు పెక్కుభంగులను బ్రేలుచు నుండఁగ నీవు దానికిన్
స్రుక్కక వించు నుండె దనురూపమె నీ కిది కౌరవేశ్వరా.

ఆ. చేటుకాల మైనఁ జెట్టమాటలు నెఱి, గాని తెఱవువట్టు కర్జములును
దగినయట్ల తోఁచుఁ దగియెడునవి యవి, నీతు లని మనంబు నిశ్చయించు.

వ. నీబుద్ధి పాండవులతోడి విరోధంబునెడ మరలంబడమి పాపం బింతియ కాక యేమి సేయుదము మన కులంబునం దేజోధైర్యధార్మికత్వాదిగుణంబుల గరిష్ఠుండయిన యుధిష్ఠిరుండు నీసిరికి వెలియై యట్లుంట దగవగునే నీ పెద్దతనంబు సూచి సైరణ వాటించి యున్నవాఁ డనిన విదురుదిక్కు మొగం బై ధృతరాష్ట్రుండు నీ చెప్పిన నీతివాక్యంబుల నామనంబు దనివోవ దింకను జెప్పు మనవుడు నతండు వెండియు నిట్లనియె.

ఆ. సకలపుణ్య కర్మచయమును నొకదెస, వినుము పాడి దప్ప కునికియొక్క
దిక్కు దీని శ్రుతులు తెలిపెడు నెడఁ బాడి, కలిమి యెందుఁ బెద్దగా నుతించె.

తే. పాడి గలిగిన నిహలోక ఫలములెల్లఁ, జేరుటయ కాదు కీర్తియుఁ జెందుఁ బురుషు
ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత, కాలమును బుణ్యలోకంబు గల్గునండ్రు.

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచనుండును నంగిరసుం డను విప్రుకొడుకు సుధన్వుండును దమతమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క ధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సఱచి వచ్చి త న్నడిగిన నితండు గొడుకితండు లాఁతి యని తలంపక మధ్యస్థుండై సుధన్వు గెలిపించి యతనిచేత నిజతనయున్ని జీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రదికించెం గావున నీవును ధర్మంబు విడువక యధర్మోపేతులైన నీ కొడుకులవలని పక్షపాతంబు విడిచి తెఱంగు సేయుము వారును నాపదలేక బ్రతుకుదురు నీవును శోకంబు లేక తక్కుదువని చెప్పి మఱియును.

క. పాపంబులు గర్హము లని, యేపునఁ జేయంగ నవియు నిం పగు ధర్మ
వ్యాపారంబు లకార్యము, లై పరిణతిఁ బొందె నేని నట్టుల చెల్లున్.

చ. అది సభయే ప్రియం బెనఁగ నార్యులు నిల్వరయేని నార్యులే
మదిఁ దలఁపంగ వారలు సముచితధర్మము వల్క రేని న
ట్టిదియును ధర్మమే తగ ఘటించిన నిక్కము లేదయేనిఁ దాఁ
బదిలపునిక్కమే యొక నెపం బిడు చొప్పగు నేని భూవరా.

ఉ. నీతిపథంబునన్ బ్రదుక నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతము లై కరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతము లైన భారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్.

ఆ. కయ్యమునక యెపుడుఁ గాలుద్రవ్వెదురు నీ పుత్రు లెల్ల సూతపుత్రుఁ డాది
యగు తదీయమంత్రు లంతకు ముందర, బిరుదు లీవు నీతి తెరువు సొరవు.

క. పాండవులు శౌర్య మొల్ల ర,ఖండిత నీతిప్రకారకార్యము మెచ్చి
యుండుదు రెదు రేచినఁ దుది, మండుదు రార్పంగ రాదు మఱి యెవ్వరికిన్.

క. తమతండ్రిభంగి నీకును సముచిత మగుభక్తి సేసి సజ్జన నుత మా
ర్గమున నడచువారల నీ, వమలమతిం గన్న కొడుకుల ట్లరయఁ దగున్.

వ. అని పలికి మఱియు నిట్లనియె.

క. కారణము లేకయును నృప, కారపరత్వమున నొరుల కార్యంబులకున్
వారనియలజడిఁ బడియెదు, వారల చూ యేడుగడయు వారికి నధిపా.

చ. ఒకరునిచేతి పోవును దదున్నతి ప్రాపును గాంచి యెల్ల వెం
టకును గొఱంత లేక పొగడం దగుసంపద నొంది యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసినకృతఘ్నుని పీనుఁగు నైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా.

వ. కావునఁ గృతము దలంపమి గీడు పాండురాజు నీకుం బరమభక్తుండు పాండవులునుం దేజోలాభంబుల గాంచిన వారలు వారల నాదరింపు మని చెప్పి వెండియు నిట్లనియె.

ఆ. బ్రదుకు చేటు పొగడువడుట దూ ఱొందుట, యీఁగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగుసౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి, వాని కింత యేల వగవ నధిప.

క. వగ బలము దఱుఁగు రూపఱు, వంచిన మతి దప్పఁ దెవులు వచ్చును దూరన్
వగచి నలంగినఁ బ్రియ మగుఁ బగతురకును వగచు టుడుగు పార్థివముఖ్యా.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె.

క. రిత్తయుపచారముల నే, నుత్తముఁ డగు ధర్మతనయు నుడికించితి దు
ర్వృత్తు లగు మత్సుతులకును, మిత్తి యగుం బోర వగలు మిగులక యున్నే.

వ. నెవ్వగలు నిప్పటిల్లనీక నిలుపునట్టిది యెయ్యది దాని నెఱిగింపు మనిన విదురుం డిట్లనియె.

తే. నియతతపమును నింద్రియ నిగ్రహంబు, భూరివిద్యయు శాంతికిఁ గారణములు
వాని యన్నింటికం టె మేలైనశాంతి, కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర.

వ. అని వెండియు.

క. జ్ఞాతుల పోరితమును గో, వ్రాతము నాక్రమము విప్రవర్గముచనవు న
నాతుల కారించుటయును, బ్రీతిం జన నిచ్చు నతని పెం పొప్పు నృపా.

క. అలమికొని యొండొరుల ప్రో, పులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొందె బహుజ్ఞా
తులు నెమ్మిఁ గూడి తామర, కొలని క్రియన్ సిరికిఁ బట్టగుదు రజ్జ్యులు లై. ★



# విక్రమార్కుడి మార్కు సింహాసనం

చలచిత్ర కథలు

ఎస్. పార్థసారథి

రాజా ఆలోచనలో పడిపోయాడు.

కొలంబస్ అతని భుజంతట్టి లేవదీశాడు.

లేస్తూనే కళ్ళు నులుపుకుని "సారీ" అన్నాడు రాజా.

'ఏం గిరాకీ, ఏమిటంత దీర్ఘాలోచన?' అన్నాడు కొలంబస్.

'అట్టే ఆలోచన కాదు. అది మనకసలు అలవాటు లేదు. మీకే ఏదో చెప్తానన్నారుగా. పై వారం మరో కథని.'

'అముక్కా నేననందే. పాసార్తి కాబోలు. వాడేనా పొరబాటున మరోవారం పై కథ అనబోయి, పైవారం మరో కథ అన్నాడు గావును. ఔను గాని—'

చూస్తూ ఉండగా రాజా బిర్రబిగుసుకు పోయాడు. తెలుగు సినిమాలో కష్టాలు భరిస్తూ, చీవాట్ల డైలాగులు వింటున్న మంచి పాత్రలా ముక్కుపుటాలు పూరించాడు. మోర పైకెత్తాడు. అనక ఊపిరి బిగబట్టాడు. లాంగ్‌షాట్‌లోంచి చూస్తే రవివర్మ విశ్వామిత్రుడి ఫక్కీలో తయారయ్యాడు.

అదేం అలా అయి పోతున్నావు? ఫట్లా ప్రాయా?" అన్నాడు కొలంబస్. రాజా మాట్లాడలేదు. తక్షణం, సూక్ష్మబుద్ధి కొలంబస్ క్షణంలో వలువంకలా పరకాయించి, పాతిక మువ్ఫైగజాల దూరాన మేనకఉందని పసిగట్టేశాడు.

ఆ మేనక, ఫుల్ కాస్ట్యూమ్‌లో ఉంది. ఏ పిక్చర్‌లోదో తెలీదుగాని, జనరల్ అప్సరస అనుకుంటే, ఇబ్బంది లేదు.

కొలంబస్, ఆప్యాయంగా. ఆమెవంక చూసి చిరునవ్వు విసిరాడు. మేనక రుసరుస లాడి, "నువ్వుకాదు నీ పక్కవాడిని ఇటు చూడమను" అన్న భావానికి అభినయం పట్టింది.

'ఏడా' అని ప్రతిసంజ్ఞ చేశాడు కొలంబస్.

ఔను మరే అంది మేనక తల.

'నిన్నుట' అన్నాడు కొలంబస్ రాజా వంక చూసి. నిన్నే అన్నాడు ఇంకో క్షణం ఆగి;

'నీ దుంపతెగ! అసాధ్యుడిలా ఉన్నావే. ఊళ్ళోదిగి 24 గంటలన్నా కాలేదుగాని, అప్పుడే పిల్లని పటడం, విడవడం, బడాయి పోడందాకా వచ్చేశావే. ఓ దుష్యంతుడా! భరతుడు కనబడడేల?" అన్నాడు అనక.

'సురూ' అన్నాడు రాజా ఆపాదమస్తకం తలత్ మహామద్ కంఠంలా వణికిపోతూ.

'మలేరియావా?' అన్నాడు కొలంబస్.

'కాదు. లక్ష్మన్నరసు. ఎగస్ట్రా. షి ఈజ్ వాంటింగ్ టు హీరోయిన్ మీ. అంచేత డోంటు సీ. అటువేపు చూడకండి." అని ప్రాధేయపడ్డాడు రాజా.

కొలంబస్ దూరానఉన్న మేనక, లేక శకుంతలవేపు చూశాడు; రాజాని క్లోజప్‌లో పరిశీలించాడు. 'హారి పిడుగా. మొత్తానికి కథకుడివే. సినిమాకథంత పని చేశావు, అన్నాడు ఉత్సాహంగా.

'నో సార్. కథకుడుకాదండి నేను. అయామ్ వాంటింగ్ టు హీరో—"

'సర్లేవయ్యా. నిన్ను బెల్లించి ఇపుడెవడూ రైటరుగా బుక్ చేసెయ్యడులే. గ్రంథసాంగుడి వేనూ అంటున్నా.'

'గ్రంథసాంగ్సు ఎప్పుడూ రాయలేదండి. రాయగలననుకోండి.'

'భేష్ అలాగే. ఇప్పటికీచర్చనిక్కడ వదిలెయ్యి. ఆ అమ్మడెవరో పిలుస్తోందిగాని వెళ్ళి మాట్లాడు.'

'నోనోనోనో. ఇపుడొద్దండి డేంజర్. ఆ అమ్మాయి మంచి పిల్లే. కాని, పాపం నాతో హీరోయిను వేస్తానంటుంది. నేను చూస్తే పాపం—ముందరే ఇంత చిన్నవాళ్ళని ఎలా ఎంకరేజిచేస్తాను? అయామే హీరో అఫ్ సిక్స్ డ్రామాస్. భయపడుతుందికదా. స్టార్ వాల్యూకూడా లేదు. ముందర ఏ అంజలీ, సావిత్రీ, వైజయంతిమాలా వాళ్ళతోనో నాలుగైదు పిక్చర్లువేశాక 'చూస్తానన్నాను. లక్షున్నరసు ఇపుడే వెయ్యమంటుంది. యూ నోన్‌లీ సెల్మ్. మీరే చెప్పండి నాకు. హౌ కెనైయేబుల్. నేనెలా—"

"నా మాటవిని నువ్వు మీ ఊరి హేరా హాలులో ట్రాన్స్లేటరుగా చేరిపోరాదు?" అన్నాడు కొలంబస్. సిగరెట్ ముట్టిస్తూ.

"నో సార్. కాదండి."

'స్టాప్-ఆగు-ఆ పిల్ల సంగతి చూస్తావా లేదా? నేనే చూద్దునుగాని, కొంచెం భయంగా ఉంది. ఆ స్టుడియో కంకణాలతో కొడుతుందని...అవి పాడైపోతాయిగదా. అందుకు.'

'డోంటంటే డోంటేనండి. మనతో ఒకటే మాట. మనం ఇట్నుంచిలా పోదాంరాండి' అన్నాడు రాజా వెనక్కు తిరిగి కొలంబస్ చెయ్యిపట్టుకు లాగుతూ.

* * *

"పిలుస్తూంటే నీగ్గాదు? యాడకి లగెత్తుండావ్" అని కంచుగంట మోగింది రాజా చెవులో.

జంకుతూనే వెనక్కు తిరిగాడు రాజా. 'దటీజ్ నాట్. అదికాదు నర్సూ' అంటూ సంజాయిషీ ఆరంభించాడు. దగ్గరకొచ్చేసింది గదా అని.

"ఇదిగో బుల్లోడా! అలాటిఎంగిలికూతలు కుయిమోక నాకాడ. అడిగిందానికి జవా

(46- వ పేజీ చూడండి)

# విస్సిగాడు

విస్సిగాడు అంటే ఆవూళ్ళో అందరికీ హడలే. విస్సిగాడి అసలు పేరు విశ్వేశ్వర రావు. వాళ్ళమ్మ ముద్దుగా 'విస్సీ' అని పిలిచేది. కాని వాడి అల్లరికి "విస్సిగాడు" గా రూపొందిందా నామధేయం.

ఇంతకూ చెప్పొచ్చే దేమిటంటే వాడలా ఎందుకు తయారయ్యాడు అని?—వాడు బళ్ళో ఏడోతరగతి చదువుతోన్నాడు. అయినా వాడి పేరుప్రఖ్యాతులు బడిఅంతా వ్యాపించాయి. ఎక్కడన్నా పుస్తకాలు, పెన్సిళ్ళు పోయాయంటే హెడ్ మాస్టరు ముందుగా వాడినే పిల్పించేవాడు. సామాన్యంగా అవి వాడిదగ్గరే దొరికేవి. అందుకే వాడిని అంతా ద్వేషించేవాళ్ళు.

విచిత్రంఏమిటంటే వాడివెనక తిరగటానికి స్కూల్లో ప్రతికుర్రవాడు ఉబలాటపడే వాడు. వాడిని గురించి ఎంత చెడ్డగావిన్నా. విస్సిగాడిచుట్టూ అలా ఆపిల్లలు ఎందుకు చేరున్నారంటే చాలామంది చాలావిధాలుగా చెప్తారు. దొంగతనం చేసినా చిరుతిళ్ళకు ఆశించడని..చెడ్డవైపు ఆకర్షణ ఎక్కువని—ఇలా. కాని నేనెప్పుడూ అలాంటిది గమనించలేదు. వాడిలోగల ప్రత్యేకాకర్షణ.

నేనాస్కూల్లో మాస్టరుగిరి వెలిగిస్తోన్న తొలిరోజులకు విస్సిగాడు నా దృష్టిలోకి వచ్చాడు. అంతకుపూర్వం నా దృష్టిలోకి. రాకపోవటం కేవలం నా దృష్టిలోపం మాత్రమే. ఏమైనా వాడు నాదృష్టిలోకి అప్పటికైనా వచ్చాడు.

ఓరోజు పిల్లలంతా నాకో మహజరు పంపారు. ఈపద్ధతిని పిల్లలు ప్రవర్తించడం నాకు చాలా ఆశ్చర్యంవేసింది. ఆ మహజరులో వున్న సంగతులు—ఆ నెలలో క్లాసులో జరిగిన దొంగతనాలు, వాళ్ళ అనుమానాలు.

అది చదువుతుని "ఎవరీ విశ్వేశ్వర్రావు"? అన్నాను.

ఓ కుర్రవాడు లేచి నిలబడ్డాడు. నల్లగా బక్కపల్చగా, చింపిరిజుట్టు, చిరిగినచొక్కా లాగు—ఇది వాడి అవతారం.

"ఇట్రా"

ధీమాగా వచ్చాడు.

"మీ నాన్న పేరేమిటి?"

"రమణయ్య"

"సాయంకాలం నన్ను కలుసుకోమని చెప్పు"

"అలాగేనండి."

క్లాసంతా గొల్లున నవ్వింది. పక్కన ఓ కుర్రవాడు లేచి "వాళ్ళ నాన్న లేడండి" అన్నాడు.

"ఎక్కడకు వెళ్ళాడు?"

"చచ్చిపోయాడులెండి" అన్నాడు విస్సిగాడు. నాకు కోపం వచ్చింది.

కాని ఈ మాట అంటోన్నప్పుడు వాడే మాత్రం చలించలేదు. పైగా నిశ్చలంగా నిల్చొని వున్నాడు. నాకెంతో ఆశ్చర్యం వేసింది.

వాడ్ని దగ్గరగా పిల్చాను. "ఏరా! అలా చెప్పొచ్చా?

"నిజం చెప్పకూడదా?"

## కె. బాబూరావు

నాకు మండిపోయింది. ఫెడీల్మని చెంప మీద ఒకటి వేశాను. "నిజం చెప్పే సత్యసంధుడివిగా. మరి ఈ దొంగతనాలేమిటి?"

వాడికళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

"హుఁ! చేశాను" అన్నాడు కన్నీళ్ళు తుడుచుకుంటూ.

నాకు ఆశ్చర్యం ఓ వైపునుంచి కలుగుతున్నా మరో వైపునుంచికోపం వస్తోంది.

"ఇవన్నీ ఏం చేశావు?"

"మీ కెందుకు?"

"ఏం చేశావో చెప్పు?" నేను గద్దించా.

వాడు ఏడుపు దిగమింగుకొని "నా యిష్టమొచ్చినట్టు చేసుకున్నా," అన్నాడు.

నాకు కోపం మితిమీరిపోయింది. చేతిలో వున్న బెత్తంపెట్టి రెండుదెబ్బలు కొట్టానో లేదో వాడు పారిపోయాడు.

నాకు ఏడుపొచ్చినంత పనయింది. నా గౌరవానికి తీరని అపచారం జరిగినట్లు బాధపడ్డాను.

క్లాసయినవెంటనే టీచర్సు రూంలో నా సహోధ్యాపకుడు రామారావును ఈ విషయంలో కదిలించాను.

"అరెరె! వాడిజోలికి ఎందుకు పోయారండీ...ఒట్టి గడుగ్గాయి" అన్నాడాయన.

ఆయ నిలా చెప్పుకొచ్చాడు. "మొదట నేనూ మీలాగా కొట్టాను. ఓరోజున వాడు నా దగ్గరకొచ్చి 'నన్నెందుకు కొట్టారు?' అని నిలదీసి అడిగాడు. నాకు చర్రుమంది." 'పిచ్చి పిచ్చి వేషాలు వేశావంటే చంపేస్తా' అని బెదిరించా. వాడు తలెత్తి ధీమాగా నా వైపుతిరిగి 'ఏమైనా చేశారంటే మీరు స్కూలుకు రారూ?... అప్పుడు చెప్తా' అంటూ గబ గబా వెళ్ళిపోయాడు. నేను అలాగే స్తబ్ధుడినయినాను. ఆ స్తబ్ధతనుంచి ఈ వలకొచ్చి వాడినిగురించి ఆచోకీ తీశాను. తండ్రి లేడట. తల్లి కూలి నాలిచేసి వాడిని చదివిస్తోందట. వూళ్ళో చిన్న పెద్ద అందరికీ వీడంటే తగనిభయం. ఓసారి మున్సబుగారు వాడినేదో అన్నాడు. ఆమర్నాడే ఆయన ఎడ్లు అదృశ్యమయ్యాయి. నాలుగుమైళ్ళ అవతల నున్న బందిలదొడ్లో వున్నాయి. వాడితల్లి కూడవాడినేమీ అనదు పైగా మనమేమన్నా చెప్పే మావాడు అట్లాంటివాడు కాదు. అని పోటాట పెట్టుకుంటుంది. వూరంతా నానా గొడవాచేస్తుంది ఆనోటికి జడిసి ఎవరూ మాట్లాడరు..."

ఇంతలో బెల్లుమోగింది. క్లాసుకు వెళ్ళిపోయాము.

ఆరోజు సాయంకాలం విస్సి మాయింటి ముందు కనపడ్డాడు. నన్ను కూడ సంజాయిషీ అడిగటానికి వచ్చాడన్నమాట...నాలో కోపం ఉడుకుతోన్నా ఓవిధమైన ప్రత్యేకతవల్ల వాడిని చూడంగానే ఆ కోపం అదృశ్యమైంది.

"ఏం? ఇలా వచ్చావు?"

"ప్రొద్దున నన్ను అనవసరంగా కొట్టారు కదూ?"

"ఇలారా"

దగ్గరగా వచ్చాడు. భుజంమీద చేయివేసి ఇంట్లోకివెళ్ళి "శశీ! రెండు ప్లేటు లు తీసురా" అన్నాను.

నాశశి రెండుప్లేట్ల నిండా జిలేబి తీసుకొచ్చి వీడినిచూసి అదోలా అయిపోయింది. కాఫీ త్రాగంగానే వాడిని నా వెంటరమ్మన్నాను. వాడు ఆశ్చర్యపోతూ నన్ను సరించాడు. కాలవగట్టుకు వెళ్ళగానే "ఊఁ! కానియ్! నేనంటె కోపంగావుంది కదూ! రాయిపెట్టి కొట్టగలవా?" అన్నా.

వాడి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

ఇంటికి వెళ్ళగానే శశి ఇలా అంది: "వాగ్దానం ఎందుకు రానిచ్చారండీ?...వట్టి దొంగ వెధవ...ఏదైనా చేతో పట్టుకెళ్ళగలడు."

నేను నవ్వి వూరుకున్నాను.

* * *

రెండురోజులు గడిచాయి. ఓ రోజు క్లాసులోకి వెడుతుంటే టేబులువద్ద విస్సిగాడు నిల్చుని వున్నాడు. పిల్లలంతా వాడి వైపు శ్రద్ధగా చూస్తున్నారు. నేను తలుపు చాటున వుండిపోయాను, ఏం చేస్తాడో చూద్దామనే ఆసక్తితో.

ఓ దారం తీసుకున్నాడు. ఒక కొసవైపు కొంచెమే వుండగా చేసి గబగబ మింగి 'హు' అన్నాడు. ఆ వుండదారం ముక్కులోంచి ఊడలికొచ్చింది. రెండు కొసలు పుచ్చుకొని చల్లకవ్వం త్రిప్పినట్టు ఆ దారం అటూ ఇటూ త్రిప్పడం సాగించాడు.

ఆశ్చర్యంలో మునిగిపోయా నేను. పిల్లలంతా నన్ను గమనించారల్లేవుంది. విస్సిగాడు మెదలకుండావెళ్లి సీటులో కూర్చొన్నాడు. క్లాసు నిశ్శబ్దంగావుంది. బరువుగా అంగలు వేస్తూ క్లాసులో ప్రవేశించి "ఇలారా!" అన్నాను.

వాడొచ్చాడు. "సాయంకాలం ఇంటివద్ద కనబడు."

తలూపి వెళ్లాడు.

మధ్యాహ్నం వాడి ప్రోగ్రెసు పరిశీలించా. ఆశ్చర్యం ఏమిటంటే కొన్ని సబ్జెక్టులలో ఫస్టుమార్కులు వచ్చాయి...అనుమానం వచ్చి రామారావుని ఇలా అడిగాను. "విస్సిగాడు బాగా కాపీలుచేస్తాడా?"

ఆయన విచిత్రంగా నా వంకచూసి "నేనూ అలానే అనుమానించాను. కాని ఆ విషయంలో నేను గ్యారంటీ ఇవ్వగలను" అన్నాడు.

ఆ సాయంకాలం విస్సిగాడితో ఇలా అన్నాను: "రోజూ వచ్చి తెలియనివి చెప్పించుకుపో."

వాడు కళ్లు పెద్దవిచేసి "మరి మేము జీతం ఇవ్వలేము" అన్నాడు.

"ఫర్వాలేదులే. అయినా అల్లరిగా తిరగకపోతే నీకు గడవదేరా?"

"అల్లరిగా ఎక్కడ తిరిగానండి!"

"మరి అంతా చెప్పుకుంటారుగా"

"వాళ్ళొట్టి అల్లరివాళ్ళండి."

నిశ్చలంగా అన్న ఈ మాటల సత్యాసత్య విచారణకు నేను పోదలచలేదు. ఈ వృద్ధకంఠంతోనే అన్నాను: "రేపట్నించిరా"

"అలాగేనండి".

ఇంటికి వెళ్ళగానే శశి "మనమేమన్నా సంసారం చేయాలటండీ?...మీకేం?... రేపు వాడేదైనా చేతో పుచ్చుకెళ్తే మీరేం చేయగలరు?" అంది.



నాట్య సాధన

చిత్రకారుడు: వై. మురహరిరావు—బాత్రేరు.

# విస్సిగాడు

"అంత అప్రయోజకుడివి నన్నెందుకలా అడిగావు?"

వాడు నిశ్చేష్టుడై అలాగే చూస్తున్నాడు "ఏం! మాట్లాడవేం?"

వాడు గిరుక్కున వెనక్కి తిరిగి పారిపోయాడు. నాకు తెలియకుండానే వాడి మాటలు పావేసివుంటాయని అలా జరగాలనే ఇలా ప్రశ్నించాను.

విస్సిగాడు రోజూ స్కూలు వదలగానే ఇంటికి వస్తున్నాడు. అక్కడినుండి కాలవ గట్టుకు వెళ్ళడం, ఏవేవో కథలు నేను చెప్పడం... రాత్రికి తిరిగి రాగానే క్లాసు పుస్తకాలు చెప్పి పంపించటం... ఈ కార్యక్రమం నెలరోజుల్నించి జరుగుతోంది. ఏదెలా జరిగినా ఈ నెలరోజుల్లో వాణ్ని గురించి చాలా తెల్సుకున్నా.

వాడు నీటుగా సిగిరెట్లు కాలుస్తాడు. దరిదాపుగా నిశాసంచారి. ఒకరికి అన్యాయం చేద్దామనే మనస్తత్వం ఏమాత్రం లేకపోయినా, ఎవరన్నా ఏమైనా అంటే ఏమాత్రం సహించలేడు. పైగా తీవ్రమయిన ప్రతీకారం చేసితీర్తాడు. ఈ తీవ్ర ప్రతీకారేచ్ఛే వాడిని అల్లరివాడుగా చేసింది.

అసలు వాడి జన్మవిధానాన్ని గురించే ఓ అనుమానాస్పదమయిన గాథ ఉంది. వాళ్ళ నాన్న అని చెప్పిన రమణయ్య వాడికి సంఘ సూత్రాల ప్రకారం తండ్రికాడు. వాడితల్లి ప్రియుడు. వాడివల్ల జన్మించినవాడే వీడు. తల్లి అసలు భర్త గోపయ్య. ఇద్దరూ భయంకరమయిన ప్రకృతి గలవాళ్ళు. వీడి తల్లి కోసం పోట్లాడుకుని ఇద్దరూ మరణించారు, పరస్పరం పొడుచుకొని...అందమైన స్త్రీగా పరిగణింబడే వీడి తల్లికోసం ఇలా రెండు చావులు జరిగాయి.

కాని ఆమె అందం ఆట్టేకాలం నిలవలేదు. విస్సిగాడి ఏడో సంవత్సరంలో వాడి తల్లికి మసూచికం సోకింది. వూళ్ళో వాళ్ళంతా వాడితల్లిని వూళ్ళోనుంచి వెళ్ళగొట్టారు. నా అన్నవారు లేక వూరిబైట ఓ పాడుబడ్డ గుడిశెలో, వ్యాధిగ్రస్తురాలయిన తల్లితో, విస్సిగాడు తన ఏడోయేట ఒకనెల రోజులు గడిపాడంటే ఊహించడం కష్టం. అప్పటి వాడి జీవితంలో నికృష్టతే వాడినో సాహసవీరుణ్ని గా తయారుచేసింది.

అన్నంలేక అలమటిస్తూ, అడుక్కోడానికి పోయినా, ఎవ్వరూ ఓ మెతుకయినా వేయకపోగా, కసిరికొట్టడం వాడికి సహించరాని విషయమైంది. గుడిసెకు వస్తే రోగిష్టియైన తల్లి.

మర్నాటినుంచే వాడో క్రొత్తపద్ధతి కనిపెట్టాడు. సరాసరి వంటింట్లోకి వెళ్ళిపోయి, అదెవరి ఇల్లయినా కానీయండి కావల్సినవి తెచ్చుకోవటం...మొదట వూళ్ళో వాళ్ళు వీణ్ని కొటబోయినా, వాడు చేసే ప్రతీకారానికి జడిసిపోయారు.

తర్వాతనిదానంగా వాడితల్లి కోలుకొంది. కాని వాడి ప్రవర్తనలో మార్పురాలేదు.

విస్సిగాడు ఓ చరిత్ర హీనుడు కావచ్చు కాని ఆ హీనత్వం నాకేం కన్పడలేదు. దాని చుట్టూ కంచుగోడలా ఓ విధమైన ఆకర్షణ వుంది.

ఆ కర్షణ అనేది ఎంత బలుపుబడితో వాడిలోవుందంటే నేనులెక్క చెప్పలేను. కాని ఓ చిన్న సంఘటన చెప్తాను.

పొలాలన్నీ పచ్చటి పైర్లతో కళకళలాడుతున్నాయి. ఆ రోజు సెలవుదినం పొరుగూరిలో నున్న మిత్రు నింటికి బయలుదేరా నేను. చల్లనిగాలి, పచ్చనిపైర్లు, పొలాల్లో పనిచేస్తోన్న పల్లెయుల్ని చూసి నాలో ఏ...వో...భావాలు వువ్వెత్తున లేచాయి. ఆనందంలో తన్మయుడి నయినా నేను.

"ఏరా! ఆ చేలో చుక్కాకు కోసి తేద్దామా మా ఎడ్లకు?" విస్సిగాడి ఆ మాటలు నాకు స్పష్టంగా వినపడబట్టే ఆ తన్మయతలోనుండి ఈవల కొచ్చాను.

"ఎవరి దాచేను?" ఇంకో స్వరం.

"ఊళ్ళోవాళ్ళది. ఎవరిదైతే మనకేంకవలా" విస్సిగాడన్నాడు.

"అయితేపద"

"స్స!...అదెక్కడ బాగా లేదు. ఈ చేలో కోద్దామా?"

"ఇదెవరిది?"

"మీదే"

"అమ్మో! మానాన్న కొప్పడడూ?"

"అంతేరా. ఇతరులదయితే..." విస్సిగాడి మాటలు అంటోండగానే నేను వాళ్ళను కలుసుకున్నాను. ఇద్దర్నీ నేను కోప్పడి పంపినా ఈ సంభాషణంతా నాచెవుల్లో— అదే పనిగా వినపడుతోంది. విచిత్రం ఏమిటంటే ఆ రెండో కుర్రవాడి జీవితం అప్పటినుండి పూర్తిగా మారింది. ఈకథ వ్రాసేనాటికి ఆ కుర్రవాడు పిల్లల తండ్రయినాడు. నే నంత చిన్నతనంనుండి అతని జీవితాన్ని చూస్తూ వచ్చాను. నాకు స్పష్టమైంది ఒకేఒక సంగతి. ఆనాటి ఆ సంఘటన అతనిలో మార్పు కలిగించింది. అది చిరుతప్రాయంలోనే గనుక సులభంగా మరెవ్వరు గమనించకుండా జరిగిపోయింది.

* * *

ఆ రోజు హెడ్‌మాష్టరు రూంలోకి వెళ్తుంటే లోపల విస్సిగాడిమాటలు వినపడుతున్నాయి.

"మరి నన్నెందుకు తిట్టాలి?"

★ విస్సిగాడు ★

"అరె! ఫూల్!... ఫూల్ ... ఇంకా మాట్లాడుతున్నావా?...రాస్కెల్"

ఛెళ్ మనే ధ్వని, ఆ పైన విస్సిగాడు ఏడుస్తూ ఆయన్ని తిట్టడం ... ఆ పైన... ఛెళ్ ... ఛెళ్ ...మనే ధ్వని...విస్సిగాడు ఆ బెత్తం లాక్కొని అప్పుడే లోపలకు అడుర్దాగా అడుగు పెడుతున్న నన్ను దూసుకుపోవటం ... అంతా క్షణాలపైన జరిగిపోయింది.

హెడ్‌మాష్టరు తలాంచుకొని, అంత లోనే లేని హుందాతనం తెచ్చుకొని... "వెధవ...హు! ... ఎడ్యుకేషన్ అంతా నాశనమయిపోయింది...రౌడిజం ఎక్కువై పోతోంది..."

"ఏమైందండీ?"

ఆయన నా మాట వినిపించుకోనట్టు "ఇలా ప్రతి కుర్రవాడు రెచ్చిపోవటానికి అసలు కారణం ఎక్కడో వుంది. ఎవరన్నా రెచ్చగొట్టందే వాళ్ళిలా రేగుతారటండీ!" అంటూ నావైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

ఈ మహాశయుని ఆలోచనలు ఎంతదూరం వెళ్ళినయ్యో నాకప్పటి కర్థం అయింది. నేనంటే ఇక్కడ స్కూలు కమిటీనుండి, ఉపాధ్యాయులవరకూ ఎంత నిరసనవుందో ఈ మాటలు నిదర్శన మిస్తున్నాయి.

"అయినా మాష్టారూ! ఈ విస్సిగాడికి మీరు చదువు చెబుతున్నారటకదండీ?" అని నా కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

నా పరిస్థితి నా కర్థం అయింది. మొత్తాని కాయన వాడిని ఏదో ఒకటి చెయ్యందే వదలడు. నేను అడ్డు చెప్పడం అది నా వుద్యోగానికే భంగం కావచ్చు.

ఆర్థికంగా నా పరిస్థితులు ఏమంత చెప్పుకోదగవి కావు. అనవసరంగా ఈ విషయంలో ప్రమేయం కలుగజేసుకొని బాధల్ని కొనితెచ్చుకోవడం శుద్ధ తెలివి తక్కువ—అయినా నాలో ఏదో బాధగానే ఉంది. విస్సిగాడు నావంక అదోలా చూస్తున్నట్టనిపించింది. విషయం ఏమిటో తెలీకపోయినా, విస్సిగాడి పక్షంలో ఎంత న్యాయమున్నా, అదిక్కడ ఏ మాత్రం బలీయమైంది కాకపోగా అత్యంత బలహీనమైందనేది స్పష్టం. విస్సిగాడిని వెనకేసుకొని మాట్లాడటమంటే కనీసం సానుభూతైనా ఎవ్వరూ చూపించలేరు. ఈ వుద్దేశంతోనే ఇలా అన్నాను. "క్షమించాలి. వాడి విషయంలో ప్రత్యేకించి నేనేమి అభ్యంతరం తెల్పను. మీ యిష్టం. అయినా ఓ సలహా. ఒక విద్యార్థినిగురించి మనం చేసే నిర్ణయాలు ఆ విద్యార్థి జీవితాన్నంతటినీ నిర్ణయిస్తాయని మాత్రం గుర్తించుకోండి."

గబగబ బయటకు వచ్చేశాను. నే ననుకున్నంతా జరిగింది. ఆ సాయంకాలం ఓ నోటీసు ప్రతి క్లాసుకు వచ్చింది. "...ప్రవర్తన బాగుండకపోవటంవల్ల విశ్వేశ్వర్రావుని స్కూలునుండి బహిష్కరించడమైంది."

ఈ నోటీసు క్లాసులో చదువుతోంటే నా కళ్ళవెంట నీళ్లు గిర్రున తిరిగాయి. విస్సిగాడి ముఖం అలా నా ముందు నిల్చొని నన్నిలా ప్రశ్నిస్తోన్నట్టనిపించింది. "నీ నిజాయితీని బలిపెట్టుకున్నావు. ఆత్మసాక్షిత్వాన్ని నాశనం చేసుకున్నారు."

ఇంటికి రాగానే విస్సిగాడు కనపడ్డాడు. నాకు చచ్చేంత కోపం వచ్చింది. "ఫో!... నా ముందునుంచి ఫో!..." అన్నాను.

ఆప్యాయత అనేది కోపంగా రూపాంతరం అప్పుడప్పుడు పొందుతుంది. నిజంగా ఆ పరిస్థితులు చాలా భయంకర పరిణామాలకు దారితీస్తాయి... అలాంటిదే అప్పటి నాకోపం.

కాని, అసలు విస్సిగాడి పై హెడ్‌మాష్టరుకి కోపం రావటానికి కారణం ఇది కమిటి ప్రెసిడెంటుగారి అమ్మాయి విస్సిగాడిని చింతకాయలు కోసి పెట్టమందట. వాడు కోయనన్నాడట. ఆ అమ్మాయి వీడిని వెక్కిరించిందట. వీడూ వెక్కిరించాడు. ఆ అమ్మాయి తిట్టింది. వాడు తిట్టాడు... ఆ అమ్మాయి వెళ్లి వాళ్ళ నాన్నగారితో విస్సిగాడు వూరికే వుత్తి పుణ్యానికి కొట్టాడని ఫిర్యాదుచేసింది. ప్రెసిడెంటుగారి ప్రమేయం ఇంతవరకు తీసుకొచ్చింది.

అప్పటికి ఇవేవీ నాకు తెలియవు. పిచ్చి కోపంలో "ఫో!... వెధవా!... నా కంటికి కనపడబోకు..." అన్నాను.

వాడేదో చెప్పబోయాడు.

"పోతావా? పోవా?" బిగ్గరగా అరిచాను.

అంతే విస్సిగాడు మళ్ళా నా కంటికి కనపడలేదు. మర్నాటినుంచి నేను చాలా బాధపడ్డాను... అలా అంతకోపం ఎందుకు చూపానా అని... ఎక్కడకు వెళ్ళాడో కాని వాళ్లమ్మకూడ మూడోరోజునుండి వూళ్లో కనపడలేదు.

ఓవారం గడిచిన తర్వాత ఓరోజు మధ్యాహ్నం బంట్రోతు నా చేతికో కార్డిచ్చాడు. "మాష్టరుగారూ!—నా తప్పేం లేదు. నాపై మీకు కోపం వచ్చింది... నేను మిమ్మల్ని మాత్రమే తప్పులేమైనా వుంటే క్షమాపణ వేడుకొంటున్నాను. చాలాదూరంగా పోతున్నాను... విస్సి."

నిర్వికారమైన నా శరీరం కుర్చీలో ఎలా కూలబడిందో నాకు తెలీదు... ఆ మాట కొస్తే ఆరోజు నన్ను నేను తెలుసుకు ప్రవర్తించానా? ★




[గతవారం తరువాయి]

## 12

రాత్రిపాటంతా అయ్యాక సభకు తిలకించి మీ దయ అన్నాడు పద్మనాభం. అనగా లేచేచినవాళ్లు లేచిపోయారు. మిగిలినవారిచ్చినదంతా కూడితే పావలా డబ్బులు కాలేదు! కిరసనూనెకే అరణాలయ్యింది. ఉదయం వూళ్లో ఇంటింటికీ తిరిగి దండుకుంటూ పుల్లయ్యగుమ్మంలో కాలుపెట్టాడు.

"బారతం అంతా యిప్పితే, ఒక ముసలోడు, ఒక కుర్రాడే! ఆ కుర్రోడి పదం యిన్నాడు. సల్లని పొద్దున భూమిమీద పడ్డాడు! అంతటోడు కాడా?" అన్నాడు పుల్లయ్య.

పుల్లయ్య పద్మనాభుడ్ని సత్కరించాడు. ఆ పొగడ్తలకు మీసాలు మెలివేశాడు.

"ఓరే, పద్మనాభం! చినుకులు రాలాయిరా...?"

"సల్లదనం. సల్లదనం!" బుడబుడక్కమని పిస్తూ ముందుకు నడిచిపోయాడు.

నీలి ఐదు రోజులనాడే వంటయింటికి వెళ్తూంటే, ముసలమ్మ వద్దనలేదు. పదకొండో రోజునాడు ఇంట్లో పనిపాటలు చేసుకుంటోంది. ఇరవయ్యొకటో రోజు వచ్చింది. నీలిని కొందరు పేరంటాళ్ళు పసుపు కుంకుమతో నడిబడ్డుకు తీసుకవెళ్ళారు. ఇసుక మూడు పోగులు పెట్టి పూజ చేయించారు. మా పిల్లడిని కాపాడమని కోరారు. దీనినే "కప్ప మొక్కడం" అంటారు. నీలి తరువాత కడవతో నీళ్ళు తెచ్చింది. ఆ వేళనుంచీ పనిపాట్లు పొలంలో కూడ చేసుకొంటోంది. సర్కారు సరుగుడు తోటలోకి వెళ్ళి తొక్కనొల్లి రావటం, వంట చెయ్యటం, పిల్లడిని చూసుకోవటం; అంతా మామూళ్లు పని అయిపోయింది. బయటకు వెళ్ళేటప్పుడు ముసలమ్మ మనుమడిదగ్గర ఉంటోంది.

పిల్లడికి రోజు విడిచి రోజు నీళ్ళు పోస్తున్నారు. జుత్తు తోటకూరలా పెరగడం చూసి పలుగురు ముత్తైదువులు ముద్దులవర్షం కురిపించి, "ఆడపిల్లే నే!" అన్నారు. ఆ మాటంటే మంట పుల్లయ్యకి. తండ్రి ముట్టుకుంటే, పిల్లడు రొండిపోతాడని ముసలమ్మ వద్దంటుంది. దోసపండులా వున్నాడని అయ్యకంటే అరురెట్లు పెరుగుతాడని ఇలా వూళ్లోవాళ్ళు తలోలా అంటూంటే, ముసలమ్మ దిషి తియ్యటానికి ఎక్కడలేని బొగ్గులూ, చీపురుపుల్లలు, మిరపకాయలూ, చాలటంలేదు. పిల్లడికి నీరు పోసేటప్పుడు దగ్గరేఉండి కడవల్లోని అడుగు నీరు ముందు పొయ్యొద్దని, మనవరాలిని మందలించేది. అడుగునీరు ముందుపోస్తే పిల్లలు అడుగంటి పోతారని.

నెలకు మూడురోజులు తక్కువలో పిల్లడిని ఉయ్యాలలో వేశారు. పుల్లయ్య పెద్ద సంబరంలా చేశాడు. లోకం అంతా పచ్చగా మనోహరంగా వుంది. తన జీవితంలో ఎన్నడూ లేని గర్వం వచ్చిపడింది. ఉన్న కొద్దీ గొప్పా ఆవేళ ఖర్చుపెట్టడానికి జంకలేదు. ఊళ్ళో అప్పుడే "రాసనింకు" అంటున్నారు. "వోరు ఫండు"కి డబ్బిచ్చి తీరాలని గ్రామనాయుడు (మునసబు) ఖచితంగా చెప్పి వెళ్ళి పోయాడు. "దానిని తరువాత సూడొచ్చు! కొడుకుని పలుగురూ దీవించాల!"

వచ్చినవాళ్ళు ఏక కంఠంతో దీవించారు. పిల్లాడివైపు చూస్తూంటేనే దీవించ బుద్ధి వేస్తోంది. నాలుగు నెలల పిల్లాడిలా నెల రోజులు పూర్తి కాకమునుపే కనిపిస్తున్నాడు. ఆగస్టు నెలాఖరు రోజులేమో ఎండలు తగ్గి భూమి చల్లబడివుంది. పొలాల్లో పైరునాటుకొని, భూసత్తువపులాగుకొని, మీదికెగసిపోతూ, గాలికి ఆడుతున్నది. రైతువారీ ప్రజలకు కావలిసినంత తీరుబడి ఆదెమ్మప్పుడే యీ సంబరమంతానూ. మళ్ళీ పెళ్ళిచేసిన్నాటివలె నడుం కట్టింది. ఈ కొద్దిరోజు

# ★ దగా పడిన తమ్ముడు ★

లోనే ఇంట్లో ఆమె పెద్దరికం తగ్గి, అల్లుడిది హెచ్చింది. ధాన్యం ధరలతో పాటు మిగతా వర్తకపు పంటల ధరలు పెరగటంతో, దానధర్మాల పరిణతి తగ్గించవలసి వచ్చింది. ఈ పరిస్థితికి ఆదెమ్మప్ప తట్టుకోలేక పోవటంలో, పెద్దరికం అల్లుడు తీసుకొన్నాడు. ఆర్థికంగా చేతులు కట్టివేసినా, మాట మంచితనం చూపిస్తూ పెద్దరికం చేస్తోంది. చేస్తూనే "ఎందుకు పనికొస్తానునాయనా? నా చేతిలో యేం వుంది.? మనవడికి బిళ్ళల మొలతాడైనా చెయ్యించలేకపోయాను!"

నీలి మాటందుకుంది. "ఇచ్చినంత మాటన్నారప్పా! యింకా ముందుకి అవ్వని ఆడించడా?"

లోకప్ప, ఆదెమ్మప్ప నవ్వుతూ "అదెంతటివాడు పుట్టుకొచ్చాడు-యింటిదగ్గరే కాదు వీధిలోనూ మెప్పు తెచ్చాడు-సచ్చి పొరగానవున్నాడు కానీ...!" అన్నారు.

పుల్లయ్య తండ్రిపేరత్తటంతో ఒళ్ళు పొంగింది. ఇంతలో కొడుకు కిలకిలలాడినట్లనిపించింది. ఒక్క ఊగురెగిరి: "అప్పా! అప్పా! అదిగోయి కిలకిల్లాడుతున్నాడు—ముల్లనాయుడి మనవడు...మల్లూ!" ఉత్సాహం ద్విగుణీకృతంకాగా కొడుకుని తీసుకోబోయాడు. అదేపేరుపెటడం అయిపోయింది.

ఆ క్షణంనుంచీ "మల్లు" అంటే ప్రాణం. తల్లిపాలలో బిడ్డడు దినదినవర్ధమానుడౌతున్నాడు. భార్య యిదివరలా తనవైపు మధురాతిమధురమైన చూపులు విసరకపోయినా, ఆ అమృతతుల్యమైన స్పర్శ అట్టే తగలకపోయినా...పెరుగుతున్న కొడుకునిచూసి అన్ని అనుభూతులు పొందుతున్నాడు.

గుడ్డివెంకన్న మనవడికి యేమీ ఇవ్వలేకపోయానని, గిజగిజ గింజుకుంటున్నాడు. గన్నెమ్మ పాతరోజులు జ్ఞాపకంతెచ్చుకుని యేడ్చుకుంది. కొడుకుని వుయ్యాలలో వేసిననాడు నీలి వాళ్ళకి కడుపునిండా పెట్టింది. వాళ్ళబాధను గ్రహించిన నీలి "అయ్యా! దేముడిదగ్గరికి పళ్ళూ కాయలూ తీసికెళ్తేనే వుందా? పువ్వేసి మొక్కి నోటికి మొక్కుం నేదా? ఇంత మంచి మనుషులు మీరు. నా కొడుకుని దీవించండి! చాల"ని, కొడుకుని దగ్గరగా తీసుకవెళ్ళింది.

వెంకన్న పిల్లడిని తడుముతూండగానే యేదో కోరిక మనసును క్షోభపరిచింది. ముద్దులాడుతూ "పాపిష్టోడ్ని తల్లీ! కళ్ళుంటే...!"

గన్నెమ్మ పిల్లడ్ని వర్ణించడం మొదలుపెట్టింది. వెంకన్న వింటూ: "తల్లీ! చేసిన ధర్మాలు వుట్టినే పోతాయా? నీ కొడుకు యెలాంటి వంకానవుటాడు! నేనెందుకనాల? నలుగురూ షెభాష్ అనరా? అలా అంటూనే భూమిమీద కుడిచెయ్యి యిటూ అటూరాస్తే చేతికి ఒకమంటి చెడ్డ దొరికింది. దానితో మనసులో యేదో ఆనందం పొంగి, చిరునగవు వెలగబోస్తూ, పిల్లడిచేతిని తడుముతూ పట్టుకొన్నాడు. పిల్లవాని అరచేతిలో చెడ్డపెట్టూ "మనవడా! మల్లూ! మనిషికి భూమిమీద పడిన దగ్గరనుండి దీనితోనే వున్నాదిరా;" అన్నాడు.

గన్నెమ్మ ఖుస్సుమంట్టూ "బంగారం భాగ్యం యివ్వలేకపోతే, పూరుకోవాలిగానీ..."

గుడ్డివెంకన్న ఆనందంతో కళ్ళు నీరుతో నిండిపోయాయి. ఈ కటిక పేదవాని కరుణా తిశయాలు పూర్తిగా అర్థంచేసుకున్న నీలికి, పెన్నిధి దొరికినట్లయి, కొడుకుచేతిలోని చెడ్డతోనే పట్టుకొని, యింటిలోనికి తీసుకపోయింది. ఆ బెడ్డను భద్రంగా కొడుకు తలవైపున వుంచింది.

రోజులు తిరిగిపోతున్నయ్, పుల్లయ్య యీమధ్య భార్యతో సంబంధం లేనట్లుగా ఆ కొడుకుతోనే వుందన్నట్లు మెసుల్తున్నాడు. నీలి ఆనాడు పొలానికివెళ్లి వేగంగా వస్తూన్న పుల్లయ్యవైపు చూసింది. క్రీగంటి చూపుచూసి దరహాసం చేసింది. పుల్లయ్య చూడలేదు. ఉయ్యాలలోవున్న పిల్లాడిని వూపుతూ... జోలపాట పాడుతోంది....

"ఎత్తుచెవులని ఏనుగుని వద్దంటి—
గుదికాళ్ళని గుర్రాన్ని వద్దంటె...
పడగతలనీ పామునీ వద్దంటి—
కోతినీపిల్లాడి, కొడుకునీ గంటే...జో
...జో—"

పుల్లయ్య పెళ్ళంవైపు నిదానించి చూస్తూ ...కొతిలా మూతిపెట్టాడు. మళ్ళీ వలపుతలపులు, వగలు కులుకులు, యిద్దరిలోనూ ప్రవేశించాయ్.

## 13

చలికాలం, ఒకరోజు సాయంత్రం, చీకటి పడ్డాక పొలంనుంచి నీలి, పుల్లయ్యా వస్తూంటే, నీలమ్మగుడిదగ్గర దాసుడు శివాలు వేస్తున్నాడు. ఇద్దరూ బయటనిల్చునే మొక్కు మొక్కారు. ఈ సంవత్సరం పంట ఉత్సాహంగాలేదు. మిడతలదండు హోరం వ్వశేషమయానికి వచ్చిపడింది. చేను యేపుగా పెరిగి కంటికి కనిపిస్తోందికానీ, సగానికిసగం పాలే. బుగత అసలే కఠినుడు. అందులో రోజుకిరోజు పెరిగే ఈ ధరలలో, ఒక గింజ తగ్గించనంటున్నాడు. ఇద్దరూ యీ విషయాలే మాట్లాడుకుంటూ పొలంనుంచి వచ్చారు.

గుడివేపు, గుడిలోని విగ్రహాలవేపు, విగ్రహాలని ఆరాధించే దాసునివేపు చూస్తూంటే, మనుష్యుల్లో యేదో మార్పువచ్చినట్లు స్పష్టమౌతోంది. రెండేళ్ళకీ ఇప్పటికీ తేడా ఎంతోవుంది. దాసుని శివాలకి భయపడ్డవాళ్లు లేరనికాదు. అలా భయపడ్డవాళ్ళ చేతుల్లో యే అధికారంలేదు. నాయుడు, పెద్దరైతు ఆ దరికి చేరరు. ఎవరైనా శివాలయ విషయం చెప్తే వినిపించుకోరు. ఇప్పుడు వాళ్ళకి వినిపించుకోవడానికి వ్యవధిలేదు. దాసునితో పాటు విగ్రహాలు, విగ్రహాలతో పాటు గుడీ,

ఈ క్రొత్త సంఘంలో అప్రధానమై పోయాయ్. సంబరాలు సెయ్యండన్న దాసునిగోల గాలిలో కలిసిపోతూంది. అంతే!

ఒంటిమీద కప్పుకోడానికి బట్టలేని దాసుడు శివాలు వేస్తున్నాడు. చుట్టూ చీకటి-గుడిలోనే చిన్న నూనెదీపం! అదీ ఆరిపోడానికి సిద్ధంగావున్నట్లుంది.

కదిలిపోడానికి సిద్ధంగావున్న ఈ జంట వైపుచూసి దాసుడు చెయిసైగచేశాడు. ఆగినవాళ్ళదగ్గరగా వస్తూ: "యిన్నారా ఆ తల్లియేం అన్నాదో, యెల్లి ఆ నాయుడితోనూ, పెద్దరైతులోనూ సెప్పండి. నేను సెపితే నాకు మతిపోనా దంటారు."

అలాగే అన్నట్లు తలలూపారు. దాసుడు గుడితలుపులువేస్తూ వెంటపడ్డాడు. వృద్ధాప్యం వచ్చిపడ్డట్లు ఒళ్ళు వణుకుతోంది. తనకి చెప్పుకోడానికి యెన్నో కష్టాలున్నయ్. వాడు యే కొడుకుమీద ఆశలుపెట్టుకున్నాడో, వాడే తనకు సరిగ్గా గంజి పొయ్యలేదు. దిగువ వీధిలో కంపి ఆడతాడు. ఓడిన్నాడు ఇంట్లో అందరిమీద లేస్తాడు. గెలిసిన్నాడు దొంగసారా కొట్లో కూర్చుంటాడు. తాగివచ్చి తండ్రిమీద లేస్తాడు. దాసుడు, ఎవరో తనను దగాచేసినట్లు, బాధపడిపోయాడు. అలా మెల్ల మెల్లగా అడుగులు వేసుకొంటూ: "అమ్మా! నీలమ్మా! నూడు! ఈగరికమీద నడుస్తున్నాం. గరికె తిన్న గాడిద సస్తాదిగాని, గరిక సావదు! నాను సచ్చిపోతాను. నాలాగే నా కొడుకూ సచ్చిపోతాడు - నాను కమీజు యెప్పుడూ యేసుకోలేదు. నా కొడుకు యేసుకొంటున్నాడు. ఆడికొడుకు పట్నం బాబులాగ బొత్తావులకోటు యేసుకొంటే యేసుకుంటాడు. మొకం లేటా, మొలగజ్జీ అయితే యేం లాభం అమ్మా? అలాగే ఊరు తయారైపోతూంది! లచ్చి లక్షణాలను తెస్తుందంటారు, డబ్బు పొంగిపోతూందని, గుండెనిదానేస్తున్నారు. అమ్మా! బతికున్నప్పుడు రెండు, సచ్చాక రెండూ ఉంటాయే!"

నీలి యిల్లువచ్చింది. దాసుడ్ని నీలి లోనికి పిల్చింది. చిన్నబుడ్డీ దీపం మంచందగ్గరగా తలవైపు వెలుగుతోంది. కాళ్ళవైపు ముసలమ్మ కూర్చుని మనుమడి వైపుచూస్తూ ముసి ముసి నవ్వు నవ్వుతుంటూంది. మూడు నెలలు దాటిన పిల్లాడు దీపం వైపు చూస్తూ మూతి విరుస్తున్నాడు; నవ్వుతున్నాడు.

"ఒరే తాత!" అన్నాడు దాసుడు. పిల్లు కాళ్ళుచేతులు ఆడిస్తూ ఊసులాడుతున్నాడు. పుల్లయ్య, నీలి చెరోవైపు నిల్చున్నారు. దాసుడు మంచంమీద కూర్చుని పిల్లాడి ముఖంలో ముఖంపెట్టి నవ్వాడు; ముద్దులాడాడు. నిర్భయంగా ఊసులాడుతున్న పిల్లాడ్ని తాకుతూ, 'అప్పుడే అమ్మ అంటున్నాడు!' అన్నాడు.

పుల్లయ్య చప్పున: "అమ్మ కాదు—అయ్యంటున్నాడు!"

దాసుడు నవ్వుతూ "పందిపిల్లలు కాస్తాది. యేనుగు ఒకపిల్లనే కాస్తేనేం? ముందు ముందు మరీ గడ్డురోజులున్నయ్ నాయనా! మెతుకు మూడుభాగాలు సేసైనా పెంచుకోస్తే నీ కొడుకైనా, యీ బలిసిపోతున్న అన్యాయాన్ని నరుక్కొస్తాడు!"

దంపతుల ముఖాలు యీ బ్రహ్మదీవనతో వెలిగిపోయాయి. వెళ్ళిపోతూ "ముసలమ్మా! మనవడివెళ్ళి నూడవా?" అన్నాడు. ముసలమ్మ "ఒరే రాముడూ! నాతలమీద గొడుగే నాడు పోయిందో ఆనాడేసచ్చిపోనానురా" అంది.

ముసలమ్మ మొగుడెలాంటి మూర్ఖుడో తెలిసిన రాముడు ఫక్కున నవ్వాడు. ఆ నవ్వు గురించి: "యెంత సెడ్డోడని లోకంఅన్నా, నమ్మినదానికి ఆడు మంచోడే! లోకాన ఎవరినో ఒకరిని నమ్మాల, ఆడు యేలాంటోడవనీ. ఆ నమ్మకంతోనే సవ్వాలి! అదే పున్నెం."

దాసుడు ముసలమ్మకు దండమెట్టి వెళ్ళిపోతూ "నాయనా నలుగురూ బతకాలంటే ఒకరితోనైనా సెడ్డన్యాల! ఈ కోపరేటుటోరు పెట్టించాడు ఆనాయుడు. పెద్దరైతు, కరణం, మీసాలు మెలేసినోరు కూడారా. నాయం అడవిలోకి పరుగెత్తిపోతూంది. గవర్నమెంటోడు మంచి సారాయిచ్చోడు. ఈ దొంగసారాతో పెద్దలు బతికిపోతున్నార్రా. నాకడుపు కమిలిపోతందినాయనా. ఆతల్లి పాదాలు పట్టుకుని బతిమాలుతున్నాను."

పుల్లయ్య "నస్తారులే!" అన్నాడు.

"వద్దు నాయనా. వాళ్లు నూరేళ్లు బతకాల. ఆలుసస్తే మనకేంరాదు. ఆలిని మంచిమనుషులు చెయ్యమ్మా. డబ్బుతోని హాయిగా బతకనీ యెవురొద్దన్నారు. ఎదుటోలవేపు ఒకసూపు సూడాల. యెప్పుడూ లాగ తల్లికి అలనా పాలనా జరిగితే—పంటలు బాగా పండుతాయి—ప్రజా సుఖపట్తారు!"

దాసునిసాగనంపి తిరిగివచ్చాడుపుల్లయ్య. నీలి మల్లుకి పాలు ఇస్తోంది. ముసలమ్మ ఒకమూల నడుంవాల్చింది. మంచంమీద కూర్చుని యీతతంగం యేం బాగాలేదన్నాడు.

"ఏమిలేమి"టంది నీలి.

"నూడు, యీ రేసినింగుపేరుపెట్టి మనకోకొరుడు-మనకుఅంబలి! నాయుడుయింట్లో బియ్యంకొట్టు! యీసారికార్డు యిస్తానంటే ఇస్తాను? పట్టపోడొచ్చి, ఈలదగ్గర బట్టుకొని రెట్టింపుధరలకి అమ్ముతున్నాడులే! ఎదవలు మేడలు కోటలుకట్టేస్తన్నారు!"

నీలి మాటాడలేదు. పిల్లడ్ని మంచం మీద వేసింది. అప్పుడేబొమ్మలపడ్డానికి ప్రయత్నిస్తున్నాడు. భోజనాలయ్యాక పుల్లయ్య అరుగుమీద కూర్చున్నాడు. నీలివంటయింట పనులుపూర్తిచేసుకొని— కొడుకుదగ్గర కూర్చుంది. పిల్లడు ఊసులాడుకుంటున్నాడు. ఇంతలో సంజీవి అలావెళ్ళిపోతూ "పుల్లిగా" అన్నాడు. "ఏంరా?" అంటేవచ్చి దగ్గరగా కూర్చున్నాడు. సంజీవిఆవూళ్లోకిపొట్టిమనిషి. గరిడీలో ఘటికుడు. వంగపండుచాయ శరీరం. గిరాగిరజాలు- మూతినిండుగా మీసాలు; చేతిలోబాణాకర్ర యెప్పుడూ వుంటుంది. వయస్సుపుల్లయ్యకంటే పదేళ్లు హెచ్చు.

(48-వ పేజీ చూడండి)

# ఖరో అల్లుడు

## యస్. శ్రీకృష్ణారావు

"చేతిలో పుత్తరాన్ని పెట్టుకొని అలాగే కూర్చుంటే ఎల్లాగ, ఇక జరగవలసినది ఏమిటో ఆలోచించక?" అంది సుభద్ర. భార్యమాటలు విని అరికాలిమంట నెత్తికెక్కింది సుబ్రమణ్యానికి.

"నీకేం! చాలా సులభంగా అనేశావు. డబ్బుకోసం ఎక్కడికి వెళ్ళాలో నాకేమీ అర్థంకావటములేదు," అన్నాడు సుబ్రమణ్యం కొంచెం కటువుగానే.

"డబ్బు! డబ్బు! చావొచ్చి పడిపోయిం దీ కొంపలో! ప్రతిదానికీ డబ్బు ఎక్కడవుందన్న గొడవ తప్పితే మరొకటిలేదు. మరిపండగ ఎల్లా గడుస్తుంది? మన పిల్లకి మనం చెయ్యకపోతే మరెవరు చేస్తారు? పోనీ వాళ్ళేమైనా గొరంతలు కొండంతలుగా అడుగుతున్నారా? ఈ మాత్రమేనా చెయ్యకపోతే మనకేమైనా మర్యాదగా వుంటుందా?"

"బాగుంది నీ వరస! ఉత్తరం చూసేనా నువ్వు మాట్లాడేది? వేలికి వజ్రపు వుంగరము, చేతికి రిస్టువాచీ, పార్కరుపెన్, "ట్వీడ్ సూట్"—రాను పోను సెకండుక్లాసు రైలు చార్జీలు - ఇదంతా ఎంత అవుతుందో తెలుసా? కనీసం అయిదువందలేనా కావాలి! ఎక్కడికి వెళ్ళమంటావు ఇప్పుడు అంత డబ్బుకోసం? అనవసరంగా అవకతవక వాగుడు వాగకు."

"అంతా ఎంత అవుతుందో నా కనవసరం. మన అల్లుడికి మనం ఎంత



కావాలన్నా ఇవ్వొచ్చు. తన మంచితనానికి, తన మంచిగుణాలకీ, తనబుద్ధిచాతుర్యానికి ఇదేమంత పెద్ద ఖర్చుకాదు."

"అవునవును! తను మహాచాణుక్యుడూ! సత్యవంతుడూనూ ఇవ్వచ్చుట! ఇవ్వచ్చు! మహా సిఫార్సు చేయొచ్చావు!"

సమయం బాగుండలేదని సుభద్ర లోపల కెళ్ళిపోయింది.

సుబ్రమణ్యం అసలు డబ్బు విషయంలో చాలా గట్టిమనిషి. చాలా బీదకుటుంబంలో నుంచి అనేక కష్టాలు అనుభవించిన తర్వాత తన ఒక్క చేతిమీదే పైకి వచ్చినవాడు. అందుచేత డబ్బువిలువ తనకు బాగా తెలుసు. ఒక్క కానీ ఖర్చు పెట్టాలన్నా తగినంత ఆలోచన చేస్తేనేగాని ఖర్చు చేయడు. ఈయన పద్ధతి భార్యకు కొంచెం కూడా గిట్టదు. ఏ సమయంలో ఎలా ఖర్చుపెట్టాలో ఈయనకు తెలియటం లేదే అని బాధపడుతుంది. క్రిందటి సంవత్సరమే వారి ఏకైక పుత్రిక శోభకు వివాహం జరిగింది. శోభ అదృష్టంకొద్దీ మంచిచోటే దొరికింది. చాల మంచి సాంప్రదాయ మనుకొని, తనశక్తికి మించిన ఖర్చుచేశాడు సుబ్రమణ్యం. డబ్బు నీళ్ళలా ఖర్చయిపోతోందే అని అనుకొనే అతడి భావాలకు సుభద్ర ఇచ్చిన తగిన సమాధానాలతో వివాహం సలక్షణంగా జరిగిపోయింది. శోభ వివాహం జరిగిన తరువాత అదే మొదటి సంక్రాంతి పండుగ. అదే మొదటిసారి అల్లుడు పండక్కి అత్తవారింటికి రావటం.

"ఏమాలోచించారు చివరకు? గబగబా ఏదో ఒకటి తేల్చేగుణము మీకసలు లేనే లేదు" అంటూ తయారయింది సుభద్ర.

"దీనికో పెద్ద ఆలోచన ఏమిటి? మన శక్తికి తగినట్లు ఏదో ఒకటి చేస్తాం. వాళ్ళు అడుగుతున్నారని తలకు మించిన పని చేస్తామా!" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"మన శక్తికి తగినదంటే వాళ్ళూరుకోవద్దూ! అసలు పెళ్లిలోనే వాళ్ళకి ఎడమొహాలూ పెడమొహాలూ వచ్చాయి!"

"ఏమేవ్! నువ్వసలు నోర్ముయ్! ... నువ్వు మాట్లాడకుండావుంటే నేను చేసినదానికి వాళ్ళే ఒప్పుకుంటారు. అందులో ఈ పండక్కి అతను తప్పితే ఇంకెవరూ రారు. సురేష్‌కు మన పరిస్థితి అంతా బాగా తెలుసు. పెళ్ళిలోనే నేను చేసిన ఖర్చుకు చాలా బాధపడ్డాడు. అందుచేత మనం చేసినదానికి అతను ఏమీ అనడు. పానకంలో పుడకలా నువ్వు అనవసరంగా కలగచేసుకోకు!"

"ఈ పప్పులేం వుడకవు అల్లుడిదగ్గర. శోభ కొచ్చిన వుత్తరంచూస్తే తెలుస్తుంది అతని మనస్సులోని సంగతి!"

"ఆ! ... శోభకు వుత్తరం వచ్చిందా! అతని దగ్గర్నుంచే? అమ్మాయి శోభా! ఇల్లారా!..."

"ఏం నాన్నా?" అంటూ వచ్చింది శోభ.

"ఏమ్మా! ఉత్తరం వచ్చిందిట కదూ! నాతో చెప్పనేలేదే!" అంటూ నవ్వుతూ వాత్సల్యంతో ప్రశ్నించాడు కూతురిని సుబ్రహ్మణ్యం.

సిగ్గు ఆమెను ఆవరించటంవల్ల శోభ మాట్లాడలేదు.

"ఉత్తరంలో ఏమైనా ముఖ్యవిషయాలు...ఉన్నాయా?" అంటూ మళ్ళీ నవ్వుతూనే ప్రశ్నించాడు సుబ్రమణ్యం.

శోభ మౌనం...

"నువ్వు నాకు ఉత్తరం ఇవ్వనక్కర్లేదమ్మా! మాతో చెప్పవలసిన విషయాలు ఏమైనావుంటే..."

"ఏమిలేవు నాన్నా. సంక్రాంతి పండుగ చాలా జోరుగా వుంటుంది కాబోలు అని రాశారు అంతే" అని లోపలికి వెళ్ళిపోయింది శోభ.

"చాలా జోరుగా......అంటే సందేహంగానే వుం··!"అన్నారు సుబ్రమణ్యం.

"చాలా జోరుగా అంటే, చాలా బాగా ఎవళ్ళ మనస్సులూ బాధపడకుండా సంతోషంగా వుంటుందని అర్థం" అంది సుభద్ర.

"ఓహో!...మరి అందరి సంతోషం కోసమేగా పండగ వస్తోంది-" వ్యాఖ్యానాన్ని పూర్తిచేశాడు సుబ్రమణ్యం.

"అయినే చివరకి ఏం చేస్తారేమిటి?" చాలా ఖచ్చితంగా అడిగేసింది సుభద్ర.

"చేసేదేమిటి వల్లకాదు! ఇష్టమైతే వుంటాడు. కష్టమైతే తిరుగు టపాలో మూట కట్టేస్తాడు. శిల్కుపంచె, శిల్కుకండువ, దారి ఖర్చులకు యాభయి రూపాయలు. ప్రస్తుతానికి యింతే! మళ్ళీ సంక్రాంతికి అతను అడిగినవన్నీ ఇవ్వచ్చులే!"

"మరి ఉంగరం, గడియారం మాట."

"వాటికి డబ్బు?"

"డబ్బు రామశర్మగారు పంపుతాడని చెప్పారుగా?"

"వాణ్ణి నమ్మినమాట నిజమే. కాని ఇంత వరకూ వాడు వుత్తరంకూడ రాయలేదు. మన డబ్బు మనకు ఇవ్వటానికే వాడికి కష్టంగా వుంది."

"అసలు మీరు సరిగా అడిగితేకదూ? ఆ డబ్బు వచ్చినట్లయితే అది ఈ పండక్కి ఎక్కడ ఖర్చయిపోతుందో అని మీ భయం! పెళ్ళంటూ అయినతరువాత ఇదేకదా మొదటి పండగ? పోనీ ఒక వుంగరమేనా ఇచ్చేందుకు ఏర్పాటుచేయండి. మనకోసం కాకపోయినా మన మర్యాదకోసమయినా ఇవ్వద్దా" అది సుభద్ర.

"ఆరంభించావా నీ పల్లవి! తగలడినట్టే వుంది మన మర్యాద. ఈ డబ్బుకోసం నన్ను ఏ గోతిలో దిగమంటావో చెప్పు...దిగుతాను. నీకెందుకీ శ్రమ. సురేష్ నేను చెప్పినట్లు వినేటటుగా చేస్తాను. నువ్వు అనవసరంగా దిగులుపడకు......"

"అల్లుడు ఒప్పుకొంటే సరిపోతుందా ఏమిటి! అతని వాళ్లు ఒప్పుకోవద్దూ! రేపు ఈ విషయాన్ని ఆధారంగా తీసుకొని ఏదేనా గొడవ చేస్తే మన శోభ కదా కండ్లు వలుపుకుంటూ కూర్చొంటుంది!"—అంది. సుభద్రకు ఏడుపుకూడ వచ్చింది.

"భగవంతుడా!...ఎవళ్లికేనా సమాధానం చెప్పవచ్చు కాని ఇంట్లో ఇల్లాలికిమాత్రం సమాధానం చెప్పలేమన్నారు ఇందుకే కాబోలు. మహాప్రభో! నీకో నమస్కారం గాని నువ్వు లోపలికి వెళ్లు! ఈపండగ సమాచారమంతా నాకు వదలిపెట్టు. ఆ సంగతి నేను చూసుకొంటాను. రేపు ఏదేనా గొడవ వస్తే నాది జవాబుదారీ! కావాలంటే వాళ్లి కాళ్లుకూడా పట్టుకొంటాను, సరేనా! ఇక నువ్వు వెళ్లి నీ పని చూసుకో," అని ముగించారు సుబ్రమణ్యం.

సుభద్ర ఓ విధంగా తృప్తిపడి లోపలికి వెళ్లిపోయింది.

సంక్రాంతి పండుగ దగ్గరకొస్తున్న కొద్దీ సుభద్రకు ఒకటే హడావుడి. భోగినాటికి ముందురోజునే వస్తున్నట్లు సురేష్ ఉత్తరం వ్రాశాడు. ఉత్తరం చూసిన తరువాత సుభద్ర ఆనందం చెప్ప నక్కరేదు. అల్లుడి గురించి సుబ్రమణ్యం గారికి పరిస్థితి అంతా అయోమయం.

అనుకొన్నట్లుగానే అల్లుడు రానే వచ్చాడు. మర్యాద తక్కువ అవుతుందేమో నన్న భయంతో సుబ్రమణ్యంగారు స్టేషనుకువెళ్లి అల్లుడిని తీసుకొని వచ్చాడు. తనతోకూడా తనవాళ్లెవరూ రాకపోవటంవల్ల, మామగారింట్లో ఇటుసరి ఏమిచేయకుండా చాలా సహజంగానే ప్రవర్తించాడు సురేష్.

"ఇంటిదగ్గర అందరూ కులాసాయేనా నాయనా!" అమ్మగారిని కూడా తీసుకొని వస్తే చాలా బాగుండేది. ఏం నాయనా అంత చిక్కిపోయావు?" మాతృవాత్సల్యంతో ప్రశ్నించింది అల్లుణ్ణి సుభద్ర.

"అంతా కులాసాయేనండి. నాన్నగారికి "అస్తమా" కదా! అందుచేత అమ్మరావటానికి వీల్లేకపోయింది" అంటూ నవ్వుతూనే సమాధాన మిచ్చాడు సురేష్.

"'అస్తమా'కి ఒకటేమందు. ఆసనాలు వేయటమే. నా స్నేహితు డొకడు వందల కొలది డబ్బుఖర్చుచేసినా వ్యాధితగ్గలేదు. చివరకు ఎవరో ఒక యోగి అతనిపరిస్థితి చూచి జాలిపడి కొన్ని ఆసనాలు చెప్పివే

# ★ భలే అల్లుడు ★

యించాడుట. ఇప్పుడుభీముడులావున్నాడు," అంటూ సావిట్లోవున్న ఉయ్యాలబల్లమీద పద్మాసనం వేసుకూర్చొన్నారు సుబ్రమణ్యం.

అలుడూ మామ లోకాభిరామాయణం తిరగవేస్తున్న సమయంలో సురేష్‌కు ఒకటో రకమైన కాఫీవచ్చింది.

మధ్యాహ్నం భోజనాలయాక మేడమీద గదిలో కొంచెంసేపు నిద్రపోయి, తన ప్రయాణ బడలికను తీర్చుకున్నాడు సురేష్. సాయంత్రం సుమారు అయిదుగంటలకు మెళుకువ వచ్చింది.

ఆకాశ మంతా దట్టమైన మేఘాలతో నిండి చిన్న చిన్న తుంపరలు రాలుతున్నాయి. చల్లటిగాలి వస్తోంది. మేడమీద తను ఒంటరిగానే వున్నాడు—ఆసమయంలో తన ప్రియురాలు శోభ జ్ఞాపకం రావటంలో ఆశ్చర్యంలేదు! తన శోభవిషయం ఆలోచిస్తున్న సమయంలోనే తలుపుదగ్గర గాజుల శబ్దం చిన్నగా విన్పించింది. వెనక్కు తిరిగి చూశాడు సురేష్.

కాఫీ ఫలహారాలతో శోభ ప్రత్యక్షమయింది!




"నిన్ను గురించే ఆలోచిస్తున్నాను. నువ్వే వచ్చేశావు" అన్నాడు సురేష్.

శోభ మాట్లాడకుండా కాఫీ ఫలహారాలు బల్లమీద పెట్టి అల్లాగే నిలబడింది.

"ఏం శోభా మాట్లాడవు? నామీద కోపమా?" అన్నాడు సురేష్ బ్రతిమాలే భావనతో.

"ఉత్తరాలనేవి అల్లాగే రాస్తారు కాబోలు. ఎవరేనా చూస్తే" అంది శోభ మెల్లిగా.

"తప్పుమాటలేం రాయలేదే?"

"తప్పు మాటలు లేకపోతే మాత్రం?"

"నా వుత్తరం నీకు తప్ప మరొకరి చేతికి వెళ్ళదని నాకు బాగా తెలుసు. అందుకనే ధైర్యంచేసి రాశాను."

"ఒకవేళ కాలం ఖర్మకాలి ఎవరేనా చూస్తే?"

"ఆ! చూస్తే మాత్రం చంపేస్తారా! మనిద్దరమూ పెళ్లయిన వాళ్లమేకాని, కాని వాళ్లము కాదుకదా! ఒకవేళ చూస్తే కొంచెంసేపు వాళ్లలో వాళ్ళు నవ్వుకొని నోరుమూసుకొని కూర్చొంటారు. ఇంకా కొంచెము గటివాళ్లయితే మనం ఎదురపడినపుడు మనమాటలను మనపైనే సిసింద్రీలలా వదుల్తారు. అటువంటి వాళ్లందరికి తారాజువ్వలా సమాధానం చెప్పేందుకు నేనుండగా నీకెందుకు భయము?"

"ఏమైనప్పటికీ అటువంటి ఉత్తరాలు నాకు కోపాన్ని తెప్పిస్తాయి!"

"ఓహో!...సరెగాని...నాకు తెలియక అడుగుతాను. ఆ వుత్తరం నీకన్నా ముందు ఇంకెవరేనా చదివారా?"

"లేదు. ముందు నేనే చదివాను. ఇంతట్లోకే అమ్మ వచ్చింది. ఉత్తరం ఇవ్వమంది"

"నువ్వు ఇచ్చావుకాబోలు"

"ఊహు! ఏమంత ముఖ్యవిషయాలు లేవని చెప్పాను. అంతేకాని ఉత్తరం ఇవ్వలేదు."

"మరి ఇంతటి దానికి అంత ఖంగారు పడతావెందుకు? ఎల్లా అయిన ఈ పల్లెటూరి వాతావరణం నిన్ను ఇల్లాగే మాట్లాడిస్తుంది. ఈసారి అత్తవారి ఇంటినుంచి పుట్టింటికి వచ్చినపుడు నాకు ఉత్తరాలు రాస్తావు చూడు! అపుడు నేను నీకు చెపాల్సి వస్తుంది ఇటువంటి ఉత్తరాలు వ్రాయద్దని" అంటూ చమత్కరించాడు సురేష్ చిలిపిగా.

"చాలా సంతోషించాం గాని కాఫీ తాగండి చల్లారి పోతోంది."

"నిన్ను చూస్తూ కాఫీ సంగతే మర్చిపోయాను చూశావా!" అన్నాడు సురేష్ కొంటెగా.

కాఫీ ఫలహారం పూర్తయింది.

"మరి..." అంటూ దగ్గరకువచ్చి ఏదో చెప్పబోయాడు సురేష్.

"నాకు తెలుసు లెండి మీ నాటకం. ..............." అంటూ గబగబా కిందకు వెళ్ళిపోయింది శోభ. ఆతర్వాత కొంత సేపటికి మామగారు మేడమీదకు వెళ్ళారు.

"ఏం సురేష్ బాగా నిద్ర పట్టిందా!"

"ఆహా!...మీ మేడ చాలా సౌకర్యంగా వుంది...మీరు పండక్కి కొన్న బట్టలు చూశాను..." అంటూ మెల్లిగా సంభాషణ ప్రారంభించాడు సురేష్.

"ఓహో!.....బాగున్నాయా? నీకు తృప్తే కాదా?"

"అన్నీ బాగానే వున్నాయి కాని..."

"ఆ!...ఆ!....మనస్సులో వున్నది చెప్పు సురేష్. ఇదేమన్నా పరాయిచోటా?"

"నా మట్టుకు మీరు ఏం చేసినా పరమ తృప్తే. కాని మా అమ్మగారున్నారు చూశారూ! చాలా పట్టుదల మనిషి. ఉంగరం, గడియారం లేకుండా రావద్దని చెప్పేసింది. ఏమైనప్పటికి పెద్దవాళ్ళు చెప్పినట్లు వినాలికదా? అన్నాడు సురేష్.

సుబ్రమణ్యంగారికి ఎలక్ట్రిక్ షాక్ తగిలినంత పని అయింది. తనతో చెప్పకుండా, శోభ, బట్టలు తెచ్చిచూపించిన ఫలితం ఇదంతా అనుకొన్నారు. ఇంకా ఏమేమి చెప్పిందో! మీ రడిగితే లేదనరు అనికూడా చెప్పేవుంటుంది! ఆలోచించగా ఆలోచించగా కన్న కూతురుమీదే పట్టలేనికోపం వచ్చింది.

"ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" అని అడిగాడు సురేష్.

"అబ్బే! ఏంలేదు సురేష్!...ప్రస్తుతంలో డబ్బు సర్దుబాటుకాలేదు. అంతకంటే ఇంకేమీలేదు" అంటూ నసిగారు సుబ్రమణ్యం.

"కనీసం మా అమ్మగారి తృప్తికోసం మీరు అవి తేవటం అవసరం. అల్లా అయితేనే వచ్చేనెలలో మా కాపరం పెట్టుకోవటానికి వీలవుతుంది. అందుకని..." ఇందండి అంటూ నాలుగు నూరు రూపాయల నోట్లూ ఆయన చేతిలో పెట్టాడు సురేష్!!

"ఏమిటి సురేష్ యిది?" అంటూ తెల్లబోయారు సుబ్రమణ్యం.

"డబ్బును గురించి ఇబ్బంది పడుతున్నానన్నారు కదూ? దీనితో జరగవలసినది జరిపించండి. ఎల్లా అయితేనేం మా అమ్మగారు సంతోషిస్తే అంతే చాలు."

"రేపు ఈ విషయం మీ వాళ్ళకు తెలిస్తే?..."

"ఎవ్వరికీ తెలియదు. నే చెప్తేకదా తెలియటానికి! ఇది మన మనస్సులలోనే వుంటుంది" అంటూ లేచాడు సురేష్.

సుబ్రమణ్యంగారి ఆశ్చర్యానికి సంతోషానికి పట్టపగ్గాలులేవు. "నా అల్లుడు ఇంత మంచివాడా!" అనుకొన్నాడు తనలో.

మర్నాడు సంక్రాంతి పండుగ వారింట్లో ఎల్లా వుందో వేరే చెప్పనక్కర్లేదు. అంతకు ముందే కొన్న బటలతోపాటు, రెండు వందల విలువైన 'రిస్టువాచీ' కూడా సురేష్ చేతికి వచ్చాయి.

వేలికి సరిపోయే వుంగరం వెంటనే దొరకక పోవటంవల్లా అందునిమిత్తం, పార్కరు పెన్ను నిమిత్తం మరొక రెండువందలు కూడ సురేష్‌కు చేరాయి. చివరకు అడిగినవన్నీ సమకూరటం వల్ల సుభద్రకూడా చాలసంతోషించింది.

"మీరు బట్టలతోటిమాత్రమే ఈ పండుగ అనిచెప్పి, గడియారం కొనటమే కాకుండ రెండువందలు కూడా చేతికి ఇచ్చారే! ఈ నాటకమంతా ఆడింది నన్ను ఏడిపించటానికే కదూ? మీ మగాళ్ళు ఎప్పుడూ ఇంతే! ఆడదంటే మహాలోకువ. ఎంతసేపూ ఆడదాన్ని ఎలా ఏడిపిద్దామా అనే ఆలోచిస్తుంటారు." అని దెప్పి పొడిచింది భర్తను సుభద్ర.

అసలు రహస్యం అల్లుడు ఇంట్లో వుండగ చెప్పటం ఆయనకు ఇష్టములేదు. అందుకని 'మన అల్లుడికి మనం చేయకపోతే మరెవరు చేస్తారు?' అనేశాడు.

సంక్రాంతి వెళ్ళిన మర్నాడు, అత్తమామలకు నమస్కరించి, ప్రియురాలికి, ఆమె కన్నీటికి తగిన సమాధానం చెప్పుకొని వెళ్ళిపోయాడు సురేష్.

"అమ్మయ్య" అంటూ దీర్ఘ శ్వాసాన్ని విడిచాడు సుబ్రమణ్యం. అనుకోని విధంగా ఈ సంక్రాంతి పండగ గడిచినందుకు ఆయనకు చాలా సంతోషం.

"అల్లుడిమనసు ఏమీ బాధపడలేదు కదా" అంటూ వచ్చింది సుభద్ర.

"బాధపడదూ మరి? నాలుగు వందలు కదా యిచ్చాడు" అన్నాడు సుబ్రమణ్యం పరిహాసంగా.

'ఆ!...' మూర్ఛపోయినంత పని అయింది సుభద్రకు. "మరేమిటను కొన్నావు? తన చేతికిచ్చిన రెండు వందలూ, తనకి గడియారంకొన్న రెండు వందలూ ఎవరి డబ్బనుకుంటున్నావు? తన డబ్బే! ఇంకా వివరంగా చెప్పాలా! సురేష్ తన చేతినుంచి నాలుగు వందలు రూపాయలు తీసి తన తల్లి తృప్తికోసం ఆ వస్తువులు కొనమని నా కిచ్చాడు. గడియారం దొరికింది కాబట్టి మిగిలిన డబ్బు అతనికే ఇచ్చివేశాను. ఇప్పుడు అర్థమయిందా!"

"అయ్యో! అయ్యో! ఇంత అన్యాయం ఎక్కడేనా వుందా!"

"అన్యాయమూ లేదు - గిన్యాయమూ లేదు. మన అల్లుడికి మనమీదవున్న మమకారం అటువంటిది. ఆనాడే నేను చెప్ప లేదూ అతని స్వభావము. కష్టపడేవాళ్ళను చూసి సహించలేడు. అతను ఈనాడు చేసిన ఉపకారానికి రెట్టింపు మనం వచ్చే సంవత్సరము చేద్దాం," అన్నాడు సుబ్రమణ్యం.

"ఏమైనా మీరు చేసిన పని ఏమీ బాగా లేదు. అతని డబ్బు తీసుకొని..."

"అదుగో మళ్ళీ అదేమాట! పని జరగటం ప్రధానమే పిచ్చిదానా! ఎందుకు అంత రాద్ధాంతం చేస్తావు? శోభ వస్తోంది. దాని చెవిని పడేను!"

"ఏమ్మా శోభా! ఇంకా నిద్రపోలేదా! మీ ఆయనకి రైల్లో బాగా స్థలం దొరికింది. వెళ్ళగానే నీకు ఉత్తరం వ్రాస్తానన్నాడు" అన్నారు సుబ్రమణ్యం కూతురుతో పరిహాసంగా.

"మద్రాసులోవున్న రామశర్మగారు మీకేమైనా బాకీ వున్నారా, నాన్నా?"

"అవునమ్మ యివ్వాలి. అయిదు వందలు ఇవ్వాలి. పంపుతానన్నాడు కాని యింకా పంపలేదు."

"ఆయన 'యీాయన' దగ్గరికి వచ్చి మీకివ్వమని అయిదు వందలూ ఇచ్చారుట. అందులో నాలుగు వందలు మొన్న మీకిచ్చారుట. మిగిలిన వందలో యాభయి రూపాయలు తన ఖర్చులకు పోను మిగిలిన యాభయి రూపాయలు మీ కివ్వమని నా కిచ్చారు," అని సురేష్ తనకిచ్చిన యాభయి రూపాయలూ తండ్రికిచ్చింది శోభ.

"ఇదంతా సురేష్ నీతో ఎప్పుడు చెప్పాడు?" అని అడిగారు సుబ్రమణ్యం.

"బయలుదేరేముందు."

సుబ్రమణ్యం కొన్నిక్షణాలు ఏమీ మాట్లాడలేకపోయారు.

"డబ్బుయిచ్చేటప్పుడు రామశర్మయిచ్చాడని చెప్పనేలేదే" అన్నారు.

"తనచేతినుంచి ఇస్తున్నానని చెప్పాడు కాబోలు! తను గనుక రామశర్మగారు ఆ డబ్బు యిచ్చారని చెప్పివున్నట్లయితే మన స్ఫూర్తిగా ఆ డబ్బుఖర్చుపెట్టి వుండేవారా? ఇందులో సగంకూడా ఖర్చుపెట్టేవారుకాదేమో......ఇప్పటికేనా అర్థము చేసుకోగలరా......ఈ అల్లుడిదగ్గర మన పప్పులేమీ వుడకవని......మా మంచిపని చేశాడు! భలే అల్లుడు...మావగారికి తగినవాడే" అంది సుభద్ర పరిహాసంగా.

"సామాన్యుడుకాదు. దేవాంతకుడు ఈ అల్లుడు" అని మాత్రం అన్నారు సుబ్రమణ్యం యింకేమీ అనలేక! ★

## నాటిక

# ఆదర్శాలు

[మేజిస్ట్రేటు సుందరరామయ్యగారింట్లో—ఆయన భార్య సుందరమ్మగారు, కూతురు నిర్మల, కొడుకు శంకర్ హాలులో కూర్చుని]

నిర్మల : అరేయ్! శంకర్!

శంకర్ : ఏమక్కా!

నిర్మల : ఒక రిక్వెస్ట్!

శంకర్ : ఓస్, ఒకటేమిటి? ఫోర్ రిక్వెస్ట్‌లు వింటాను. చెప్పు. ఏమిటది?

నిర్మల: దయచేసి నీమాత్ ఆర్గన్ సంగీతం ఒక అయిదునిముషాలు ఆపుచేసి, నీవు కూడా ఆ అయిదు నిముషాలు నోరు మూసుకో.

శంకర్ : హుం. నాకు ముందే తెలుసు. ఐదు దీర్ఘ నిముషాలు—నిశ్శబ్దంగా ఉండటమే? అది నాకు అన్నాచురల్—అసహజం.

నిర్మల : నాకసలే తలనొప్పిగా ఉంది- ఏదో తోచక శాస్త్ర మూవీ టైమ్సు చూద్దామంటే నీ మ్యాజిక్ తో ఒక్క క్షణం కూడా చదవలేకుండా ఉన్నాను.

శంకర్ : నువ్వు గట్టిగా చదువుతుంటే అది వినలేక నే నేను ఆర్గను వాయిస్తున్నాను.

నిర్మల : అమ్మా—చూడమ్మా! వీడితో ఏం చెయ్యటం—ఇవ్వాళ సినీమాకు తీసికెడతానన్నారు నాన్నగారు! అయిదున్నర అయినా ఇంకా రాలేదు. ఎప్పుడొస్తారో. ఏం తీసికెడతారో! ఇంట్లోనైనా ఉందామంటే శంకర్ గాడి న్యూసెన్సు.

శంకర్ : అక్కా! ఒక రిక్వెస్ట్.

నిర్మల : ఏమిటది! నీ తలకాయ.

శంకర్ : పార్లమెంటరీ లాన్‌గ్వేజి—అంటే సభ్యమైన భాష—ఉపయోగించు.

సుందరమ్మ : అబ్బ! ఏమిట్రా. ఒకటే పోట్లాట! సినీమాకు పోతే నువ్వు వాళ్ళమ్మాయితో పోరాదూ? నాన్న గారెందుకు?

శంకర్ : ఆ ఇంగ్లీషు సినీమా వీళ్ళకేం తెలుస్తుంది? అర్థం చెప్పటానికి నాన్నగారు లేకపోతే!

నిర్మల : నీకు మహా వచ్చులే-బట్లరింగ్లీషు. అమ్మా! నాన్నగారు వచ్చారు.

(ప్రవేశం సుందరరామయ్యగారు)

సుందరరామయ్య: ఏమిటమ్మా. తెగ వాదించుకుంటున్నారు?

నిర్మల: ఏంలేదు నాన్నగారూ! మీకోసం వెయిట్ చేస్తున్నాను. సినీమాకు పోదామన్నారుకదా. ఇంకా టైము కూడా ఎంతో లేదు.

సుందరమ్మ: ఉండమ్మా! కాస్త కాఫీ అది తీసుకోనీ నాన్నగారిని.

సుందరరామయ్య: (నిట్టూర్పు) కాఫీ తాగినా కూడా ఇవ్వాళ ఎక్కడికీ కదిలే ఓపిక లేదమ్మా. నువ్వే వెళ్ళిరా తల్లీ. లేకపోతే రేపు వెళదాం.

నిర్మల: మీ రెప్పుడూ ఇంతే నాన్నగారూ! సరే రేపే వెడదాం. పదరా. శంకర్! ప్లీడరుగారింటికేనా వెళ్దాం, కారమ్సు ఆడుకోవచ్చు.

## ఆర్. వి. శాంత

శంకర్ : సరే పద—

(నిర్మల్, శంకర్‌ల నిష్క్రమణ)

సుందరమ్మ: ఏమండి బాగా అలసినట్లున్నారు ఒంట్లో నలతగా ఉందా?

సుందరరామయ్య: ఆ—జాబులేమైనా వచ్చాయా.

సుందరమ్మ: మా అన్నయ్య రాశాడు. ఏదో సంబంధం ఉందిట అమ్మాయికి అన్ని విధాలా తగిన సంబంధం అనీ, అయిదు వేలు కట్నం అడుగుతున్నారనీ వ్రాశాడు.

సుందర: హుం! అయిదు వేలు — ఎవరివ్వగలరు? ఆ సంబంధం మనకు పనికిరాదు.

సుందరమ్మ: పనికిరాదంటే ఎలా చెప్పండి—ఎల్లాగో తలతాకట్టు పెట్టి డబ్బు తేవాలి. మనకా-ఏ పదిమందో ఆడపిల్లలు లేరుకదా! ఉన్న ఒక్క పిల్లనీ ఎంతైనా సరే మంచిచోట పడెయ్యకపోతే దాని ఉసురు మనకి తగలదుటండీ.

సుందర: ఇవన్నీ నాకు తెలుసు. మన ఇంటి పరిస్థితులన్నీ నీకు కూడా తెలుసు.

సుందరమ్మ: బ్యాంకులో ఉన్నదంతా తీసినా చాలదంటారా!

సుందర: ఉన్నదంతా ఎంత! ఐదారు వేలు ఉంటుంది. శంకరం ఇంటరు ప్యాసయ్యాడుకదా! ఇక వాడు ఇంజనీరింగు చదువుతానని కూర్చున్నాడు. దాని కెంత కావాలో తెలుసా? ఉన్నదంతా అమ్మాయి పెళ్ళికి ఖర్చుచేస్తే తరువాత ఏంచేయాలి?

సుందరమ్మ: ఏంచేయాలి-అవును మరి, మనస్థితి అల్లా ఉంది. న్యాయానికి కట్టుబడి- ఇరవై సంవత్సరాలు ఉద్యోగం చేశారు-మీతోటి వాళ్ళంతా నలుగురేసి పిలలకు పెళ్ళిళ్ళు చేసి మేడలు కట్టుకొని సుఖపడుతున్నారు-

సుందరరా: ఇంకా వాళ్ళ పెళ్ళాల మెళ్ళల్లో ఇన్నేసి నగలు-చెప్పు!

సుందరమ్మ: అడుగో నే నేమన్నా నగలడిగానా? ఇంతకూ ఇది నా ఖర్మ-ఏమన్నా ఏమి లేకపోయినా, ఇంత గారాబంగా పెంచిన నా చిట్టితల్లికైనా ఒక గొప్పసంబంధం చెయ్యాలనుకొని ఆశపడ్డాను. కావాలన్నది లేదనకుండా ఇంత ముద్దుగా పెంచి దాన్ని చివరకు చదువు సంధ్యలైనా లేని ఏ గుమాస్తాకో...

సుందరరా: ఆ. ఆ! అల్లా అనకు—గుమాస్తా అంటే అంత తేలిక కాదు. మొదట్లో నే నెవర్ని? పదేళ్ళు గుమాస్తా చేయలేదూ? గుమాస్తాకు చదువు సంధ్యలు తక్కువనీ, సంస్కారం తక్కువనీ భయపడకు. అమ్మాయి అదృష్టం బాగుండాలి గానీ, నీదయవల్ల, ప్రస్తుతం దేశపరిస్థితులు మారాయి. ఎమ్మేలు కూడా గుమాస్తాల్లోనే మనకు దొరకవచ్చు.

సుందరమ్మ: ఇంతకీ గుమాస్తాకంటె మంచి సంబంధం అమ్మాయికోసం చూడకూడదని మీకీ పట్టుదల ఎందుకండీ.

సుందరరా: నాకేమీ పట్టుదల లేదు. కాని మన శక్తి కూడా ఆలోచించాలి!

సుందరమ్మ: శక్తి, శక్తి, అంటే, ఒకరికి మాత్రం దేముడు తీసికొచ్చి ధనం ఇస్తాడేమిటి. కావాలన్నప్పుడు కలిసొచ్చే పరిస్థి

తులు కల్పించుతాడు-అప్పటికీ, మనం లేదు లేదు అనే కూర్చుంటే అది మన అసమర్థత అవుతుంది.

సుందరరా: ఇంతకీ నువ్వనే దేమిటి? ఇప్పుడు పదివేలు సంపాదించాలంటే నా కెలా సాధ్యమవుతుం దంటావ్?

సుందరమ్మ: ఆ పట్టుదలే ఉంటే మార్గాలు తప్పకుండా ఉంటాయి.

సుందరరా: నాకేమీ కనపట్టంలేదు.

సుందరమ్మ: ఏమండీ, మీ కోపం రాకుండావుంటే ఒక్కమాట చెప్పనా?

సుందరరా: మళ్లా ఆ ప్రశ్న ఎందుకు, చెప్పు!

సుందరమ్మ: ఇప్పుడు అమ్మాయి పెళ్ళి, శేంకరం చదువు మనకు పెద్ద గండాలు. మన పరిస్థితుల్లో అవి మన శక్తికి మించినవే కావచ్చు. అయినప్పటికీ, అలాగని మనం ఊరుకుంటే, పిల్లలిద్దరూ బతికి వున్నాళ్ళూ మనల్ని గురించి కష్టపడతారు. అందువల్ల వాళ్ళకోసం మనం కొంత త్యాగం చెయ్యాలి-అవసరమైతే.

సుందరరా: త్యాగం-అంటే! నీ మాటలు నాకేమీ అర్థంకావటంలేదు. ఇన్నాళ్ళూ నే చేసిందమిటి?

సుందరమ్మ: ఇన్నాళ్ళూ, మీకు మంచిదని తోచిన మార్గాన్నే ప్రవర్తించారు. అందుకు నే నెన్నడూ అడ్డం చెప్పలేదు. పైగా సంతోషంగా మిమ్మల్ని సమర్థించలేదూ?

సుందరరా: సుందరం! నీ కేదో మనసు కలతగా ఉంది.

సుందరమ్మ: కలత ఏమీ లేదు. ఎన్నాళ్లనుంచో మనస్సులో కొట్టుకుంటున్న విషయాలు మీతో ఇవ్వాళ చెప్పేస్తే, మనస్సు తేలిక పడుతుందని చెబుతున్నాను— ఏమీ లేదు. డబ్బు సంపాదించమంటాను. నా కోసం - నా పిల్లలకోసం.

సుందరరా: మీకోసం కాకపోతే, ఇరవై సంవత్సరాలనుండీ నే చేసిన చాకిరీ అంతా ఎవరికోసం. ప్రపంచంలో ప్రతీ మనిషీ, భార్యా పిల్లలకోసమే అన్ని అబద్ధాలు ఆడుతాడు. అన్ని అన్యాయాలు చేస్తాడు. లేకపోతే సన్యాసికి ఏం కావాలి!

సుందరమ్మ: అల్లా కోపగించకండి-మీరు. నా కోసం ఏమీ చేయలేదని నే నెల్లా గంటాను. అన్నిటికంటె ముఖ్యమైనది - నన్ను మీ రంతో ప్రేమించారు. నే నెంతో అదృష్టవంతురాల్ని. ఇప్పుడు మీ ప్రేమ నా కోసం కాదు కావలసింది. నాకు మీకు, మన జీవితాలకంటె ముఖ్యమైన పిల్లలకోసం—మీ ప్రేమ త్యాగం కావాలి.

సుందరరా: ఇంతకూ నీ వనేదేమిటో నా కేమీ అర్థంకాలేదు. నేను నా పిల్లల్ని ప్రేమిస్తానని రుజువు చెయ్యాలంటే ఏమి చెయ్యాలి?

సుందరమ్మ: ప్రేమనేది ఉంటే, దానికిప్పుడు పరీక్ష వచ్చిందనుకోండి. వాళ్లకోసం మీ రిన్నాళ్లనుంచీ చేయని పని ఒకటి చేయాలి. మనం శాశ్వతంకాదు. ఉన్న నాలుగురోజుల్లోనే మంచిదో చెడ్డదో ఏదో ఒకమార్గంలో వాళ్లకోసం ఇంత సంపాదించి పోవాలిసిన బాధ్యత మనది. మీరు వాళ్ల మంచి కోరితే మీ పట్టుదల కొంచెం వదలాలి. అవసరమైతే మీ నియమాలకు కొంచెం వ్యతిరేకంగా వెళ్లాలి.

సుందరరా: నువ్వనేది నాకు తెలిసింది! లంచాలైనా తీసికొని ఇప్పుడు పదివేలు సంపాదించాలంటావు. ఇరవై సంవత్సరాల నియమబద్ధ జీవితం ఒక్క పాడుపనితో సరి. త్యాగాన్ని గురించి నీ విచ్చిన ఉపన్యాసం నా కిప్పుడు అర్థమైంది. నా గౌరవం ఏమైనా, నా అంతరాత్మ ఏం చెప్పినా అవన్నీ లెక్క చెయ్యవద్దంటావు.

సుందరమ్మ: మీ అంతరాత్మ విషయం నాకు తెలియదా! కాని మీ గౌరవం ఏమీ పోగొట్టుకో నక్కరలేదు. అసలుసంగతి చెబుతాను వినండి. ఇవ్వాళ మధ్యాహ్నం మనింటికి, పెదనాయుడిగారి తల్లి ట వచ్చింది.

సుందరరా: ఆఁ. పెదనాయుడుగారి— అంటే జమీందారు. ఆయనతల్లి ఎందుకు వచ్చింది?

సుందరమ్మ: ఆవిడ అలుడిమీద ఏదో కేసుందిటకదా? నౌకర్ని కొట్టిచంపాడని. ఆ గొడవంతా చెప్పింది. అసలు వాడికి ఏదో జబ్బుండి చచ్చిపోయాడుట కాని కొట్టినందువలన కాదుట.

సుందరరా: ఓ అల్లాగా! చాలా ఉండే కథ-కేసు నా దగ్గిరేఉంది. నువ్వు అందుకనే ఇవ్వాళ గ్రంథం అంతా చదివావు.

సుందరమ్మ: ఇంతకీ నా మాట వినండి: ఆవిడ మనఇంటి పరిస్థితులన్నీ అడిగింది. పిల్ల పెళ్లిమాట మీరేమీ బెంగ పెట్టుకోవద్దంది.

సుందరరా: కేసుబా అల్లుణ్ణి విడిపించమంది. అంతేనా?

సుందరమ్మ: అది నావల్లకాదనీ, మీరు చెబితే వినరనీ నేను చాలాచెప్పాను. ఆవిడ వినిపించుకోలేదు. తన కూతురూ, మన అమ్మాయి లాంటిదేననీ, దాని పసుపు కుంకుమలు కాపాడాలనీ బ్రతిమాలి ఏడిచింది.

సుందరరా: (మౌనం—ఒక్కక్షణం)

సుందరమ్మ: ఆవిడ ముఖంచూస్తే ఆవిడ అల్లుడివల్ల నిజంగా తప్పేమీ లేద నేతోస్తుంది. కోపంలో రెండు తన్ను లుతన్నితే మాత్రం అంతలోకే చస్తాడా? ఏదో జబ్బు లో ఉండకపోతే.

సుందరరా: ఆర్గ్యుమెంటు! నిన్ను బాగానే తయారుచేసింది. అయితే కోర్టులో నువ్వే వాదించకూడదూ!

సుందరమ్మ: మీరిల్లా అంటారని నాకు

 ఆదర్శాలు 

తెలుసు. కాని ఒక్కటి ఆలోచించండి. ఆవిడవల్ల మనకువచ్చేసహాయం...ఆతర్వాత ఆవిడమాటల్లో నిజంకూడ ఉండకూడదా? ఆవిడ అల్లుడిమీద ఊళ్లో కొందరికి కక్ష ఉందిటకదూ, అందువల్లనే కేసు బనాయించారంటుంది. అది నిజమే కాకూడదా? అయినా డాక్టరుకూడా సందేహంగా రిపోర్టు ఇచ్చాడుట కదా?

సుందరరా: సుందరం! నీకీగొడవలన్నీ ఎందుకూ?

సుందరమ్మ: నే తెచ్చిపెట్టుకోలేదు. అవ్వి నాదగ్గరికొచ్చాయి. నాకు వాటితో అవసరంకూడ ఇప్పుడేకలిగింది.

సుందరరా: (మౌనం)

సుందరమ్మ: నాప్రవర్తన మీకు విపరీతంగా ఉందికాబోలు. కాని నేను బాగా ఆలోచించుకొనే మాట్లాడుతున్నా. అతన్ని వదలిపెటడానికి వీల్లేదా?

సుందరరా: లేకేం? ఉంది. వాళ్లే అన్ని జాగ్రత్తలూ పడ్డారు. నాకుతప్ప అందరికీ లంచాలిచ్చారు. సాక్ష్యంకూడ బలంగాలేదు. నేనొకవేళ సెషన్సుకి కమిట్ చేసినా అక్కడ కేసు రుజువయేదాకా నమ్మకంలేదు.

సుందరమ్మ: అయితే కేసు మీరే కొట్టివెయ్యొచ్చుకదండీ!

సుందరరా: ఆఁ.

సుందరమ్మ: (ఆత్రంగా) అల్లాంటప్పుడు మీ రెందుకండీ ఆలోచిస్తారు? కొట్టేస్తే తప్పులేదు కదా! మనకీ పని అవుతుందికదా? ఆవిడరేపువస్తానంది. నేను ఊఁ అంటే ఆవిడ మనకు వెంటనే సాయం చేస్తానంది.

సుందరరా: అదే మరింత చిక్కు. ఆవిడ మనింటికి రాకపోయినా నేనే స్వయంగా కేసు కొట్టేసే వాడినేమో. అల్లాంటప్పుడు వాళ్ళవల్ల ఏదైనా సహాయం పొందితే, అది వాళ్ళని అన్యాయం చేసినట్టవుతుంది.

సుందరమ్మ: ఏమో బాబూ! మీ ధర్మ విమర్శ నాకర్థం కావటం లేదు. ఇంతకీ నేను మొదట్నించీ చెప్పిన విషయాలన్నీ మీకేమీ పట్టినట్టుగా లేదు. నా జన్మలో ఇదే నేను మిమ్మల్ని గట్టిగా కోరిన కోరిక. అది ఎల్లాంటి పరిస్థితుల్లో ఎందువల్ల నేనడిగానో మీకూ తెలుసు. తర్వాత మీ ఇష్టం.

సుందరరా: (నిట్టూర్చి) సుందరం! నాకు పెద్ద జీవిత సమస్య తీసికొచ్చావు. అయినా నేను అక్రమ మార్గంలో తలవంచలేను. భగవానుని సహాయం ఉంటేనే నే గెలిచేది. ఇప్పుడింకేమీ మాట్లాడకు. అరుగో పిల్లలు వస్తున్నారు.

శంకర్, నిర్మల: (ఒక్కసారిగా పరిగెత్తుకుంటూ వచ్చి) నాన్నగారూ, మేం కాలేజీ స్పోర్ట్సులో పెద్ద ఛాంపియన్సు అయిపోయాం. డబుల్సులో మేం యిద్దరం కలిసి ప్లీడరుగారి అబ్బాయిల నిద్దర్నీ నిల్ గేమ్ కొట్టేశాం.

సుందరరా: వెరీగుడ్! అల్లాగా!

సుందరమ్మ: సరే ఇంక పదండర్రా, భోజనాలకి.

* * *

[మర్నాటి ఉదయం]

నౌకరు: అయ్యగారండీ! పోలీసు ఇన్‌స్పెక్టరు తమరి కోసం వచ్చారండి.

సుందరరా: లోపలికి రమ్మను.

ఇన్‌స్పెక్టరు: నమస్కారం సార్!

సుందరరా: నమస్కారం. దయచేయండి. ఏమిటిలా వచ్చారు?

ఇన్‌స్పెక్టరు: ఒక ముఖ్యమైన సంగతి మాట్లాడదామని వచ్చానుసార్. ఈ రోజు ఒక ఖూనీకేసు వాయిదా ఉంది తమ కోర్టులో. తమకు బహుశా జ్ఞాపకం ఉండవచ్చు. సిరిపురం కేసు.

సుందరరా: అవునవును. జ్ఞాపకం వుంది. సాక్ష్యం కూడా వినడం పూర్తి అయింది.

ఇన్‌స్పె: అవును సార్. తీర్పుకి సిద్ధంగా ఉంది. ముద్దాయి నేరస్థుడనే కొంతవరకు ఋజువు అయింది. కాని ఇప్పుడు కథఅంతా అడ్డం తిరిగింది.

సుందరా: అంటే?

ఇన్‌స్పె: అదంతా ముందుగా మీకు చెప్పాలనే వచ్చాను సార్. తమ కభ్యంతరము లేకపోతే ఇప్పుడే చెబుతాను.

సుందరరా: తప్పకుండా చెప్పండి.

ఇన్‌స్పె: ఈ కేసులో నేను మొదటినుంచీ విచారించిందంతా అబద్ధం అని తేలింది. ఆ రోజు సాయంకాలం నాయుడు తన నౌకరును కొట్టినమాట నిజమే. ఆ నౌకరు వెంటనే కళ్ళు తిరిగి పడిపోయిన మాటకూడ నిజమే. కాని వెంటనే వాడికి చికిత్సచేసి తిండి పెట్టించి ఇంటికి పంపించాడు. ఆ నాయుడికి ఏదో కోపం వచ్చి కొట్టినా నాయుడికి వాడు చాలా అభిమానం గల నౌకరు. వాడు బయలుదేరి ఇంటికి వెడుతూ ఉంటే దారిలో వాడిని ఇద్దరు మనుషులు గొంతు పిసికి చంపారు. వాడిశవాన్ని వాడి ఇంటిముందర తెచ్చి పడేశారు. ఈ సంగతి నాయుడు కూడా ఎరగడు. తను వాడిని కడుపులో తన్నటంవల్లనే వాడు ఇంటికి పోతూ దారిలోపడి చచ్చాడని నమ్మాడు. అందువల్లే సాక్షులందరికీ లంచాలుకూడా ఇచ్చి కేసులోంచి బయటపడడానికి చాలా ఖర్చుపెడుతున్నాడని తెలిసింది. అతడికోసం వాళ్ల మామ అంటే పెదనాయుడు ఎంతో ఖర్చు పెడుతున్నాడట కూడాను.

సుందరా: అయితే ఇవన్నీ మీకెలా తెలిశాయి?

ఇన్‌స్పె: గ్రామంలో ఎన్నో కక్షలు ఉన్నాయి సార్. ఖూనీచేయటం కూడా చూసిన ఆడవాళ్లు దొరికారు. వాళ్ళు ఆ మాట దాచలేక ఎవరితోనో చెప్పారు. కూపీ దొరికింది. నిన్న సాయంకాలం వెళ్ళి వాళ్లని ఎరెస్టు చేశాక వాళ్ళే నేరం ఒప్పుకున్నారు. తక్కిన సాక్ష్యం కూడా అంతా సిద్ధముగా ఉంది.

సుందరరా: చిత్రంగానే ఉంది. అయితే ఇప్పుడు మీరు నాతో ఇవన్నీ ఎందుకు చెప్పారు.

ఇన్‌స్పె: నేను ఇంతవరకూ చేసిన పొరపాటువల్ల చివరికి అన్యాయంగా శిక్షపడుతుందేమోనని భయం వేసింది. ఉండబట్టలేక మీతో చెప్పేశాను. ఉన్న విషయం అంతా సూపరింటెండెంటుకి రిపోర్టు చేశాను. పాత ఛార్జిషీటు ఉపసంహరించుకొని కొత్త కేసు కోర్టుకి నివేదించాలి. అందుకు తమరు ఒక 4 రోజులు వాయిదా ఇప్పించాలి. ఈ లోగా అంతా సిద్ధం అవుతుంది.

సుందరరా: కోర్టులో అల్లానే అడగండి. నా కభ్యంతరం లేదు. మీకిందుకు మాట రాదా?

ఇన్‌స్పె: వచ్చినా నేను సిద్ధంగానే ఉన్నానండి. కాని న్యాయం జరగటం ముఖ్యం అనే నమ్మకంతో రిపోర్టు వ్రాసి పంపించాను.

సుందరరా: మీ నిజాయితీ చూస్తే నాకు చాలా సంతోషం కలుగుతోంది. కాని మీరు మొదట అలా పొరపాటు పడడానికి కారణం!

ఇన్‌స్పె: నిజం చెప్పాలంటే నా పొరపాటుకి కారణం నాయుడేనండి. మొదట్లోనే తను కొట్టినట్లు ఒప్పుకున్నాడు. తనకెట్లాగైనా సరే ఈ కేసులో వదలిపెడితే వెయ్యి రూపాయలు లంచం ఇస్తానన్నాడు. దాంతో నాకు అతడే ముద్దాయి అనే నమ్మకం బలపడిపోయింది.

సుందరరా: మీ ప్రవర్తన చూస్తే చాలా ఆనందంగా ఉంది.

ఇన్స్పె: మరోకవిశేషం. నన్ను డిప్యూటి సూపరింటెండెంటుగా ప్రమోషను ఇచ్చి పట్నానికి బదిలీచేశారు. నాలుగు రోజుల్లో ఈ కేసు పని పూర్తిజేసి వెడదామనుకుంటున్నాను.

సుందరరా: ఓ. కంగ్రాచులేషన్స్, చాలా సంతోషం. అసలు మీదేవూరు?

ఇన్స్పె: మా నాన్నగారు మద్రాసులో వకీలుగా ఉండేవారండి. ఆయన పేరు రామనాథంగారు.

సుందరరా: ఏమిటీ? సత్యవాది రామనాథంగారు కొడుకవ?

ఇన్స్పె: అయ్యేనండి. రావుసాహేబు.

సుందరరా: అల్లా గటోయి. అయితే నువ్వు మావాడివే. సంవత్సరంనించీ ఇక్కడ వుండికూడ మనం గుర్తెపట్టుకోలేకపోయాం. నేనూ, మీనాన్న కలిసి బి.యేస్ చదువుకున్నాం. అతను నాకు ప్రాణస్నేహితుడు. నీవు పదేళ్ళ పిల్లవాడుగా వున్నప్పుడు చూశాను. మళ్లీ మూడేళ్ళక్రిందట ఒకజాబు వ్రాశాడు మీనాన్న. నీవు ఎం. ఎ. కూడా ప్యాసయావని, ఉద్యోగ ప్రయత్నంలో వున్నావనీ. అయితే నువ్వు పోలీసులో చేరావన్నమాట. మీ నాన్నగారు కులాసాయేనా?

ఇన్స్పె: కులాసాయేనండి.

సుందరరా: బాగుంది. నీకు పెళ్లయిందా?

ఇన్స్పె: (నవ్వుతూ) లేదండి.

సుందరరా: ఓ అయితే నువ్వు పెళ్ళికొడుకువన్నమాట.

నిర్మల: [ప్రవేశించి] నాన్నగారూ, మీకు టైమయితే భోజనానికి లేవవచ్చు.

సుందరరా: ఇల్లా రావమ్మా. ఇదుగో ఈ ఇన్స్పెక్టరుగారెవరో తెలుసా? పన్నెండేళ్ళ క్రిందట అంటే నువ్వు నాలుగేళ్ళపిల్లగా వున్నప్పుడు మనం అంతా బెంగుళూరు వెళ్లినప్పుడు రామనాథంగారింట్లో నెల్లాళ్ళు ఉండలేదూ? నీకు జ్ఞాపకంలేదు కాబోలు.

నిర్మల: (సిగ్గుపడుతూ) లేదుకాని మీరూ, అమ్మా అప్పుడప్పుడు చెబుతూ వుంటారుకదూ-రామనాథంగారి సంగతి.

సుందరరా: అవునమ్మా! ఆయనకొడుకే. ఇతను ఎం. ఏ. ప్యాసయ్యాడు. ఇప్పుడు డెప్యూటీ సూపరింటెండెంటు కూడ అయ్యాడు. ఇది మా అమ్మాయోయ్. నిర్మల. ఇంటరు క్రిందటి సంవత్సరంప్యాస్ అయింది. ప్రస్తుతం పెళ్లికొడుకుల కోసం వెదుకుతున్నాం.

నిర్మల: వస్తా నాన్నగారూ - అమ్మ పిలుస్తూంది.

సుందరరా: సిగ్గుపడకమ్మా! ఇదుగో చూడమ్మా. ఇతనుకూడా ఇక్కడే భోజనం చేస్తాడు.

ఇన్స్పె: అహహః. అబ్బే. ఎందుకండీ. నేను వెళ్ళాలి. సెలవియ్యండి.

సుందరరా: వీల్లేదు. నువ్వు నాతో తినాల్సిందే. దానికేంకాని, అయితే నువ్వింకా పెళ్లిచేసుకోకపోతే మీ నాన్న ఊరుకున్నాడటోయ్?

ఇన్స్పె: లేదండీ. నేనే ఇంత తొందరగా చేసుకోవటం ఇష్టంలేక ఏదో సాకులు చెప్పి ఆలస్యం చేస్తున్నానండి. ఈ ఏడు ఏదో సంబంధంచూసి తప్పకుండా చేసుకోవాలని నాన్న గట్టిగా వ్రాశాడు.

సుందరరా: వెరీగుడ్. ఇంకా సంబంధం కుదరలేదన్నమాటతే. భోజనానికి లే.

* * *

(భోజనాలయి ఇన్స్పెక్టరు వెళ్లినతర్వాత)

సుందరరా: ఏం సుందరం, పిల్లవాడెట్లా వున్నాడు? నువ్వు ఊఁ అంటే ఈ సంబంధం కుదిరినట్లే.

సుందరమ్మ: మీరు వట్టి అమాయకులండీ. అంతా మీ చేతుల్లో ఉన్నట్లే మాట్లాడుతారు. వాళ్ళు ఒప్పుకోవద్దూ.

సుందరరా: హుఁ. నీవే అమాయకత్వం. నాకూ రామనాథానికీ ఉన్న స్నేహితత్వం నీకు ఇంకా తెలియలేదన్నమాట. ఇంతకీ నీకు వచ్చాడా? లేదా? చెప్పు.

సుందరమ్మ: నచ్చకేమండీ. ఎమ్. ఏ. కూడా ప్యాసయాడంటున్నారు. బుద్ధిమంతుడిలాగ కనిపిస్తున్నాడు. కాని కట్నం మాటో?

సుందరరా: ఇంకా నీ చాదస్తం వదల్లేదు. రామనాథానికి నేను కట్నం ఇచ్చేదేమిటి? నేను వాణ్ణి అడక్కుండా ఉంటే చాలు. జాబు రాసేస్తున్నా.

సుందరమ్మ: అయితే నాయుడుగారి తల్లి వస్తే ఏం చెప్పమన్నారండీ?

సుందరరా: నేనిందాకా చెప్పలేదా? రూల్సుప్రకారం న్యాయంచేస్తాను. మన గడప తొక్కవద్దని చెప్పు.

(కొన్నాళ్ల తరువాత)

శంకర్: హల్లో అక్కా, వెరీ సారీ, నేను మీ అమ్మల్నందర్నీ విడిచిపోతున్నా. సిటీలో ఇంజనీరింగ్ వెలిగిస్తారు శ్రీ వారు.

నిర్మల: అంటే సీటొచ్చిందా?

శంకర్: ఓ యస్. మనకి రాకపోవటమేమిటి? మనం హాస్టల్లో ఉంటాం. తర్వాత నువ్వూ అక్కడికి రావొచ్చు.

నిర్మల: నేనెందుకూ?

శంకర్: సారీ. నీకు ఇంకా అవధి కొత్త వార్తేనా చేరలేదన్నమాట. అయితే విను. శ్రీ ఎస్. శివరామ్, ఎమ్మే, డిప్యూటీ సూపరింటెండెంటు అవ్ పోలీసు-మా బావగారు-అంటే మా అక్క ప్రాణనాథుడు. ఆయనవద్దకే తమరు రావటం.

నిర్మల: నోరుముయ్యి, అతిగా వాగకు.

శంకర్: ఆగాను. ఒక రిక్వస్ట్.

నిర్మల: ఏమిటది?

శంకర్: నువ్వు సభ్యమైన భాష మాట్లాడాలి.

నిర్మల: ఏడిశావ్.

శంకర్: అదుగో మరి మళ్ళీ. ఇప్పుడే నాన్నగార్కి రామనాథంగారు వ్రాసిన ఉత్తరం అమ్మకి వినిపిస్తుంటే విన్నా. ముహూర్తం పెటిస్తారట. నిన్నవ్వాళ చూశాడుకదూ. ఇంకేముందీ. అన్నం నీళ్లూ మానేసి నీకోసం తపస్సు చేస్తున్నాట్ట. ఏంకావాలిరా అని వాళ్ళనాన్న అడిగితే "వాళ్ళమ్మాయే!" అని పేచీలు.

నిర్మల: షటప్.

శంకర్: అదుగో! మళ్ళా.... ★




నేను బాగా వ్రాయలేను, అందుచేత యెప్పుడూ వ్రాయలేదు, కాని యీ మధ్య చాలమంది అత్తగార్లనే వాళ్లి మీద దుమ్మెత్తిపోసేయడం, కోడళ్ళనే వాళ్ళు వ్రాసేయడం—ఇదంతా చూస్తూవుంటే నేనెందుకు వ్రాయకూడదనుకున్నా; అందుకనే కాస్త వ్రాస్తున్నాను. నామనుమలు, మనుమరాళ్ళూ అయిన మీరందరూ నేను వ్రాసిందాట్లో తప్పులు వుంటే కోపగించుకొని, నన్ను తిట్టిపోయవద్దని కోరుతున్నాను. మిమ్మల్నందరినీ మనుమలు మనుమరాళ్ళు అని వ్రాశానంటే పైన హెడ్డింగుచూస్తే నా వయస్సు తెలుస్తుంది. ఇప్పటి పరిస్థితుల్ని చూస్తూ, ఒక్కోసారి నా చిన్నప్పటి రోజుల్ని జ్ఞాపకానికి తెచ్చుకుంటే నేనే విచారిస్తూ వుంటాను. మారోజుల పద్ధతులు, తిట్లూ, సదాచారాలు, ధర్మాలు ఇప్పుడు వెయ్యోవంతుకూడా కనబట్టంలేదు. ఏదో కాస్త గద్దిద్దాము, నచ్చచెప్దామని నాలాంటి ముసల్దీ చెప్తే, అత్తగారు సాధిస్తోందనో, మామ్మగారు చంపేస్తోందనో అనేయడం. కాబట్టే మీరూ, నన్నెక్కడ నిందారోపణ చేస్తారో అని భయంతో అలా నిందించవద్దని సవినయంగా కోరుతూ వ్రాస్తున్నాను.

మారోజులు అనాగరికపు రోజులు! ఎందుకంటే, మీవి నాగరికపు రోజులని భావిస్తున్నారు కాబట్టి! మా కట్టూ, బొట్టూ, ఆచారాలు మీకు అనాగరికంగా కనుపిస్తాయి. కాబట్టేన్నీ!!

## అనాగరికపు రోజులు!

నేను యీ వ్యాసాన్ని నా మనుమరాల్ని కొంచెం అందంగా 'నకలు' తీసిపెట్టవే అంటే, అదేంటి మామ్మా నకలు, నకలేంటి 'కాపీ' అనలేవు? ఈరోజుల్లోకూడా ఆపదమేంటి! అంది. ఇదేమిటే నకలంటే తప్పా అంటే, నకలు అన్నపదం అందంగాలేదు. చక్కగా కాపీ అన్నపదాన్ని వుపయోగించు మామ్మాఅంది. ఓసి నీఅమ్మ కడుపు బంగారంగానూ అని ముక్కుమీద వేలు వేసుకున్నా. ఇవన్నీ చూస్తూవుంటే నిజంగా నేను అనాగరికపు మనిషినే అని అనేసుకున్నా. ఒకవేళ నాగరికపు మనిషిని అని నేనన్నానంటే, నాపేరునుచూసి మీరు వూరుకుంటారా? వూరుకోరు. ఎందుకంటే నాపేరు పాతకాలం కాబట్టి. అంతెందుకు ఓ మనమణ్ణిగాని, ఓ మనమరాలినిగాని మీ మామ్మగారి పేరేంటి అని అడిగితే యేమో నాకు తెలీదు. 'మామ్మ' గారనిమాత్రం పిలుస్తాం అంటారుగాని, మా మామ్మ గారిపేరు 'పొన్నాడ గుట్టమ్మ' అని చెప్పరు. ఒక్కమనమడంటాడుగదా "మామ్మా నీపేరు బాగాలేదు మార్చేసుకుందూ. యెలా పెట్టేరాపేరు" అంటాడు. అందుకని నాకు నేనే అనాగరికతకు చెందిన దాన్ని అని చెప్పేసుకుంటున్నాను.

మారోజు లన్నీ పాతకాలం రోజులూ, మోటురోజులూ, యెందుకంటే చాలా పాత రోజులు కాబట్టి. తల్లిదండ్రులు భగవత్స్వరూపులనీ పతియే దైవంఅని నమ్మేము; అలాగే పూజించాము. తండ్రి అనడంతోనే యెంతో ప్రేమ, అపారభక్తి, భర్త అనేసరికి భగవంతుడేఅని పూజించేవాళ్ళం. ఈరోజులెలా వున్నవీ అంటే "అద్దాల్లో వున్నప్పుడే బిడ్డ" ఆలివంకవారు ఆప్తబంధువులైరి" రోజులు. అంచేత తప్పకుండా యివినాగరికపురోజులే.

## కొంగున పెనిమిటి!

నామనుమడు తన జేబులో పెళ్ళాన్ని పెట్టుకుతిరిగితే, మనుమరాలేమో చీరకొంగుని కట్టుకు తిరుగుతుంది మొగుణ్ణి! అంత ప్రేమ! మీరు యెలా కట్టుకుందా అని అనుమానం పడేరు. వాడు దానిఫోటో జేబులో పెట్టుకుంటాడు; వీడిఫోటో పెళ్లాం కొంగున కట్టేసుకుంటుంది అంతే! ఆదేమిటే మనస్సులో వుండాలిగాని ఫోటో కట్టేసుకుంటే వచ్చేస్తుందా అంటే ఓ తప్పకుండా అంటుంది. ఇలా వున్నవి కాబట్టే మీదంతా నాగరికపు రోజులు. మేము యే సీతాదేవినో, అన్నపూర్ణావిశాలాక్షినో ఆదర్శంగా తీసుకుని వాళ్ళెలా ప్రవర్తించేరో చదివి తెల్సుకుని, నేర్చుకునేవాళ్లం. సీతాదేవట:

శ్లో॥ "స్వప్నేపి నాయం నహి మే స్తినిద్రా
శోకేన దుఃఖేన చ పీడితాయాః
సుఖం హి మే నాస్తి యతోస్మిహీనా తే
నేష్టు పూర్ణ ప్రతిమాన నేన॥

వనితాలోక

రామేతి రామేతి సదైవబుద్ధ్యా విచి
వాచా బ్రువతీ త మేవ।
తస్యానురూపాం చ కథాం తమర్థ ౹.
ప్రపశ్యామి తథా శృణోమి॥
అహం హితస్సద్యమనోభవేన సంపీడి
తిద్గత సర్వభావా।



ఆకాలపు కథ

శ్రీమతి ప

ప్రత్యేక వ్యాసం

# ట చెపితే రాయ దంటారా?

# మనవలకు మనవరాళ్లకు ఓ మంచిమాట!

విచిన్తయన్తీ సతతంతమేవ తదైవపశ్యామి
తథా శృణోమి" కిష్కింద.

ఇది స్వప్నమందు; నిద్రపోయిననే గదా స్వప్నం? శోకమున, దుఃఖమున పీడితురాలనై వున్నానే. నాకు నిద్రకలుగనే కలుగదా? సుఖము చేతనైనా, నిద్రకలుగునా? వున్నమ



...న 'మామ్మ'
...ఢ గుట్టమ్మ

చంద్రునివంటి ముఖంకలిగిన, నా రాము విడిచిన నాకు సుఖంకూడ కలుగుతుందా? నే నెల్ల వేళల రామా, రామా యని రాము నే బుద్ధిని ధ్యానించుచూ రాము నే నోటను పలుకుచూ, ఆ రాముని కథ వినుచు నామన స్సంతయూ అతని యందే నెలకొల్పి యెల్లప్పుడూ ధ్యానించుచున్నాను. నా మనస్సున చింతించునట్లే నాకన్నులకు గోచరించుచున్నది. నా చెవులకు వినిపించుచున్నది— అని తలపోసింది.

మనస్సులందు నిలుపుకొని పతియే దైవం అని భావించి పూజించి భర్త సౌఖ్యం, భర్త కష్టం సగపాలు పంచుకొని అన్యోన్యంగా జీవించి యెంతో ఆనందాన్ని అనుభవించాము. అందుకనే నేడు మేమంతా అనాగరిక జాతికి చెందినవాళ్ళమై పోయాము.

## పెళ్లాన్ని 'ఏర్రా' అనేవాళ్లం!

ఈ రోజుల్లో కొందరు పెళ్ళాన్ని 'యేరా' అని సంబోధిస్తే, అది (అంటే వాడి పెళ్లాం) 'యేమేవ్' అంటుంది! ఇదేం ఖర్మరా అంటే అంతా 'నాజూకు' అంటున్నారు. ఇంకా భర్త పొరుగూరువెళ్తే వారానికి ఒక 3,4 వుత్తరాలు అక్కడ్నించి వస్తే, ఇక్కడ్నించి మరో 3,4 వెళ్తాయి. ఇదంతా యేమిటంటే ఆ! ఆ రోజుల్లో పోస్టాఫీసులుంటే రాముడూ సీతా రోజుకి నాలుగు వుత్తరాలు వ్రాసేసుకుందురు అంటారు! ఇంకా కొన్ని కొన్ని, కుటుంబాల్లో చూస్తే యెంత విచిత్రంగా వుంటున్నారో మరీ బాధపెట్టూ వుంటుంది. భర్త సినిమాలకి తీసుకు పోకపోయినా,మంచి చీర కొనకపోయినా జంకేమీ లేదు! నిలువునా చీరేస్తున్నారు. భర్త ఆదాయంతో వాళ్ళకి నిమిత్తం లేదు. జాళ్లగొలయేదో అంతే.

సీతాదేవి రాక్షసులమధ్య (ఖైదీ) వున్నప్పుడు ఆమెను రాక్షసస్త్రీలు బంధించి, బలాత్కరించు సమయంలో వాళ్ళతో అందిగదా:

"దీనో వా, రాజ్యహీనో వా
యో మే భర్తా స మే గురుః"

నా కెవరు భర్తయో అట్టి వ్యక్తి దీనుడైనా, రాజ్యహీనుడైనా అతడే నాకు గురువు అంది. (కిష్కింధాకాండము)

నేటి తంతు అలా కనిపించదు. ఈగొడవంతా పడలేకే ప్రభుత్వం కూడా విడాకుల చట్టం అమల్లోకి తెచ్చింది. యెందుకంటే ఈ కాలం నాగరికత కాలం కాబట్టి!

'తం నిత్యమనురక్తాస్మి యథాసూర్యం సువర్చలా' అని మేం బ్రతికాము. (అంటే సువర్చలాదేవి సూర్యునియందు యెట్టి అనురాగవతియై వున్నదో, అట్లే నేనూ నా భర్తయం దనురాగం కలిగివుందును). కాబట్టే మేము అనాగరికులము. మాలా బ్రతకండోయి, జాగ్రత్తగా వుండండి, మంచి బుద్ధితో ప్రవర్తించండి అని చెప్తే 'అత్తగారూ-సాధింపులూ'! అని పెద్ద పెద్ద హెడ్డింగుల్తో రచనలున్నూ! పోనీ ఈ పెద్దవాళ్ళు యెందుకు చెప్తున్నారో విందామని వుండకపోవడం సరికదా, ఇదెప్పుడు చస్తుందా, త్వరగా చంపేయిదేవుడా దీన్ని రోజుకి మూడుసార్లు ప్రార్థించడం!

మా ముసలాళ్ళ గొడవ అటు ప్రభుత్వానికి అవసరంలేదు, యిటు మీకూ అవసరం లేదు. పోనీ భగవంతుడా త్వరగా తీసుకుపో బాబూ నీలో కలిపేసుకో అని ప్రార్థించినా మాజోలికి రావడానికి దేవుడికీ ధైర్యం లేదు. ఏమంటే మా శరీరాలు అలాంటివి. కాబట్టి, పూర్తిగా తొంభై, నూరు, నూట పదులూ, నూట ఇరవైలు చూస్తేగాని మా శరీరాలు పంచభూతాల్లో కలవడంలేదు. ఎందుకంటే మేం మోటువాళ్ళం కాబట్టి.

మేం అయిదుగురు అప్పచెల్లెళ్ళం. నేనే కడసారపుదాన్ని, నా పెద్దక్కగారు నాకు చావురావడంలేదేమా, భగవంతుడు నన్ను చంపడం మర్చిపోయాడేమోనని భావిస్తూవుండేది. ఆఖరికి అనుకున్నంత పని చేసింది. తన 106వయేట నూతిలో పడి చచ్చిపోయింది! చనిపోయే సరికి పళ్లు గట్టిగా వున్నై, చూపుతగ్గలేదు, శరీరం రాయిలా వుంది. ఆవిడ పేరు బోగమ్మ గారు. తతిమ్మా వాళ్లు 80,90ల్లో చచ్చిపోయారు. యింకా ఓ కావిడ వుంది. ఆవిడకు దగ్గిర దగ్గిర తొంభై. ఇంకా మనుల్తూనే వుంది. దృష్టిలోపం యింకా రాలేదు. నా భర్తగారికి తొంభైపైన వుంటాయి. ఆయనకున్న శరీరదారుఢ్యం మా సంతానానికి లేదు. నా మనుమడు ప్రవరుని

★ మంచిమాట చెపితే .... ★

తీర్థయాత్ర (మనుచరిత్ర)లో వాళ్ళపాత్ర్య భాగంలో ప్రవరాఖ్యుడు 'ప్రత్యూషవేళ' అని వస్తే దానికర్థమేమిటని అడిగా. దానికి అర్థం తెలియదన్నాడు. వేకువఝామునరా అని అంటే యేమిటో వాడికి తెలిసి వస్తేగా? ఆ వేళకి లేవగలిగితేగా? భర్త తొమ్మిదింటికి లేచి మేడదిగి వస్తే అతగాడు లేచివచ్చిన అరగంటకి గాని భార్య లేవలేదు. అయ్యో! అయ్యో! అని మనసులో అనుకుంటాం. (పైకంటే యేమో!) ఇలావున్నై మీ నాగరికపురోజులు!

## దేవుడికే ధైర్యంలేదు!

మా రోజుల్లో పరిస్థితులు జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా విచారిస్తూ వుంటాను. యేంలాభం? యెవరితో చెప్తే యెవ రాచరిస్తారు? హర్షించగలరు? తెల్లారగల్లే లేచేవాళ్ళం. అంటే మొదటికోడి కూతకు లేచిపోవాలి. అక్కణ్ణించి యెవరిపని పాటలు వాళ్ళవి. బియ్యం దంచుకునే వాళ్ళు, యిల్లు శుభ్రం చేసుకొనేవాళ్ళు, వాకిలి తుడిచి కళ్ళాపుజల్లి, చక్కగా ముగ్గులుపెట్టుకొని, స్నానజపాది కృత్యాలు ముగించేసరిక్కాని సూర్యోదయం అయ్యేదికాదు. ఖర్మకాలక కొద్దిగ పొలుతు వచ్చిందా వీధివాకిలి తుడుచుకొనేటప్పుడుగాని, కళ్ళాపుజల్లేటప్పుడు గాని, ఆ వీధిని పోయేవారు ఆగి 'యేం లప్పా ఇంకాంచేం పొద్దెక్కాక వీధిలోకి రాలేకపోయావా!' అని చీవాట్లు వేసేవారు. మాకూ బుద్ధి వచ్చేది. అంతేగాని మళ్ళీ వాళ్ళమీద తిరగబడి 'యేం నేనెప్పుడు కళ్ళాపేస్తే నీకేం?' అని జవాబు తిరిగి చెప్పడం యెరగం. ఎందుకంటే ఆయన చెప్పినదాంట్లో యెంత సత్యం, యెంత అర్థం వుందో గుర్తించగలిగే శక్తి మాకుండేది కాబట్టి. అంచేత మీకందరకూ అనాగరికుల మయ్యాం.

## .... కంటబడితే ఒట్టు!

పరాయి మగాడికి కనబడితే ఒట్టు! యెంతో చనువైన వాళ్ళు వస్తేనే తప్ప మిగతా వాళ్ళందరికీ ఫలానా యింట ఆడవాళ్ళెలావుంటారో చెప్పగలగడం దుర్లభం. వాళ్ళా అంతే. ఒకానొకప్పుడు యింటి మగవాడు పొరుగూరు వెళ్ళినా, విదేశం వెళ్ళవలసి వచ్చినా యింటికి కావలసిన వన్నీ యింట్లోపడేసి, తనకు అత్యంతప్రియమిత్రుల్ని అప్పుడప్పుడు తన యింటి యోగక్షేమాలు తెల్సుకొని తెలియ బరచవలసిందిగా కోరి మరీ వెళ్ళేవారు.

అప్పటిలో మా గ్రామంనుండి రంగూను ఓడలుమీదపోయి వర్తకాలు చేసేవారు. బాగా లాభం వుండేది. మా తండ్రిగారు 'మాతసన్యాసి'గారు. ఆయన ఈ గ్రామంలో పెద్ద అనుభవశాలి. ఓడలమీద 'సఖోదా' (అంటే యిప్పటి కెప్టెన్) గా వెళ్ళేవారు. వాటిని తెలుగుఓడలు అనేవాళ్ళం. రంగూన్‌ని 'రంగం' అంటూ వుండేవాళ్ళం. ఆయన రంగంనుండి యెన్నో పెట్టెలు, వస్తువులూ తెచ్చేవారు. అవి యిప్పటికీ వున్నవి. ఆయన సబురు (కెంపు) వెళ్ళేటప్పుడు యింటికి కావలసినన్నీ తెచ్చి పడేసి మరీ వెళ్ళేవారు. అప్పుడు కులాలు నామమాత్రం. అన్ని కులాల వాళ్ళు కలిసి మెలిసి తిరిగేవారు. 'పరస్త్రీ' అంటే 'తల్లి' అనే భావం. యేకోమటికో చెప్పిపోయేవారు మా తండ్రిగారు. యేమైనా కావాలిస్తే యింట్లో యిస్తూవుండమని. అలాగే వారూ (అకోమటి) వచ్చి "యేం అప్పా యేమైనా కావాలా?" అని అడిగియిచ్చి వెళ్తూవుండేవారు. గ్రామస్తులందరూ ఒక కుటుంబంలో వాళ్ళగానే వుండేది. కులవిభేదం తెలియదు. ఒకరి సుఖాలు, ఒకరికష్టాలు అందరివీని. అందరూ అన్నా చెల్లెళ్లు లేక అప్పా (అంటె అక్క) తమ్ములూను. ఐకమత్యం యెంతో వుండేది. ఒకళ్ళయింట్లో పెళ్ళయితే అందరూ తలోపనీ సర్దుకొనేవారు. ఒకళ్లు అప్పడాలు, ఒకళ్లు వడియాలు, ఒకళ్ళు ధాన్యం దంచటం, సున్నంకొట్టడంయిలా సర్దుకొని చేసేవాళ్లం. అరిశలు వగైరాలు మా పిండివంటలు మీకు మోటైపోయి విడిచిపెట్టేశారు. చక్కగా సున్నివుండలు, అరిశలు, బూరెలూ చేసుకు తినేవాళ్లం. అవి ఇప్పటాళ్లకి పెడ్తే మళ్ళీ లఘుక్రవ్యాదో, స్వర్ణక్రవ్యాదో సేవించినా అరుగుకోలేరు. తినగలశక్తి లేదు, ధైర్యమూ, లేదు. యెంతసేపూ సున్నితమైన తిండీ, నాగరికపుతిండీ కావాలిమీకు.

ధర్మార్థకామమోక్షా లని పురుషార్థాలు నాలుగు. యేపనిచేసినా ధర్మదృష్టితోనూ, మోక్షప్రాప్తికోసమూ చేసేవాళ్లం. ధర్మానికి కట్టుబడి వుండేవాళ్లం. యెందుచేతనంటే:

"చలా లక్ష్మీః చలాః ప్రాణా
శ్చలం జీవితయౌవనమ్,
చలాచలేచ సంసారే
ధర్మ ఏకోహి నిశ్చలః"
—'భర్తృహరి'

లక్ష్మి (అంటే ధనము), ప్రాణము, జీవితము, యౌవనము, సంసారము చంచలమైనవి ధర్మమొక్కటే చలనములేనిది. అట్టి ధర్మము యెక్కడ లభిస్తుంది?

స్మృతి, శ్రుతి, సదాచారః
స్వశ్యచ ప్రియం ఆత్మనః॥
ఏతత్ చతుర్విధం ప్రాహుః
సాక్షాత్ ధర్మస్య లక్షణమ్॥ 'మను'

వేదమునందు, ధర్మ శాస్త్రములందు, సదాచార సంపన్నులయందు గొప్ప గొప్ప పెద్దవారి, సత్పురుషుల వాక్యాలయందు, యీ నాల్గు విషయాల్లోనూ ధర్మము వున్నది. వేదాలు, ధర్మశాస్త్రాలు అసలే కనబట్టం లేదు. పెద్దలు, సత్పురుషులు, సదాచార సంపన్నులు వుంటే వాళ్ళకేదో నామకరణం చేసి కోలాహలం చేయడం నేటి పరిపాటి అయింది. మేము అధర్మం త్రొక్కటానికి వీలులేదు. స్త్రీ అనడంతోనే పరపురుషునికి కనబడకూడదు. పరపురుషు డెవరైనా చూస్తే అతడు తల్లిగా భావించాల్సిందే. యింక మా సదాచారాలన్నీ మీకు దురాచారాలయ్యాయి!

## పెరుగన్నం, ఆవకాయి!

తర్వాత మేం చక్కగా చద్దన్నం పెరుగు ఆవకాయతోనూ తినేవాళ్ళం. అది నేడు మోటైపోయింది. చక్కగా ధాన్యం దంచిన బియ్యం వాడే వాళ్ళం. అది నేడు అనాగరికతైపోయింది. పెద్దలను పూజించే వాళ్ళం. తల్లిదండ్రులు అత్తమామలు. అనేవారిని నేడు దూషించడంలోకి దిగింది. తెల్లవారు ఝామున లేచి యింటిపనుల చక్కబెట్టుకోవడం మా ఆచారం. అదే మీకూ చెప్తే మా అత్తగారు సాధించేస్తోంది అని లౌడుస్పీకర్లలోను, పత్రికల ద్వారాను చాటడం. అది అత్తమ్మగారు ఎందుకలా మనలని గద్దిస్తున్నారు? దానిలోని అర్థం తెలుస్తేగా నేటి బిడ్డలకు? అలాగని యేమైనా గట్టిగా చెప్తే భర్తకి కోపం రావడం, తత్క్షణం ఈ తల్లిదండ్రుల్ని విడిచి వేరేకాపరం! అయితే అత్తగారు సామాన్యురాలా! ఆవిడా అసామాన్యురాలవుతోంది. అత్తగారైపోతోంది. అంటే అది యింకా నవయౌవనమే. ఆవిడ అత్తగారంటే అవుతోందిగాని వయస్సెక్కడ? యే 18 వ యేటో పెద్దమనిషవ్వడం, వెంటనే పెళ్ళి జరిగిపోవడం వెనువెంటనే (అంటే ఒకపది నెలల్లో) పిల్లాణ్ణి కనేయడం. వాడికి యే 17, 18 వ యేటనో పెళ్ళిచేసేయడం కోడలు అత్తారింటికి వచ్చేయడం జరుగుతోంది. అంటే 30,35 యేళ్లకి అత్తగారంటే అయ్యిందిగాని అనుభవం యెక్కడ? వాళ్లేదో అంటే తోక త్రొక్కిన కోడ త్రాచులాగా బుస్సు మనడం! అత్తగారంటే తల్లితో సమానం. ఇంకా తల్లికన్నా హెచ్చనే చెప్పాలి. యేం, కోడలు తప్పచేస్తే ఆతప్పు ఆకుటుంబానిది కాదా! ఆకుటుంబానికి పెద్ద అత్తగారుకాదా! తెల్లవారు

ఝామునే లేచి నీళ్లు తెచ్చుకోరాదూ అంటేనే సాధింపా? తరచూ సినిమాలకి పోవద్దు అంటేనే సాధింపా? లేక వీధరుగుమీద అలా నిలబడవద్దు అని అన్నదే అనుకుందాం అత్తగారు. యెందుచేత ఆలా చెప్పిందో గ్రహించుకోలేక 'సాధింపు' అని అనుకోవడం. అనుకుందే తడవుగా పత్రికక్కి ఇచ్చేయడం. ఇదేనా ధర్మం? తనకన్న పెద్దది, దైవంతో సమానురాలైన తల్లివంటి అత్తగారు ఆలా అంది అంటేనే వేరే కాపరమా! ఇదేనా మీకు కాలేజీల్లో బి. ఎ. ప్యాసై నేర్చుకున్నది? అదే మీ నాగరికతా లక్షణమా? ఇలా అడిగేనని మా మామ్మ తిట్టూ వ్రాసిందని భావించి నన్నాదుమ్మెత్తి పోయవద్దు. మీరూ, మీ అత్తగారూ కలిసి ఓరిమితోను, సహనంతోను కలిసి మెలసి వుంటేనే కుటుంబానికి శాంతి. 'క్షాన్తిశ్చేత్కవచేనకిం?' ఓర్పున్నచో కవచములు ఎందుకు! నాగరికతకు లోపం కలుగుతోందని అదో పెద్ద అవమానమని భావించి, ఓర్పును విడిచిపెట్టి, పెండ్లి అవడంతోనే వేరే కాపరానికి పోవాలా? అటు భర్తకీ జ్ఞానం వుండాలి, యిటు భార్యకీ బుద్ధి వుండాలి. అప్పుడే, అయ్యో పెద్దలను, నా తల్లి దండ్రుల్ని విడిచి వెళ్ళడమా అని భావన వస్తుంది. ఆ భావన పోయింది అంటే మనలో ధర్మం నశించిందని భావించాల్సి వుంటుంది.

## మా కాలపు చదువులు

మేం చదువుకోవాలి అంటే యెంతో కష్టపడి నేర్చుకోవాల్సి వుండేది. సాధారణంగా చెప్పేవాళ్ళు ముక్తికోసమేగాని యిప్పటిలాగా భుక్తికోసరం కాదు. యెంతో భక్తి, శ్రద్ధ వుంటేనే వాళ్ళు చెప్పేవారు. యెంతో వ్యయ ప్రయాసల కోర్చి నేర్చుకోవాల్సిందే, మాకీ కష్టం దేనికి, యీ బాధించడం దేనికని అడగ వీల్లేదు. వాళ్ళేం చెప్పినా, నేర్పినా మా బాగు గురించే. ఓ న మః దగ్గరనుండి అన్నీ యిసుకలో వ్రేలుతో వ్రాయించేవారు. అన్ని బరులూ, గుణింతాలు వచ్చిన తర్వాత పెద్దబాలశిక్ష. దాంట్లో యెన్నో విషయాలుండేవి. తర్వాత పురాణాలు, ఎక్కాలు మొదలైనవి అన్నీ కంఠస్థంవచ్చి గణగణా ఒప్పచెప్పగలగాలి. అప్పుడే చదువు వచ్చినట్లు. భాగవతం, రామాయణం, భారతం ఇవన్నీ రావాలి. శతకాలు యెన్నో వుండేవి. అందు కుమారీ శతకం, సుమతి శతకం, వేమన పద్యాలు, భాస్కర శతకం యివన్నీ చెప్పి యెన్నో నీతి బోధలుచేసి యింత జ్ఞానం ఉపదేశించేవారు. యెంతో అనుభవశాలి మాకు గురువుగా వుండి యివన్నీ నేర్పేవారు. ఇంటిదగ్గిర తండ్రి యెంతో బల్లో మేష్టారు అంత. ఆయన ప్రతివారి కష్టసుఖాలు స్వయంగా తెల్సుకొని ఓదార్చేవారు. యెవరైనా బడికి రాకపోతే యెందుకు రాలేదో విచారించి, కారణం తెల్సుకొని అనేక బోధలు చేసి తీసుకుపోయేవారు. నయాన భయాన చెప్పేవారు. చెప్పే చదువు తన విద్యార్థులకి వంటబట్టిందా లేదా వాళ్ళకు ముఖ్యంగా కావాలి. ఇప్పటాళ్ళకి వంట బట్టనీయండి, పట్టనీయక పోనీయండి మరేం తంటాలేదు. వాళ్ళ జీతం, నెలాఖరు యెప్పుడు యివే ఆలోచన్లు. నేను సాధారణంగా బడికి పోయేదాన్ని కాదు. ఏమంచం క్రిందో, పడకల కుచ్చుప్రక్కనో దాక్కుండే దాన్ని. మేష్టారు వెదకి రెక్కపట్టుకొని బరబరా లాక్కుపోయేవారు. అవన్నీ బాగా గురు. ఇప్పటి విద్యాప్రమాణం ఒక పటా (డిగ్రీ) వచ్చిందా లేదా—అంతేకాని, చదువు వచ్చిందా లేదా అనికాదు. మేము ఉత్తరాలు వ్రాయాలి అంటే యెవరికి ఎలా వ్రాయాలో అలాగే వ్రాయాలి. తండ్రిగారిక్కగాని, పెద్దలకిగాని వ్రాయాలంటే 'మహారాజ రాజశ్రీ రాజమాన్య పూజితులైన........వారిక్కి తమపుత్రిక అనేక సాష్టాంగ దండప్రణామము లాచరించి...' పెద్దలు పిల్లల్కి వ్రాసేటప్పుడు కూడా చిరంజీవి సౌభాగ్యవతులు కుమార్తె......ధన కనక వస్తువాహనాభివృద్ధిగాను, పుత్ర పౌత్రాభివృద్ధిగాను, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగాను, ఆశీర్వదించి వ్రాయునది' అంటూ వ్రాసేవారు. ఇప్పుడలా కాదు—'ప్రియమైన భర్త' లేకపోతే 'ప్రియ భార్య' యింత సున్నితం, నాగరికత వచ్చేసింది! పట్టుమని ఓ పదిముక్కలు కూడా మాట్లాడలేరు, చదవలేరు, వ్రాయలేరు. పైగా మేం 'బి.యే' అంటారు. ఇప్పటి చదువులుచూస్తే చిన్నప్పటి భాస్కరశతకంలో పద్యం ఒకటి జ్ఞాపకానిక్కి వస్తూవుంటుంది:

చ॥ చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక
చాలకున్న నా
చదువు నిరర్థకంబు; గుణసంయుతు
లెవ్వరు మెచ్చరెచ్చటం;
బదనుగ మంచికూర నలపాకముచేసిన
నైన, నందు నిం
పొదవెడు నుప్పులేక రుచి పుట్టగ నేర్చు
నటయ్య? భాస్కరా!

## పుట్టుకతోనే పెళ్లాలు!

అలా వున్నవి మీచదువులు. వివేకం లేదు, విజ్ఞానం లేదు; అలా చెప్పేవాళ్లకే వాళ్లేమి చెపుతున్నారో వాళ్లకే తెలియదు! వీళ్లేమి నేర్చుకున్నారో వీళ్ళకు తెలియదు. ఓసారి కాకినాడ పోతూ చూచాను—ఒక పదేళ్ళ కుర్రాడు ఒక అమ్మాయి పేరువ్రాసి దిగువన 'నా పెళ్ళాం' అని వ్రాస్తున్నాడు. పుట్టుకతోనే పెళ్ళాలూ, మొగుళ్ళూ కావాలి. యెందుకంటే యిది నాగరికత కాలం!

అంతెందుకు? గుడికి వెళ్ళేరు అంటే, భక్తితో వెళ్ళినట్లు కనబడరు. వాళ్ళ వాళ్ళ అలంకరణాలు దేవుడిముందు ప్రదర్శించటానిక్కి వచ్చేరా అనిపిస్తుంది. యింక అక్కడ కోరికలు ఒకటా రెండా అనేకం. పిల్లలనిస్తే పది కొబ్బరికాయలు నుండి పరీక్షప్యాసు చేయిస్తే వంద కొబ్బరికాయలు వరకూ వేలం పాటలాగా సాగుతుంది. భగవంతునిమీద భక్తి యేకోశానా కనిపించదు. వీళ్లు పెట్టేనే దేవుడికి గతైనట్లూ లేకపోతే గతిలేనట్లూ చూడండి! దేవుడా నా కాపని చేయిస్తే నీకిన్ని టెంకాయలు కొట్టానని ఒక ప్రభుత్వోద్యోగికి లంచం యిస్తున్నట్లు చెప్పడం. యెంత శోచనీయంగా వుంది. ప్రపంచం తీరు?

మా రోజుల్లో చాలా తరచుగా హరి నామ సంకీర్తనల్లో భజనలు వేకువఝామున మేల్కొలుపులూ, నగర సంకీర్తనలూ, హరికథా కాలక్షేపాలు, పురాణ కాలక్షేపాలు జరుగుతూ వుండేవి. (యిప్పుడవన్నీ పోయి సినీమా కీర్తనలు నిండిపోయేయి) యెంతో భక్తి శ్రద్ధలతో ఆలకించి, మా పాపాలకి పశ్చాత్తాపం పొంది ఆనంద తన్మయత్వం పొందేవాళ్లం ఆరోజుల్లో. అంచేత మాలో పాపభీతి వుండేది. ఇప్పుడు అదికాదు. యిప్పుడు మరోచిత్రం ఓ రాముడా నీవు యీపని చేయగలవా? లేకపోతే చూడు క్రీస్తుని ప్రార్థిస్తాను, అదీ జరక్కపోతే సాయిబుల్లో చేరిపోతాను! యీ బేరాలన్నీ 'లంచం' దేవుడికిస్తున్నట్లనుకొని చేస్తున్నారు. ఓసారి ఒక హరిదాసుగారు మహాభారతం హరికథ చెప్తూ మన భగవంతుడి మీద పూర్తిభారం వేస్తే తప్పక యేపనైనా జరుగుతుంది. భగవంతుని సహాయం లభిస్తుందని చెప్తూ ద్రౌపది వస్త్రాపహరణం గురించి చెప్పేరు.

## హరికథలో ద్రౌపది

ద్రౌపదిని దుశ్శాసనుడు నిండు కౌరవ సభకి లాక్కువచ్చి, మానభంగం చేయ తలపెట్టిన

(49-వ పేజీ తరువాయి)

# నక్షత్ర ఫలితాలు

**(26-2-58 మొదలు 4-3-58 వరకు)**

గ్రహ స్థితి

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| ర బు | వృషభ, మిధున, కర్కాటక, సింహ ములలో చంద్రుడు. | | |
| కు | | | |
| శు శ | | గు రా | |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

వారము అనుకున్నటు ధనలోపము తీర నందున కార్యములు నెర వేరవు. మిత్రులెవరో శత్రులెవరో తెలియదు. మిత్రు లనుకున్న వారు తటస్థమవడం, వ్యతిరేకులనుకున్న వారు కలిసి వచ్చి కార్యానుకూలతకు సహాయపడడంజరుగు తుంది. వర్తకులకు మొదట్లో లాభము లేకపో యిననూ వారాంతమునకు లాభిస్తుంది. విద్యా ర్థులకు శ్రద్ధతక్కువ. 26, 27 తేదీల ప్రయత్న ములో త్రిప్పట. 28,1,2 తేదీలలో కార్య భంగ సూచనలు, గృహమందు అస్థిమితము, 3,4 తేదిలలో మిత్రసహాయము, కార్యసిద్ధి. విచిత్రవస్తు సంగ్రహణము.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈవారము కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. అయినప్పటికీ కార్యసిద్ధికి ఈశ్వ రానుగ్రహమే కారణమని, చేయవలసిన ప్రయ త్నములు విడువకూడదనే దృఢభావముతో వుండుటవల్ల ఎలాంటి ఇబ్బందులూ మిమ్ములను కలతపెట్టవు. ఆత్మీయుల అనారోగ్యవార్త మీకు కొంతవిచారము కలిగిస్తుంది. ఉద్యోగస్తు లకు అస్థిమితము, వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు అశ్రద్ధయున్నా కొత్తవిషయాలు నేర్చుకుంటారు. 26,27 తేదిలలో నిలకడలేని స్థితి. 28,1,2 తేదిలలో కార్యరంగములో ఆటంకములు, ధనలోపము. 3,4 తేదిలలో ధనలాభము, కార్యసిద్ధి.

### *కృత్తిక [అ, ఈ, ఉ, ఏ]*

ఈ వారము అనుకున్నట్లు సొమ్ముచేతికి రాకపోవుటచేతను, ఖర్చులు అధికమవుటచేతను అశాంతి కలుగుతుంది. మీ పనులేకాకుండా ఇతరులకొరకు పాటుపడి శ్రమచెందుతారు. కోర్టువ్యవహారములు కొంతవరకూ అనుకూలి స్తాయి. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు తలె త్తుతాయి. కార్యభారము ఎక్కువవుతుంది. వర్తకులకు అశాంతి. వ్యవహారముపట్ల పేచీలు. భార్యకు ఆరోగ్యభంగ సూచనలు. విద్యార్థు లకు చదువుపై శ్రద్ధతక్కువ. 26, 27 తేదీ లతో కార్యభారము, త్రిప్పట. 28,1,2 తేదీలలో వివాదము, ఆరోగ్యచింత. 3,4 తేదిలలో కార్యలాభము. క్రర విగ్రహశిల్పు లకు మేలు.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈవారము మీరు అనుకున్నట్లుగా పనులు జరగవు. చేతికి వచ్చినసొమ్ము చాలక ఇబ్బందిపడవలసివస్తుంది. ఆత్మీయులకు సహాయము చేసేందుకు పూనుకుంటారుగాని

## బి. నరసింగరావు

అది సాగక మాటపడి మనోవ్యధ పొందు తారు. అశాభంగముకు కారణాలు కనబడక పోయినా ప్రతిపనికి ఆటంకాలు వస్తూవుం టాయి. అవయవములకు దెబ్బలుతగిలే సూచ నలున్నవి. జాగ్రత్తపడుటచేత తప్ప వచ్చును. భూస్వాములకూ, యంత్రములు నడుపు నిపుణులకూ, రసాయనిక శాస్త్రజ్ఞు లకూ, గనుల యజమానులకూ లాభకాలము. 28, 1, 2 తేదిలలో కార్యాచరణలో ఆటం కములు, ప్రమాద సూచనలు. 3,4 తేదీలలో కార్యలాభము.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

మీకు ఈ వారము యోగప్రదముగా వుం టుంది. అధికారుల సహాయముతో నే గాక మీ స్వప్రయోజనమువల్లను, పలుకుబడిని ఉపయోగించుకొని గత రెండు వారముల నుండి కలుగుచున్న ఆటంకములను గడచి కార్యసిద్ధిని పొందుతారు. బంధు సహాయము కూడా కలుగుతుంది. ఆర్థికస్థితి బాగుపడు తుంది. విద్యార్థులకు చదువు చురుకుగాసాగు తుంది. 26, 27 తేదిలలో తొందరలు తగ్గి కార్యక్రమము ఒకరూపములోకి వస్తుంది. 28, 1, 2 తేదిలలో ఖర్చులు ఎక్కువ. తీరుబడి లేని కార్యక్రమం. 3, 4 తేదిలలో మిత్రలాభము, కార్యానుకూలత, ధనాదా యము. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు కొత్తవారితో పరిచ యము కలిగి మీ విజ్ఞానాన్ని అభివృద్ధి చేసు కుంటారు. ఉద్గ్రంథములను పఠిస్తారు. ధనా దాయము ఎక్కువ అవుతుంది. పిల్లల శుభ కార్యాలోచనలు ఒక రూపములోకి వస్తవి. కోర్టు వ్యవహారములు రాజీపడి పరిష్కరిం చుకుంటారు. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఉద్యోగస్తులకు హోదాపెరిగే సూచనలున్నవి. ఉపాధ్యాయులకు, పండితు లకు, న్యాయవాదులకు యోగకాలము. 28, 1, 2 తేదిలలో కార్యసాధనలో త్రిప్పట, శ్రమ. 3, 4 తేదిలలో ధనాదాయము, కార్యానుకూలత.

### * పునర్వసు [కే, కో, హా, హి] *

ఈ వారము మీ పలుకుబడిని ఉపయో గించుకొని కార్యసాధన పొందుతారు. కోర్టు వ్యవహారములు మీ పక్షము అవుతాయి. ధనాదాయం బాగుంటుంది. ఉద్యోగస్తులకు తమతో సమాన హోదాలో వున్నవారి సహ కారంతో అనుకూలంగా వుంటుంది. విద్యా ర్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. బియ్యము వర్తకులకు మేలుకాలము. వెండి నగలవ్యాపారులకు ప్రయాణమువల్ల లాభము. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగ కాలము. 28, 1, 2 తేదీలలో కార్యాచరణ లో త్రిప్పట, శ్రమ. 3, 4 తేదీలలో ప్రయా ణము, కార్యలాభము, బంధు దర్శనము, మృష్టాన్న భోజనము.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీకు శుభయోగము. బంధు మిత్రులను కలుసుకుంటారు. శుభకార్యముల గురించి ఆలోచిస్తారు. యత్నకార్య లాభం వుంటుంది. వాహనయోగము కలుగుతుంది. బంగారము, నూలు బట్టల వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారు లకు, నటీనటులకు యోగము. విద్యార్థులు శ్రద్ధగా ఉత్సాహముతో చదువుకుంటారు. 28, 1, 2 తేదిలలో కార్యభారముచే శ్రమ, ఖర్చులు ఎక్కువ. 3, 4 తేదిలలో ప్రయా ణము, బంధువులను కలుసుకొనుట, శుభ కార్యాలోచన, విందు భోజనము, వినో దము.

### *ఆశ్లేష [డి, డూ, డే, డో]*

ఈ వారము మీ ఆర్థికస్థితి అంత తృప్తి కరముగా వుండదు. కార్యభారము ఎక్కువ. తలపెట్టిన పనులకు ఆటంకములు, త్రిప్పట. వేళతప్పిన భోజనమువల్ల ఆరోగ్యభంగము కలిగే సూచనలున్నవి. శ్రద్ధ వహించండి.

**ధరలు:**

నూలు, వస్త్రములు : మార్పులేదు.

నూనెదినుసులు : మందముగా వుండును.

బెల్లము, పంచదార: మార్పులేదు.

చింతపండు : స్వల్పముగా చౌకపడును.

ఆహారధాన్యములు : తగ్గదలలో వుండును.

పప్పుదినుసులు : మార్పులేదు.

వెండి, బంగారము: స్వల్పతేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. ఉద్యోగస్తులకు, రాజకీయములలో పనిచేయువారికి మేలుగా వుంటుంది. కోర్టు వ్యవహారములు వాయిదా పడుతవి. 28, 1, 2 తేదీలలో కార్యాచరణలో ఆటంకములు, గృహకలతలు, మనోవ్యధ, ధనాదాయము స్వల్పము. 3, 4 తేదీలలో కార్యలాభము. పితృపక్షము వారి సహాయము.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము మీకు అంత యోగకరము కాదు. మొదట్లో సహాయపడతారనుకున్న స్నేహితులు తటస్థముగా వుండడము, ఎవరు ఆటంకాలు కలుగచేస్తారని అపోహపడ్డారో, వారే సమయానికి కలిసివచ్చి కార్యసిద్ధికి తోడ్పడడం జరుగుతుంది. ఉద్యోగస్థులకు ధనలోపమువల్ల మొదట్లో ఒత్తిడివున్నా వారాంతమందు సర్దుకుంటుంది. వ్యాపారస్తులకు మాంద్యము. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. 26, 27 తేదీలలో అస్థిమిత కార్యక్రమము. 28, 1, 2 తేదీలలో ఆటంకము, ధనాభావము. 3, 4 తేదీలలో మిత్ర సహాయము, కార్యలాభము, విచిత్ర వస్తు సంపాదన, విదేశీయుల మైత్రి.

### * (పూర్వఫల్గుణి పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈ వారము తలపెట్టిన పనులకు ఆటంకములు వస్తాయి. బంధువుల రాకవల్ల ఖర్చులు ఎక్కువ. ధనలోపము తీర్చుకుందికి చాలా శ్రమపడతారు. కోరు వ్యవహారములు మీపరముగా తీర్పు అవుతాయి. సంసారముపట్ల అనాదరణ కలదనే అపోహవల్ల కలతలు వస్తాయి. సజ్జన సహవాసమువల్ల ఆధ్యాత్మిక చింతవల్ల మనశ్శాంతి కలుగుతుంది. దైవము మీ పట్ల వుండుటచేత మొదట కలిగిన ఆటంకములు తీరుతవి. 28, 1, 2 తేదీలలో తీరుబడిలేని కార్యక్రమము. ధనాదాయము. 3, 4 తేదీలలో కార్యసాధన; మనశ్శాంతి.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము ఖర్చులు ఎక్కువ. తలపెట్టిన కార్యములు ఫలించవు. కార్యభారము ఎక్కువ. ఇతరులకొరకు కష్టపడి మాట దక్కక వివాదాలకు లోనౌతారు. కోరు వ్యవహారములు లాభిస్తాయి. విద్యార్థులకు చదువు సాగదు. ఉద్యోగస్తులకూ ఒత్తిడి వున్నా తోటివారి సహకారముతో తొందరలు తగ్గుతాయి. వర్తకులకు నిరుత్సాహము. 28, 1, 2 తేదీలలో ఒత్తిడి, వివాదము, భార్యకు ఆరోగ్యభంగముచే వ్యధ 3, 4 తేదీలలో ధనాదాయము, కొంత శాంతి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

మీకు సాహసము, పట్టుదల ఎక్కువ. కార్యాచరణలో ఎన్ని ఆటంకములు కలిగినను పట్టినపట్టు విడువకుండా ప్రయత్నములు చేసి తుదకు కార్యలాభము పొందుతారు. ధనలోపము తీర్చుకుందికి అప్పు చేస్తారు. మీ ప్రయత్నములు ఫలించడం వల్ల మీకు రావలసిన సొమ్ము చేతికివస్తుంది. ఋణ బాధ తీరుతుంది. యంత్రములవల్లగాని, వాహనములవల్లగాని దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రతవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, పోలీసు ఉద్యోగులకూ, గనుల యజమానులకూ కష్టముతో కూడిన యోగము. 28, 1, 2 తేదీలలో మానసికవ్యధ, ప్రమాద సూచన. 3, 4 తేదీలలో లాభయోగము. ఋణవిమోచనము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

గత రెండు వారములనుండి మిమ్మలను వెన్నాడుతున్న కష్టములను గడిచి ఈ వారము ఉత్సాహముతో మీ బుద్ధిబలము, పలుకుబడి ఉపయోగించి మంచి ఫలితాలు పొందుతారు. అధికారుల ఆదరణ లభిస్తుంది. ధనలోపము తీరుతుంది. దూరమందున్న ఆత్మీయుల క్షేమము తెలిసి సంతోషము పొందుతారు. కవులు నూతన రచనలు మొదలు పెడతారు. గణిత శాస్త్రజ్ఞులకు, చిత్రకారులకూ, వైద్యులకూ మేలుకాలము. 28, 1, 2 తేదీలలో విశ్రాంతి లేని కార్యక్రమము 3, 4 తేదీలలో ధన, లాభ యోగములు.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు ధనయోగము. ఇదివరకు కలిగిన ఇబ్బందులన్నీ తీరిపోతవి. నష్టము వస్తుందేమో ననుకున్న వ్యవహారము లాభసాటిగా ఫలిస్తుంది. పిల్లల అభివృద్ధి కొరకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ ఎక్కువవుతుంది. మీకూ, మీ ఇంట్లో వున్న వృద్ధులకూ ఆరోగ్యము సరియవుతుంది. శుభకార్యములలో పాల్గొంటారు. ఉపాధ్యాయులకూ, పండితులకూ, న్యాయవాదులకూ మేలుకాలము. 26, 27 తేదీలలో ధనలాభము. 28, 1, 2 తేదీలలో ప్రయాణము, తీరికలేని కార్యక్రమముచే శ్రమ. 3, 4 తేదీలలో కార్యలాభము, పండిత గోష్ఠి, విజ్ఞానార్జన.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

గత మూడు వారములనుండి కలుగుచున్న చిక్కులు ఈ వారము చాలావరకూ తీరిపోతవి. ఆర్థిక స్థితి బాగుపడుతుంది. బంధుమిత్రులతో కలసి శుభకార్యాలలోనూ, వినోదాలలోను పాల్గొంటారు. ఉద్యోగస్తులకూ అధికారయుతమైన బాధ్యతలు ఎక్కువవుతాయి. ఇంట్లో వారి ఆరోగ్యము బాగుపడుతుంది. బియ్యము, బట్టలు, నూలు వ్యాపారస్తులకూ మేలుకాలము. కవులకూ, గాయకులకూ, కళాకారులకూ యోగము. 26, 27 తేదీలలో ధనయోగము, ప్రయాణము. 28, 1, 2 తేదీలలో తొందరలతో కూడిన కార్యక్రమము, మృష్టాన్న భోజనము 3, 4 తేదీలలో లాభయోగము.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీ ఉద్యోగము, దానితో ఆదాయము పెరిగే సూచన లున్నవి. గత వారము కాకుండా నిలిచిపోయిన పనులు ఈ వారము పూర్తి అవుతాయి. ఇతరుల కొరకు కొన్ని కార్యములు చేసేందుకు తల పెడతారు. కోర్టు వ్యవహారములు మీకు అనుకూలముగా వుంటవి. మీకు వాహనయోగము. ఇంట్లోవున్న స్త్రీలకు అలంకారప్రాప్తి. శుభకార్యాలలో పాల్గొంటారు. విద్యార్థులకు ఉత్సాహకరముగా వుంటుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో ధనలాభము, ప్రయాణము. 28, 1, 2 తేదీలలో శుభకార్యములలో పాలొంటారు. విందు, వినోదము. 3, 4 తేదీలలో కార్యలాభం.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము డబ్బు ఇబ్బంది ఎక్కువగా వుంటుంది. పెద్ద బాధ్యతలు మీపైనిపెట్టుకొని

#  నక్షత్రఫలితాలు 

అవి ఎలాగు నెరవేరుతాయా అని తాపత్రయపడతారు. ప్రతి విషయములోనూ గృహమందుండువారితో వివాదాలు వస్తాయి. ఆరోగ్యభంగము కలిగే సూచనలు కనబడగానే శ్రద్ధ వహించండి రాజకీయములందుండువారికి గౌరవ, ధనాదాయములు పెరుగుతవి. అడవిలో పండే వస్తువుల వర్తకులకు లాభము. 26, 27 తేదీలలో తెగని కార్యక్రమము. 28, 1, 2 తేదీలలో ఆటంకములు, అనారోగ్యము, ఆందోళన 3, 4 తేదీలలో పితృవర్గమునుండి సహాయము, స్వల్ప శాంతి.

### *మూల [యే, యో, బా, బీ]*

ఈవారము మొదటిభాగము మీకు అయోమయముగా కనబడుతుంది. ఏ కార్యము ఎలాచేయుటకు తోచదు. ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మకూడదో అనే అనుమానాలు ఎక్కువ. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి. వ్యాపారస్తులకు ఆందోళన. కాని వారము రెండవభాగములో అహితులనుకున్నవారే సహాయము చేయడంవల్ల కార్యసిద్ధి కలుగుతుంది. ఇంట్లోవున్న పెద్దల ఆరోగ్యము చెడి చికాకు కలుగచేస్తుంది. 26, 27 తేదీలలో నిశ్చయములేని కార్యక్రమము. 28, 1, 2 తేదీలలో ఆటంకములు, ఆరోగ్యచింత. 3, 4 తేదీలలో మిత్రసహాయము, కార్యలాభము. విచిత్ర వస్తు సంపాదన విదేశీయులతో పరిచయము.

### పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

గతవారము కలిగిన రోగము ఈ వారము తగుటచేతను ఏపని చేసేందుకుతోచదు. చికాకు ఎక్కువ ప్రారంభించేసరికి ఆటంకములు, అయినను దైవబల విశేషమువల్ల వారాంతమునకు మీ ప్రయత్నములు సుముఖమవుతవి. ఇంటోవారికి అనారోగ్యముచే కలతరపాటు. వ్యాపారస్తులకు నిరాశగా కనబడుతుంది. ఉద్యోగస్తులకు వారాంతమున మేలుగావుంటుంది విద్యార్థులకు నిరుత్సాహముగావున్నా కొత్త విషయాలు నేర్చుకుంటారు 26, 27 తేదీలలో నిలకడలేని స్థితి. 28, 1, 2 తేదీలలో ప్రయాణము, బడలిక, మిత్రసహాయము. 3, 4 తేదీలలో కార్యలాభము. సజ్జన దర్శనము వేదాంతచర్చలు

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వార మంతా బయటి కార్యకలాపాలతో తాపత్రయము ఎక్కువ మీ పనులు చేసుకొనుటే కష్టమైనప్పుడు, ఇతరులవి ఎలాగౌతాయి. అందుచేత స్వజనముతో విరోధాలు కూడా వస్తాయి. కోర్టు వ్యవహారములో జయము కలుగుతుంది వ్యవహారము పట్ల నీచులతో వివాదము వచ్చి మనోవ్యథ కలుగుతుంది భార్య ఆరోగ్యము భంగపడుతుంది 26, 27 తేదీలలో ఉద్యోగస్తులకు ఒత్తిడి 28, 1, 2 తేదీలలో కార్యభంగము, త్రిప్పట, వివాదము. 3, 4 తేదీలలో ధనాదాయము, కార్యలాభము

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము డబ్బు ఇబ్బంది ఎక్కువగా వుంటుంది. సాహసముతో ప్రయత్నించిన యత్నములకు శత్రువులు ఆటంకములు కలుగజేస్తారు. అయితే మీరు పటుదలతో పట్టిన పట్టు విడకక పనిచేయడముచేత తుదకు జయము కలుగుతుంది. వారాంతమందు అవయవములకు గాయాలు తగిలే ప్రమాదము వుంది. జాగ్రత్తవల్ల తప్పవచ్చును ఖనిజ, లోహపు వ్యాపారస్తులకు మేలు. ఇంజనీరింగు శాఖలోవారికి మంచికాలము 26, 27 తేదీలలో కార్యసాధనకు ఆటంకములు 28, 1, 2 తేదీలలో ఖర్చులు, గాయములు తగిలే సూచనలు. 3, 4 తేదీలలో ధనాదాయము, కార్యసాధనము.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీకు యోగప్రదము కొత్తవారితో పరిచయము కలుగుట, శుభవార్త వినుట మొదలగు మంచి ఫలితాలు కలుగుతాయి. యత్నకార్యములు మీ ప్రజ్ఞవల్లను, అధికారుల సహాయమువల్లను సానుకూలమవుటచేతను ధనాదాయము వృద్ధి పొందుతుంది ఆత్మీయుల ఆరోగ్యము బాగుపడుతుంది. డాక్టర్లకూ, మందుల వర్తకులకూ లాభము విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కవులు కొత్తరచనలు ప్రారంభిస్తారు. గణితశాస్త్రజ్ఞులకూ, చిత్రకారులకూ, నటీనటులకూ మంచికాలము. 26, 27 తేదీలలో కార్యక్రమమును ఏర్పాటు చేసుకుంటారు. 28, 1, 2 తేదీలలో తీరికలేని పనులు, శ్రమ. 3, 4 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి, మిత్రదర్శనము, కుశలవార్త.

### * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారము మీ ఉద్దేశాలప్రకారము కార్య నిర్ణయము చేసుకొని లాభమును పొందుతారు ఆరోగ్యము బాగుపడుతుంది. ఆర్థికస్థితి బాగుంటుంది. మానసికముగా ఉత్సాహము కలుగుతుంది. పిల్లల మేలుకొరకు కొన్ని యేర్పాట్లుచేస్తారు. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము కలుగుతుంది. ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు పండితులకు యోగకాలము 26, 27 తేదీలలో కార్యనిర్ణయము. 28, 1, 2 తేదీలలో తీరికలేని కార్యక్రమము, శ్రమ, ప్రయాణము. 3, 4 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

### * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

గత రెండు వారముల కన్నా ఈవారము మీకు యోగప్రదముగా వుంటుంది పూర్తికాకుండా నిలిచిపోయిన పనులు లాభముగా ముగించుకుంటారు. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదముగా గడుపుతారు. బంధువులతో కూడి శుభకార్యాలోచన, మృష్టాన్న భోజనము. వెండి, బియ్యము, బటల వర్తకులకు లాభయోగము. దగ్గరలేని ఆత్మీయుల క్షేమవార్త తెలియుటచే శాంతి కలుగుతుంది. కవులకూ, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో కార్యనిర్ణయము. 28, 1, 2 తేదీలలో శ్రమతో కూడిన కార్యక్రమము, ప్రయాణము, బంధుదర్శనము. 3, 4 తేదీలలో కార్యలాభము

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. యత్నకార్యములు ఫలిస్తాయి. ధనాదాయము బాగుంటుంది. ఇతరులకు మేలుకలిగే పనులు చేస్తారు శుభకార్యాలోచనలు చేస్తారు వాహనయోగము కలుగుతుంది. విద్యార్థులు ఆసక్తిగా చదువుకుంటారు. విలువగల సరుకుల వర్తకులకు లాభము. 26, 27 తేదీలలో సంఘక్షేమ కార్యాచరణ. 28, 1, 2 తేదీలలో శ్రమతో కూడిన కార్యక్రమము, ప్రయాణము. 3, 4 తేదీలలో ధనలాభము, శుభకార్య చింత, విందు, వినోదము .

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుండదు. మీరు చేయుచున్న పనులకూ మీకు చాటుగా అపకారము చేసేవారివల్ల విఘ్నములు కలుగుతాయి. కారణము తెలియక ఆందోళన పొందుతారు కార్యభారముచే శరీరస్థితి చెడుతుంది వెంటనే శ్రద్ధతీసుకోండి ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు కలుగుతాయి. విద్యార్థులకు చదువుపై శ్రద్ధతక్కువ. రాజకీయాలలో వున్నవారికి మేలు అడవి ఫలసాయముల వర్తకులకు లాభము 26, 27 తేదీలలో కొత్తపనుల ప్రారంభం. 28, 1, 2 తేదీలలో ఆటంకములు, త్రిప్పట. శ్రమ, 3, 4 తేదీలలో బంధుసహాయము, స్వల్పముగా లాభము



# వనితాలోకం

# కస్తూరీ బా

**బి. ప్రేమలీల**

చిరస్మరణీయులైన భారత మహిళలలో అగ్రగణ్యురాలు కస్తూరిబాయి గాంధి, కేవలం బాపూజీ ధర్మపత్ని కావడంచేతనే ఆమె గొప్ప వ్యక్తిగా పరిగణించబడలేదు. అచంచలమైన దేశసేవ—సేవాపరాయణత—త్యాగబుద్ధి-పట్టుదల-స్వతంత్రతాపేక్ష — ఇవే ఆమెను చిరస్మరణీయురాలిని చేసినయ్.

1944 వ సంవత్సరం ఫిబ్రవరి 22 వ తారీకున ఆమె నిర్బంధంలో నుండగా దివంగతురాలయింది చిరస్మరణీయమైన ఈ రోజున ఆ పూజ్యురాలికి శ్రద్ధాంజలి ఘటించడం భారత మహిళల కర్తవ్యం. చాల చిన్న వయస్సులోనే కస్తూర్బాకి మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి వివాహమయ్యింది అప్పటికి కస్తూర్బా ఇంకా ముక్కుపచ్చలారని బాలికయే. అయితేనేం? గొప్ప మనోదారుఢ్యమునూ, ధైర్యసాహసములనూ అమోఘమైన శీలసంపదనూ కలిగిన బాలిక ఆమె. చిన్న వయస్సులో మోహన్‌దాస్‌కు చీకటి అంటే ఎక్కడలేనిభయం. తనలో వున్న పిరికితనాన్ని తన చిన్ని భార్యకు వెలిబుచ్చడానికి ధైర్యంలేదు ఎందుకంటే తనకంటే కస్తూర్బా ధైర్యవంతురాలని, సాహసురాలని అతనికి తెలుసు ఆ చిన్నతనంలోకూడ ఆమెకు పాములనీ, దయ్యాలనీ, భయంలేకుండా, చీకట్లో కూడ ఒంటరిగా వెళ్ళగలిగేది. కస్తూర్బా ఆత్మగౌరవం, స్వతంత్ర భావాలుగల బాలిక మోహన్‌దాస్ ఆమెపై తన భర్త అధికారాన్నంతా ప్రయోగింపజూచేవాడు. ఆమెను ఈర్ష్యతో చూచేవాడు. ఆమె స్వాతంత్ర్యాన్ని అరికట్టే ఆంక్షలు, ఆటంకములు విధించేవాడు కాని కస్తూర్బా అవన్నిటినీ నిర్భయంగా త్రోసిపుచ్చేది. తన అనుమతి లేనిదే ఆమె ఎక్కడికీ వెళ్ళకూడదని మోహన్‌దాస్ ఉద్దేశం. కాని కస్తూర్బా ఆయన ఉద్దేశానికి పూర్తిగా వ్యతిరేకించేది. అటువంటి అధికారం చేయడం చాల అక్రమమని దాన్ని ధైర్యంగా యెదిరించుతూ తన కిష్టం వచ్చినప్పుడు, తన కిష్టం వచ్చినచోటికి భర్త అంగీకారం కోరకుండానే వెళ్లుతుండేది. కస్తూర్బాలో కనిపించే ఈ స్వతంత్ర స్వభావాన్ని తరువాత, తరువాత — గాంధీజీ ఎంతో మెచ్చుకున్నారు తానప్పుడు అలా ప్రవర్తించడం చాల అధర్మమనీ, కస్తూర్బా వాటన్నిటినీ అలా తిరస్కరించడం న్యాయమేననీ తలంచేవారు.

నిజానికి మోహన్‌దాస్ గాంధీకి తన సతీమణి యెడలఎన్నో ఆశయాలున్నయ్. ఆమె నొక ఆదర్శ గృహిణిగా తయారు చేయాలని ఆయన సంకల్పం. తాను నేర్చినదంతా ఆమెకూ నేర్పి, తన ఆశయాలతో ఆమెను పూర్తిగా ఏకీభవించే వ్యక్తినిగా, తయారు చేయాలని ఆయన ఉద్దేశం కాని కస్తూర్బాకలాంటి ఆశయాలు లేనేలేవు. ఆమె విద్యావిహీనురాలు తనకు విద్య కరువైందని, దాన్ని తాను సాధించాలనే ప్రయత్నం ఆమెలో ఎన్నడూ కలుగలేదు భర్త చదువు సంధ్యలు, ఉన్నత విద్య కోసం విదేశీ ప్రయాణం ఇవన్నీ ఆమెలో ఎలాంటి సంచలనాన్ని కలిగించలేదు. గాంధీజీ ఆమెను విద్యావతిగా చేయాలని ఎన్ని విధాల ప్రయత్నించినా, ఆ ప్రయత్నములన్నీ విఫలమవుతూండేవి.

చివరికి కస్తూర్బా ఆమె జీవిత కాలమంతటిలోనూ ఒక్క సామాన్య పుగుజరాతీ భాషను చదువను, వ్రాయను తప్పించి మరింకేమీ నేర్చుకోలేకపోయింది

కస్తూర్బా పుస్తక జ్ఞానంతో కూడిన విద్యావంతురాలు కాకపోవచ్చును. కాని కాలం గడిచే కొలదీ, గొప్ప మనోబలం, ధైర్యసాహసములుగల నాయకిగా మహాత్మునికి సరిపోయిన ఆదర్శపత్నిగా రాణించింది గాంధీజీ ప్రశంసను, అభిమానాన్ని చూరగొనిన కష్టమైన పనుల నెన్నిటినో ఆమె చేసింది. తనతో సహకరించి పనిచేస్తున్న కోటి మహిళలకు ఆదర్శ మహిళగా ప్రకాశించింది. మొట్టమొదట గాంధీజీహరిజనుల యెడచూపే ఆదరణ, ఆప్యాయత-వారితో కలసిమెలసి తిరగడం – వీటిలో కస్తూర్బా ఏకీభవించకుండా సంకోచపడినా, రానురాను, ఆ సంకోచ భావాన్ని తీసివేసికొని ఆశ్రమంలో చేరిన హరిజనులను కన్న బిడ్డల్లా చూడసాగింది.

కస్తూర్బా భర్తతోపాటు దేశ స్వాతంత్ర్య పోరాటంలో ముందంజవేసి అష్టకష్టాలనుభవించింది. జైలుకు వెళ్లింది. చివరికి ఆ జైలులోనే ఆమె కళ్ళు మూసింది దానితో అరవై సంవత్సరాల వారి జంటజీవితం విడివడింది. చాల సంవత్సరాల క్రితం-తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనటం కోసం-భర్త నిరంకుశ ఆజ్ఞలను సైతం ధిక్కరించి, తన ఆత్మగౌరవాన్ని నిలుపుకోవటం కోసం ప్రయత్నించిన ఆ కస్తూరియే కాలం గడిచే కొలదీ, గొప్ప ఆదర్శమహిళగా, దేశభక్తిపరాయణిగా రూపొందింది

కస్తూర్బా జీవిత కాలమంతటిలోనూ ఆమె పల్లెటూరి పడతులనుగూర్చి, వారి అభ్యుదయాన్ని గూర్చి తలంచుతూండేది. వారి శ్రేయస్సు నాశిస్తూండేది. హీన పరిస్థితులలో వున్న స్త్రీలకు, పిల్లలకు చేయూత నీయాలని ఆతురపడేది అంచేతనే కస్తూర్బా మరణానంతరం ఆమె ఆశయమైన పల్లె పడతుల, శిశువుల అభివృద్ధి నిమిత్తము కస్తూర్బానిధి ఏర్పాటు చేశారు. దేశమంతటా కస్తూర్బా పేరిట ఎన్నో సంస్థలు ప్రారంభించబడినాయి. కస్తూర్బా ఆశించిన మహిళల అభ్యుదయానికి అవన్నీ కృషి చేస్తున్నాయి. ఆ సంస్థల పాలనాధికారులు, ఏ లక్ష్యముతో తామీ సంస్థలను స్థాపించారో, దాన్ని విస్మరించకుండా, స్వార్థం కోసం, స్వప్రయోజనం కోసం వాటిని దుర్వినియోగం చేయకుండా, నిస్వార్థ బుద్ధితో ఆ పూజ్యురాలి ఆశయాలను ప్రతిబింబింప జేసే ఆదర్శ సంస్థలుగా వాటిని రూపొందించాలి

అదే కస్తూర్బాకు దేశం యిచ్చే కర్పూర నీరాజనం!!



## ఆడవాళ్లు: ఆత్మహత్యలు

# రోజులు మారాయి! మగవారి దృక్పథమూ మారాలి!

## స్త్రీ చరిత్రే ఒక కన్నీటి గాథ!



"శరీరమాద్యం ఖలుధర్మ సాధనమ్మ"నే నానుడులూ, 'బ్రతుకంత భాగ్యంలేదు' 'బ్రతికి ఉంటే బలుసాకు ఏరుకు తినవచ్చు' నే జాతీయాలు బ్రతుకు విలువల్ని నిత్యమూ మన దృష్టికి తెస్తుంటాయి. నిజమే మరి బ్రతకడంకంటే భాగ్యమేముంది? మానవులకు ప్రాణాలకంటే ప్రియమైన దేదీ లేదు కదా! తోటివాళ్ళు యింతటి అమూల్యమయిన బ్రతుకుల్ని చేజేతులా పాడుచేసుకుని, ఆత్మహత్యల పాలవుతుంటే మానవ హృదయాలు తరుక్కుపోవూ?

నూరేండ్లు నిండిన శితవృద్ధులు కూడా చచ్చిపోవాలనుకోరు. యమయాతనల ననుభవించుతూ కూడా బ్రతికి ప్రాకులాడాలనే యుంటుంది. మరి అలాంటప్పుడు నూరు కాలాల బ్రతుకును క్షణంలో బలిపెట్టడం ఎలా సంభవమౌతుంది? ఆశలూ కాంక్షలు మనుషులను బ్రతకమని ప్రోత్సహిస్తాయే! తనని కన్నవాళ్ళకూ, తను కన్నవాళ్ళకూ, కట్టుకున్నవాళ్ళకు గల ప్రేమ సంబంధాల నన్నిటినీ క్షణంలో తెగటార్చుకొని నీటబడో, విషం త్రాగో, ఉరిపోసుకునో, అగ్నిజ్వాలల కాహుతియ్యో జీవితాన్ని వెళ్ళమార్చుకోవడమంటే ఎంతకష్టం? అభమూ శుభమూ ఎరుగని పసికందుల్ని విరాత్రియుల్ని చేసి, కడుపు తీపినికాదని పోవడమన్నా, యువతులూ, కన్నెలూ, జీవితాన్ని గురించి కనే కలల నన్నింటినీ కల్లలు చేసుకుని జీవితం మీద ఆశలు తెగటార్చుకోవటం అన్నా ఎంత దుస్సాహ్యం? నూది గ్రుచ్చుకుంటే సహించలేని ప్రాణం ఉరిత్రాటికీ, అగ్నిజ్వాలలకీ, విషాగ్నులకీ, భయపడక పోవటాన్ని గురించి ఆలోచిస్తే ఆత్మహత్య చేసుకునే ప్రాణినిగురించి కన్నీరు కాల్వలు కట్టదూ మరి!

### ప్రస్తుత పరిస్థితులు

ఇంతకీ ఈ భయంకరమైన హత్యల వెనుక గల కారణా లేమిటి? ఎంతటి పాపిష్టి శకులిలాంటి వికట పరిస్థితుల్ని సృష్టిస్తున్నాయి? ఇందుకు బాధ్యు లెవరు? అనే ప్రశ్నలు హృదయాలను కలచివేస్తాయి సహజంగానే. ఆర్థిక, సాంఘిక నికృష్ట పరిస్థితులే ఈ మహా వర్తకాలకు మూలబీజా లనడంలో సందేహ మేమీ లేదు.

క్రొత్త ఆలోచనలు, క్రొత్తభావాలూ మన సమాజంలోని నికృష్ట పరిసితుల్ని అంత మొందింపజేయటానికి ప్రయత్నించిన,


యలమంచి తాయారు


ప్రయత్నిస్తున్నమాట వాస్తవమే. వీరేశలింగం, రాజారామమోహన్‌లాంటి మహా సంస్కర్తలు తమ జీవితాలను సంఘసేవకు సమర్పించుకుని స్త్రీలకెంతో మహోపకారం చేశారు. అయితే యిప్పుడు మన సమాజం ఎంతవరకు పురోగమించింది? సహగమనం చేయవలసి రాకపోవచ్చు. విధవావివాహం అప్రతిష్ఠాకరం కాకపోవచ్చు. సాంఘిక క్షేమంకోసం ప్రభుత్వం కొన్ని చట్టాలను ఆమోదించవచ్చు కాని ప్రస్తుతం ఆచరణలో స్త్రీకెలాంటి స్థానం లభిస్తోంది? ఇన్నాళ్లుగా మన ఆర్థికవ్యవస్థ మారలేదు. సమాజంలోని బాధలన్నిటికీ ఆర్థిక వ్యవస్థతోడి సంబంధం ఉండి తీరుతుంది. నేటి సమాజంలో మానవత్వమూ, వ్యక్తిత్వపు విలువలూ కావు మనిషిని గురించిన కొలతబద్దలు. డబ్బుమాత్రమే. డబ్బుకే అధికారం, గౌరవం అన్నీ.

వ్యక్తిత్వవికాసానికి అభిరుచులకు తగినట్లు జీవితాలను దిద్దుకోటానికి మన ఆర్థిక సాంఘిక వ్యవస్థలు ప్రతిబంధకాలుగా అడ్డొస్తున్నాయి. విద్య, విజ్ఞానం, ఆత్మవిశ్వాసం అన్నీ కొరవడ్డాయి. ఈనాడు సమాజంలో స్త్రీపురుషుల మధ్య ఎట్టిభేదాలు ఉండకూడదనే విషయం రాజ్యాంగరీత్యా ఆమోద ముద్రను పొందవచ్చు. కాని ఆచరణలో యిది ఎంతవరకు సంభవమౌతోంది?

నిజంగా స్త్రీ చరిత్ర ఓక కన్నీటిగాథ. సమాజపరంగా ఆమెకు జరిగిన అన్యాయం చూస్తే రాళ్లు కూడా ద్రవించక మానవు. బాహ్య ప్రపంచంతో ఆమెకు సంబంధం లేకుండా చేశారు. సమాజంలోని సగభాగానికి ప్రాతినిధ్యంవహించి, మాతృత్వ మర్యాదల నిర్వహించుతూ దేశౌన్నత్యానికి కొలబద్ద కాదగ్గ ఆమె జడపదార్థంలా మార్చబడింది. కేవలం సంతానాన్ని కనడానికీ, భార్యగా ఉండటానికి మాత్రమే ఆమె సజీవ. స్త్రీకొక నీతిసూత్రం, పురుషునకొక నీతిసూత్రం. పురుషుడు చేసే ఏలాంటి అత్యాచారాన్నయినా ఆమె కిక్కురుమనకుండా సహించవలసిందే. ఎందుకనంటే ఆమె భారత మహిళ, పతివ్రత. పరిపాటిగా అమలు జరిపింది యీ సూత్రాన్ని సమాజం. ఇలా నాలుగు గోడలమధ్య బంధింపబడి, కూపస్థమండూకం చేయబడటంతో వాస్తవంగా ఆమెలోని సహజసిద్ధమైన మార్దవం, విశాలభావాలు నశించిపోయాయి. అజ్ఞానం, సంకుచితత్వం, మూఢ విశ్వాసాలు అన్నీ ఆవరించాయి. తమ కర్తవ్య క్షేత్రంలో అన్నివిధాలా భాగస్వామిని కాదగిన స్త్రీని ఒక ఉపయోగకరమయినసాధనంగా తయారు చేసి, సమాజాన్ని వెనక్కు మళ్ళించడం జరిగింది.

పోతే ఇవన్నీ ఎప్పటి మాటలో కదా! ఇప్పుడు సమాజమంతా మారిపోయింది. సంఘంలో స్త్రీకి పురుషునితోపాటు సకల విధాలా గౌరవం లభిస్తోంది కదా అనే ప్రశ్న ఉందిచూచారూ. కాని వాస్తవమేమిటి? ఇక్కడ చట్టాలనూ, శాసనాలనూ గాదు మనం చూడటం, వీరేశలింగంలాటి మహనీయులు స్త్రీకిచ్చిన గౌరవాన్ని కాదు కొలబద్దగా తీసుకోవటం. వేదికలమీద వినిపించే ఉపన్యాసాలూ గాదు యిందుకు ప్రామాణికాలు. నిత్యజీవితంలో పురుషుని దృక్పథంలో ఎంతవరకు మార్పు వచ్చింది? భార్య అనే వ్యక్తిని గౌరవించడంలో, ఆమె తప్పొప్పులను తన తప్పొప్పులతో పోల్చి, ఆత్మవిమర్శచేసుకొని తనకుగల నైతిక బాధ్యతలను నిర్వహించడం జరుగుతోందా?

స్త్రీ ఒక పరాయి మగవాడితో సంబంధం పెట్టుకుంటే భర్త కళ్ళారా చూడటం తటస్థిస్తే ఆమెను బహిష్కరించడమో, చంపివేయడమో జరుగుతుంది. మరి స్త్రీయే అలాంటి సంఘటనలు చూచివుంటే కనీసం యిది తప్పు అనైనా అనకలుగుతుందా? అనటానికి కేముందనుకోండి నోరు పారవేసుకోవచ్చు. కాని ఆమెమాటల్ని ఖాతరుచేయవలసిన అవసరం పురుషునికుందా? అతడు తన దురహంకారాన్ని ప్రయోగించి. తన్నులూ తిట్లతో ఆమెను నోరుమూసేలా చేయడూ? విడాకులచట్టం ఉన్నంతమాత్రాన భర్తకు విడాకులిచ్చి సంఘంలో మామూలు గౌరవంతో బతకగల్గడం ఆచరణలో సాధ్యమౌతుందా?

## ప్రత్యక్ష కారణాలు

ఆర్థిక యిబ్బందులంత భయంకర కారణాలు మరేమీ లేవు. కనీసావసరాలకు అంట్లే కూటికీ గుడ్డకూ ఘర్షణపడి జీవించటం ఎంత దుర్భరమో! కడుపునిండా తినేవారికి మెతుకు విలువ తెలియదు. ఆకలితో యుద్ధంచేసి, చేసి కన్నబిడ్డలతోపాటు నూతినో గోతినో పడే తల్లి చావుకు బాధ్యులెవరు? మన నికృష్టమయిన అసమాన ఆర్థికవ్యవస్థ కాదూ? ప్రేమించిన వ్యక్తితోటి ఆర్థిక వ్యత్యాసాలవల్లనో మరే యితర సాంఘిక వ్యత్యాసాలవల్లనో జీవితం స్థిరపడకపోతే తమకు యిష్టంలేని వ్యతిరేక పరిస్థితుల్లో జీవించడమే దుర్భరమని పసుపు పారాణితడయినా ఆరకుండానే ముక్కుమూసుకునే పెళ్ళికూతుళ్ళు లేరూ? వారి బంగారు జీవితాల్నిలా నులిమి నాశనంచేసే కర్కశహస్తాలు సంఘానివి కావూ?

నిన్న మొన్ననే మా పొరుగువారు ఒకమ్మాయినిగురించి చెప్పుకుంటుంటే విన్నా. అమ్మాయికి తల్లిలేదు. వాళ్ళకు తెలిసిన



డా॥ కె. వి. స్వామిగారి సతి శ్రీమతి సతీతులసీదేవి జనవరి 27 తేదీన మద్రాసులో మృతిచెందారు.

అబ్బాయి ఎక్కడో ఏదో సామాన్య ఉద్యోగం చేస్తున్నాడు. ఆ అబ్బాయికీ, ఈ అమ్మాయికీ వివాహం చేసుకోవాలనే కోర్కె కలిగింది. వాళ్ళిద్దరి హృదయాలూ దగ్గరయ్యాయి. తండ్రిమాత్రం ఎక్కడో దూరదేశాన ఉద్యోగముచేసుకుంటూ, వెనక ఆస్తి ఏమీ లేదు నేనుపెండ్లిచెయ్యను పొమ్మన్నాడు. బలవంతంగా ఓ రెండెకరాలుభూమి గలఅతనికిచ్చి పెళ్ళిచేశాడు. కాని ఆఅమ్మాయి అతనితో మాట్లాడదు, కన్నెత్తి చూడదు. ఎవరెన్నన్నా పులుకదూ, పలుకదూ. వాళ్ళేమో కొడతారు, తిడతారు. కాని ఆ అమ్మాయి మనసు మారదు. "ప్రేమించిన అబ్బాయి పేరు చెబితే చాలు ముఖం పద్మంలా వికసిస్తుంది." అని చెప్పుకుంటున్నారు. కన్నవాళ్ళింటిదగ్గర తల్లి, తండ్రి తిట్టి, కొట్టి పంపిస్తారు. అత్తవారింటికెళ్ళితే భర్తకూడా అలాగే చేస్తాడు. ఇంతకూ ఆ అమ్మాయికి 16 సం॥ లు అయినా రాలేదు. నూరేళ్ళు బ్రతకాల్సిన బతుకు కదా!

ఇలాంటి సంఘటనలు కోకొల్లలు మన సమాజంలో. చివరికిలాంటి పరిస్థితులవల్ల ఎలాంటి విషమ పరిణామాలు సంభవిస్తుంటాయో మనం చూస్తూనే ఉంటాం. అయితే మరి ఈ తప్పంతా ఎవరిది?

పాండురంగ భక్తురాలు సక్కుబాయి అత్తలాగ కటి, వాతలుపెట్టి హింసించే అత్తలు లేకపోయినా పెళ్ళయిన దగ్గరనుండీ అమావాస్యనాడు అట్టు పెటలేదనీ, పూర్ణిమనాడు బూరెట్టలేదనీ, తమ కేవిధంగానూ తగ్గ సంబంధంకాదనీ అత్తమామల సాధింపులు. కన్నవారినంటుంటే పోనీ లెమ్మని సహించే కోడళ్ళు కూడా అరుదే. దానితో ఘర్షణలు, తగాదాలూ, పస్తులు మొదలు. భర్త ఇలాంటి పరిస్థితుల్లో ఏమి చెయ్యాలో తోచక తనకు లోకువైన భార్యను చెయ్యి చేసుకుంటే తగలరానిచోట తగిలి మరణించే అభాగ్యలెందరులేరు? అంతటితో ఆ అమ్మాయిమీదే ఆత్మహత్యానేరం మోపబడుతుంది. "ఏమో ఎందుకో, దానికర్మ కాలకపోతే ఈ విపరీతమేమిటి? మా కుటుంబంలో ఎటువంటి పొరుపేలేదే; మేమెవరమూ ఏమీ అనేలేదంటారు" పెద్దలు.

భర్తలుపెట్టే నానారకాల హింసలూ భరించలేక కొందరూ, పరాయి స్త్రీలతో సంబంధాలు పెట్టుకుంటే కనివిని, ఆత్మాభిమానం దెబ్బతిని కొందరూ ఆత్మహత్యల పాలవుతున్నారు. నేనీ మధ్య ఒక సంఘటననుగురించి విన్నాను. ఒకానొక స్త్రీ తన గృహఆవరణలోనే పశువులాంటి తన భర్త చేస్తున్న పాపకృత్యం చూడటం తటస్థించింది. నాకు వినటానికే అసహ్యం వేసింది చెబుతుంటే. ఆ గృహిణికంతటి కీడు తలపెట్టినది ఆమెకయిన వ్యక్తే. ఆమె కళ్ళు చీకట్లు కమ్మాయి. పాపమా మానవతి ఎలా భరిస్తుంది? వెంటనే కిరోసిన్ పోసుకొని నిప్పంటించుకొంది. కన్న బిడ్డలపైన వ్యామోహమన్నా ఆమెను బ్రతకమని ప్రోద్బలం చేయలేకపోయింది. ఇంతకీ ఆమె ఉత్తరంలో ఏమి వ్రాసిందో చూచారూ? తనకు బ్రతికగల అర్హతలేదనీ, తన చావుకెవరూ బాధ్యులు కారనీ వ్రాసింది. పురుషునితో పాటు స్త్రీకి కూడా సమానమైన నీతిసూత్రాలు అమలులో ఉంటే నిజంగా ఆ క్షణంలో అతని ముఖాన ఉమ్మివేసుండేదే. చచ్చిపోతూ కూడా భర్తను రవ్వంత మాటనకుండా, అననీయకుండా ఉండడమంటే ఎంతటి సహనాన్ని అలవరచుకుందో ఊహాతీతంకాదూ? పరిపాటిగా స్త్రీకిలాంటి సహనం అలవాటయిపోయింది.

ఆత్మహత్యలకు పాల్పడేవారిలో మరోకోవకు చెందిన వారున్నారు. వీరి చావులు మరింత ఘోరంగా ఉంటాయి. అసలు చావటానికేమంత బలమయిన కారణం కనబడదు. పొరుగుతోటో, ఇరుగుతోటో, అత్తతోటో, భర్తతోటో పేచీపడి తమ ధోరణిలో తాము మాట్లాడుతూ, కోపం ప్రదర్శించి నూతికీ, గోతికీ పరుగెత్తుతారు. ఏదో ఒక సామాన్యమైన విషయాన్ని గురించి, పోట్లాట ప్రారంభమయి, అదే చిలికి చిలికి గాలివానగా తయారయి వీరు ప్రాణాలు తీసుకోటానికి దారితీస్తుంది. తాము చచ్చి, ఎదుటి పక్షంవారి నేదో బ్రహ్మప్రళయం చేయాలని పిచ్చితలంపుతో కూడా యిలా చేస్తారు.

# రోజులు మారాయి! మగవారి దృక్పథం మారాలి!

ఒక్కొక్కప్పుడు ఇతరులను భయపెట్టి బెదిరించటానికి కూడా నూతికో, గోతికో పరిగెత్తుతున్నారు. అందరూ చూస్తూండగానే నూతిలో పడింది ఒకసోదరి ఈ మధ్య. వలుగురూ మూగి ఓ మంచం బావిలోకి దింపారు. ఆమెనిక్షేపంలా ఎక్కి వచ్చింది పైకి. కేవలం మౌఢ్యం, మంకుతనం ఇవే యిందుకు గల కారణాలు. ఎదుటి పక్షం కాస్త ఓర్పు కొని వీళ్ళయెడ సహనం చూపెట్టి, నెమ్మదిగా తప్పొప్పులను గుర్తింపచేస్తే ఇలాంటి సంఘటనలు తగ్గిపోవచ్చు. కాని, అంతటి మనస్తత్వ వివేచనాశక్తి, ఔదార్యం, మన సమాజంలో ఎందరి కుంది?

జీవితాదర్శాల విలువలు తెలియక, పిల్లచేష్టలుగానే కాలుజారి ప్రమాదంలో పడేవాళ్ళెందరో ఉన్నారు. నిజానికి ఈ సందర్భాలలో జరిగే భ్రూణహత్యలకంటే ఆత్మహత్యలు చాలా తక్కువనుకోండి. అయినా కొద్దిమందేకదా యిలా చచ్చిపోయే వాళ్ళను కుంటే చాలా అన్యాయమవుతుంది.

ఎక్కువభాగం ఉన్నత విద్యాభ్యాస దశల్లో నేఇలాంటి పరిస్థితులు సంభవిస్తున్నాయి. ఈ సందర్భంలో కొన్ని మాసాలక్రితం ఒక నాటిస్త్రీల సమావేశంలో మాట్లాడుతూ, ఒక డాక్టరు చెప్పిన విషయాలు గుర్తుకొస్తున్నాయి. ఆమె తన దగ్గరకొచ్చే గర్భస్రావ కేసుల్ని గురించి చెబుతూ తల్లులు బిడ్డల పెంపకంలో చాలా జాగ్రత్త తీసుకోవాలని హెచ్చరించింది. కొందరు బాధ్యతగల పురుషులు, యువతులను మోసగించిన విషయాలుకూడా చెప్పింది. ఆమె తానాయువతులతో "మీరు ఆ యువకులపేర్లు చెప్పండి. సమాజంలో వాళ్ళను బయటపెట్టి అప్రతిష్ఠపాలు చేస్తానని" కూడా చెప్పిందట. కాని వారుభయపడి "సమాజంలో మరి మాగతేంకాను?" అని ప్రాధేయపడి తమపని ముగించుకుని వెళ్ళారట."

ఈ సందర్భాలలో తప్పొప్పులకు బాధ్యులు యువతీ యువకు లిద్దరూ అనడం న్యాయమే. కాని యిలాంటి తప్పుచేసిన యువకునికి సమాజంలో గౌరవమేమీతగదు. "పైగా వాడికేమ్మా మగవాడు" అని అంటుంది. ఇల్లాంటి సందర్భాల్లోనే కొన్ని వివశపరిస్థితులు ఆడపిల్లల్ని ఆత్మహత్య చేసుకు నేలా చేస్తాయి.

రోజురోజుకీ మన విద్యాప్రమాణం పడిపోతోంది. ఉన్నతమైన జ్ఞానం, ఉదాత్తమైన భావాలు, కొరవడ్డాయి. విద్యార్థులకు, ఉపాధ్యాయులకు మధ్య బాధ్యతాయుతమైన ప్రేమసంబంధాలు లేవు. రకరకాల ఫాషన్లు నైలాన్‌జాకెట్లు, షిఫాన్‌చీరెలూ, ధరించి, విద్యార్థినులు తళుకు బెళుకుల ప్రదర్శనలిస్తుంటే, వీరిని జపిస్తూ, కొంటెమాటలతో, వెకిలిచేష్టలతో విద్యార్థులు, కాలేజీ జీవితం వెళ్ళబుచ్చుతున్నారు.

ఈనాటి చదువులు బహుభాగం డిగ్రీల కోసమో, కట్నాలకోసమో కాని జ్ఞానార్జన కోసంమాత్రం కాదు. పైగా ఈ పరిస్థితులన్నిటికీతోడు చవుకబారు సినిమాలు, చెత్త పుస్తకాలు మరింత పతనావస్థకు దారితీస్తున్నాయి. అభిరుచులస్థాయి పడిపోడంతో వెర్రివెర్రి హాస్యమూ, వెకిలినవ్వులూ, అర్ధనగ్న వేషాలూ, ప్రదర్శిస్తేనేకాని, సినిమా రాణించదు. వాస్తవంగా కళలధ్యేయం మానవుని ఉన్నతస్థితికి పురోగమింపచేయటం. కాని అదంతా యిప్పు డెవరికి కావాలి? జుగుప్సాకరమైన హత్యలూ, అవినీతిని ప్రేరేపించే పుస్తకాలు వ్రాసేవారికి బోలెడుడబ్బు లొస్తున్నాయి. చెత్త సినిమాలు తీసేవారు నిక్షేపంలా కాలక్షేపం చేస్తున్నారు జేబులు నింపుకుని. ఇలాంటి పరిస్థితులు ఎన్నో విషాదకరసంఘటనలకు దారితీస్తుంటాయినిత్యమూ. మరి వీటన్నింటికీ బాధ్యు లెవరు?

పైచెప్పిన పరిస్థితు లన్నింటికీ భిన్నంగా, హుందాగా జీవితాలు సాగించచే వారు లేకపోలా. అయినా వారిసంఖ్య పరిమితం. అశేష జనసామాన్యానికి సంబంధించినది మనం చెప్పుకు నేవిషయాలు.

ఆర్థికపరాధీనత, సాంఘికవ్యత్యాసాలు భరించరాని పేదతనం యివన్నీ వివశపరిస్థితుల్ని సృష్టించడంతో స్త్రీలే ఎక్కువ ఆత్మహత్యలకు పాల్పడటం జరుగుతోంది.

వ్యక్తిఔన్నత్యం సామాజిక ఔన్నత్యం మీదే ఆధారపడి వుంటుంది. వ్యక్తికీ, సమాజానికీ గల సంబంధం అభిన్నమైంది. వ్యక్తుల సుఖదుఃఖాలకు గల కారణాలు సామాజిక పరిస్థితులతో ముడిపడి యుంటాయి. మన ఆర్థిక, సాంఘికవ్యవస్థల్లో గొప్పమార్పు రావాలి. ధనానికికల గౌరవం నశించి మానవత్వపు విలువలు పెరగాలి.

మన రాజ్యాంగ సూత్రాలకు అనుగుణముగా స్త్రీ పురుషుల మధ్య హెచ్చుతగ్గులు నశించి పోవాలంటే సమాజంలో గొప్పమానసిక విప్లవం అవసరం. స్త్రీపురుషు లిద్దరూ తరతరాలుగా వచ్చిన అలవాట్లనూ, సంకుచిత భావాలనూ, వదలి సమాజాన్ని పురోగమింపజేయ కలగాలి. సాంఘికాభ్యుదయం




## నోటిపూతకు

ఇప్పటిదాకా నోటిపూతకు ఎన్నో మందులు చెప్పినారు ఇది నాకు తెలిసిన పద్ధతి. రేపు ప్రొద్దున్నే చేస్తామనగా ఈ రోజు రాత్రికి అన్నీ కొంచము కొంచముగా రాగులు, గోధుమలు, గసగసాలు. బాదామి కాయలు పగులగొట్టిన పచ్చి పప్పు (6 పలుకులున్నా చాలు) ఒక గిన్నెలో నానబెట్టవలెను. తెల్లవారి, రోలు, రుబ్బుగుండు శుభ్రముచేసి 4 యాలకులు, కొంచెము కొబ్బరి, నానవేసిన సామాను, అంతా వేసి జారుగా నీరుపోస్తూ రుబ్బవలెను. ఆ రుబ్బిన ముద్దలో మరి ఒక గ్లాసునీళ్ళు పోసి కలిపి, ఒక గిన్నెకు గుడ్డకట్టి అందులోకి వడబోయవలెను. ఆ గుడ్డమీద నిలచే పిప్పిని తీసుకొని గిన్నెలో వేసి మరి ఒక గ్లాసుడు నీళ్ళుపోసి చేతితో బాగుగా పిసికి తిరిగి వడబోయవలెను. అప్పటికి పాలవంటి ద్రవము మిగులును. దానిలో తగినంత చక్కెర లేక, కలకండ గాని వేసి కొంచము ఆవుపాలు పోసి, కుంపటిమీద పెట్టి గరిటెతో విడవకుండ త్రిప్పవలెను. లేకపోతే అడుగు అంటుతుంది. తెర్లిన తరువాత క్రిందికి దించి చల్లార్చి పరకడుపున త్రాగితే మంచిది, ఇట్లు 8 పూటలు ప్రొద్దున్నే త్రాగితే ఏ మందు లేకనే ఎంత నోటిపూతవున్నా తగిపోతుంది. కొంచము వేడిచేసినా, ఇది చేసుకొని త్రాగితే చాల మంచిది. ఒకతూరి చూస్తే మీకు తెలుస్తుంది.

—జి. లక్ష్మీదేవమ్మ, చంద్రగిరి.]

* * *

కడుపునొప్పితో చాలమంది బాధపడుతూ వుంటారు. అది పోవటానికి నాకు తెలిసిన విషయము చెప్పుతాను. సాధారణంగా వచ్చే కడుపునొప్పులకు పనిచేస్తుంది.

ఒక తమలపాకును తీసికొని దానిపైన రెండు 'కోడేషాపువ్వు' పలుకులు వేసి అగ్గిపుల్లతో వేడిచేసి, గ్లాసుపైన ఓరగా ఆకు పెట్టి, సోడాకాయ నీటిని దానిపైనుండి పడేటు గానులో పోయాలి. దానిని వెంటనే సేవించాలి. కొత్త మంటగా వుంటుంది. పొగకల్లుకూడా మండేటట్టు వుంటుంది. అయినా అది సేవించితే కడుపునొప్పి తగ్గిపోతుంది.

### తలనొప్పి

కోడేషా పలుకును తమలపాకుపైన వేసి అగ్గిపుల్లతో వేడిచేయాలి. అనుపైన తేలిన ద్రవ పదార్థాన్ని కండ్ల కొలకులకు, కణతలకు వ్రాసుకోవాలి. తలనొప్పి తగ్గుతుంది.

### పుండ్లు

పుండ్లతో చాలమంది బాధపడుతూ వుంటారు. తమలపాకురసంను వాటిపై వేసి రుద్దవలెను. కొత్త రసం తిరిగిపోసి, ఒక తమలపాకును దానిపై వేసి కట్టితే, ఆ పుండు మాడిపోయి తగ్గును.

### చురిపిడికాయలు

ఇది పోవటానికి కొందరు సుత్రపు వెంట్రుక కట్టి కత్తిరింపచేస్తారు; కాని తమలపాకు కాడను సున్నము (తడి) లో ముంచి సురిపిడికాయపైన రుద్దిన క్రమేణా అది

కోసం పాటుపడటమే: ప్రతి ఒక్కరికి పరమావధి కావాలి. వ్యక్తుల వికాసానికీ, అభ్యున్నతికీ, ప్రేమబంధాలకూ గల కృతకమయిన సకల యిబ్బందులు తొలగిపోవాలి. ప్రతివారికీ బ్రతకడానికి హామీ నిచ్చే ఆర్థిక వ్యవస్థను ఏర్పరుచుకోవాలి. అప్పుడే కుటుంబ జీవితం సుఖవంతమవుతుంది. మరిక బ్రతుకు భారం కాదు. ★




## నోటి పూతకు మందేది?

వనితాలోకంలో గృహవైద్యాలు సోదరీమణులు రాస్తున్నారు. ఇవి చాలా మందికి ఉపయోగిస్తాయనుకుంటాను. నాకో వైద్య విషయం తెలియజేస్తారని వ్రాస్తున్నాను:

నోటి పూతకు మందేమిటి? మా బంధువొకరు దీనితో బాధపడుతున్నారు. ఇంజక్షన్సు, మందులు చాలా అయినాయి. ఎవరు ఏది చెపితే అది వాడినాము. కాని పూర్తిగా పోలేదు. తాత్కాలికంగా తగ్గుతుంది. నోటి పూత ఉన్నప్పుడు, భోజనం చేయలేరు. మాట్లాడలేరు. చాలా బాధగా ఉంటుంది. నోటి పూతకు మందు తెలిసిన సోదరీమణులు వనితాలోకంద్వారా తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

—పి. యం. లక్ష్మి, వైజాగ్.]

(గృహవైద్యం శీర్షిక చూడండి)

* * *

## ఇకనైనా

అనుమానాలూ - అపవాదులు అనే వ్యాసం. 'యం. యల్.' గారు మంచీ చెడా చక్కగా విశదీకరించారు. వారితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. నిజంగా వారు చెప్పినట్లే తమకూ, అక్కచెల్లెళ్లు ఉన్నారన్నమాట మర్చిపోయి, ప్రతిదానికీ, తోటిస్త్రీలని అనుమానించి, లేనిపోని అభాండాలు వేయటం తగదు. అటువంటివారికి ఈ వ్యాసం చదివితేనన్నా, బుద్ధులు మారుతాయనుకుంటా.

-వల్లభాపురపు సరోజిని, తోట్లవల్లూరు.]

* * *

అనుమానాలు—అపవాదులు అన్న వ్యాసం చాలా బాగుంది. బి. యస్. లక్ష్మిగారు చాలా బాగా వ్రాసారు. పాకలసీత మొదలగు వారి వ్యాసాలు చాలా బాగుంటున్నాయి. వారందరికి నా అభినందనలు.

—వై. లలిత, సికింద్రాబాదు.]

* * *

## కాస్త నిదానిస్తే

ఆధునిక ఇల్లాళ్లు వాళ్లి అనాచారాలు గురించి, సుగాత్రిగారు చాలా బాగా చెప్పారు. చాలావరకు ఇప్పుడు అలాగా చేస్తున్నారు. ఒకసారి ఏమైందంటే నేను, మావారు, మా వదినగారింటికి వెళ్ళాము. నన్ను వంకాయలు తరగమంది. సరేనని తరుగుతున్నాను. ఇంత నిదానం అయితే ఎలా అని ఆమెకూర్చుని త్వరత్వరగా తరిగేసింది. వంకాయల్లో కూరంపెట్టమంది. కాయ ఇలా విడమర్చేటప్పటికి ఇంతపొడుగు పురుగువుంది. ఇదేవిటి వదినా అనిఅడిగితే 'చూడలేదు అది పారేయమం'ది. అంత అనాచారంగా మేము ఒకగంటలోపల వంట చేసేసి తీరిగ్గా వుంటాము అని డప్పాలు కొట్టకుండా కొంచెము చూసి చేస్తే మగవారితోటి చివాట్లు తప్పుతాయి. అనుమానం లేకుండా హాయిగా తినవచ్చు. మడి, ఆచారం అంటూ నెలకొకరోజైనా వుతకకుండా పటుపంచ అలాగే పెట్టారు. దానికన్నా రోజూ స్నానంచేసి వుతికిన చీరకట్టుకొని శుభ్రంగా వంటచేస్తే చాలా బాగుంటుంది. మధ్యాహ్నం తీరికవున్నప్పుడు, బియ్యం ఇతర సామానులు బాగుచేసి పెట్టుకుంటే తొందర లేకుండా హాయిగా వుంటుంది.

—టి. రమాదేవి, మార్కాపురం.]

* * *

## బాదస్తం లేనిమడి

"సుగాత్రి"గారు రాసిన "ఆధునిక ఇల్లాళ్ళు; అనాచారాలు!" అన్న వ్యాసం చాలా బాగుంది. ఆమె చెప్పినట్టుగా ఎప్పుడూ మడీ ఆచారము అని చెప్పుచూ మితిమీరి ఎప్పుడు మడి మడీ అనువారికి ఎక్కువగా ఆరోగ్యము చెడి కొసకు కొంచెమైననూ శుభ్రతలేకుండా ఆహారములు తీసుకొను పరిస్థితులు వస్తూవుంటాయి. అట్లాగే మాకు మడీ ఆచారము వీటిలో నమ్మకములు లేవు అనువారు కూడా వున్నారు. అల్లాంటివారి ఇంటి అశుభ్రతనూ, వారి పిల్లల అశుభ్రతను చెప్పడానికి వీలుండదు. మరీ ఎక్కడైనా పేరంటము మొదలగువాటికి బయలుదేరునప్పుడు చాలా నీటుగా డ్రస్ చేసుకొని పిల్లలకు బాగా డ్రస్ చేసి బయలుదేరుతారు. ఇక వారు చెప్పుకొను గొప్పలకు తక్కువుండదు. మేము మా పిల్లలు ఎప్పుడు చాలా శుభ్రముగా వుంటాము. మాకు కొంచెమైననూ అశుభ్రముగా వుండుట సరిపోదు అని చెప్పుకొనుచూ వుందురు. అట్లుకాక ఎక్కువమడీ అనకుండా చాలా అనాచారము కాకుండా ప్రొద్దునలేచి స్నానముచేసి వంట మొదలగునవి చేసికొంటే బాగుంటుంది.

"ఆడవాళ్లు ఆత్మహత్యలు" అను పోయిన వారం "మేరీ"గారు రాసినదానికి జవాబు "తంగిరాల కాంత" బాగా రాశారు.

—వి. వరసు, తుంగభద్రాడాం.]

* * *

## మహిళల దినచర్యలు

'పంజాబీ స్త్రీల దినచర్య' వ్యాసం చాలా బాగుంది. ఈ విధంగానే వివిధ ప్రాంతీయుల అలవాట్లను తెలుసుకుంటే మంచిది. భారతదేశంలోని పలుప్రాంతాలలో వుండే ఆంధ్ర మహిళలు వారి పరిసర ప్రాంతీయుల ఆచారాలను, అలవాట్లను "వనితాలోకం"కు పంపితే బాగుంటుంది. పంజాబీ వనిత చెప్పినట్లుగా, భార్యకూడా వుద్యోగంచేసి ఓ 100 రూ॥ తెచ్చి దాన్ని వంటావిడ ఖర్చులకు పెట్టేదానికన్నా, తనే వుద్యోగం చేయక వంట ఇల్లు చూసుకోవడం ఉత్తమ మనిపిస్తుంది.

పి. అనసూయ, నెల్లూరు.

* * *

## గృహ వైద్యం

మెత్తపడి పలుకులుగా రాలిపోవును.

### ఒళ్లు నొప్పులు

తమలపాకులో కొదేనా పలుకులు వేసి తీసుకున్నా ఒళ్ళునొప్పులు తగ్గును. తమలపాకు జున్ను (గర్భిణిస్త్రీలు వాడేది) తీసుకొనినాగర్భిణిస్త్రీలకు కలిగే ఒళ్ళునొప్పులు తగ్గిపోవును. ఇవి నాకు బాగా అనుభవమయినవే.

—కొనూరి వెంకటలక్ష్మి, ఏలూరు.]

★

## వంటలు:

# రేగిపళ్లతో



సోవియట్ రష్యాలో సాంకేతిక శిక్షణకై భారత ప్రభుత్వం ఎన్నిక చేసిన ఆంధ్ర యువకుడు శ్రీ భూమిరెడ్డి నరసింగరావు (జంషెడ్పూర్). వీరు హిందుస్థాన్ స్టీల్ తరఫున వెళ్తున్నారు.

దీనికి కావలసిన వస్తువులు:- పుల్లని రేగిపళ్ళు బాగా పండినవి 100, పావు శేరు మినప్పప్పు (పొటుతీసినది), కారము, ఉప్పు, నువ్వులు గిద్దెడు, ఇంగువ (నల్లది).

చేసే విధానము:- రేపు వడియాలు పెట్టాలనుకున్న, ఈ దినము ఉదయము మినప్పప్పు తెప్పించి ఇసక, రాళ్ళు లేకుండా బాగు చేసుకొని వుంచుకోవాలి. కారము, ఉప్పు కూడా మెత్తగా కొట్టి జల్లించి ఉంచుకోవాలి. నువ్వులు రాళ్ళు లేకుండా బాగు చేసుకోవాలి. రేపు వడియాలు పెట్టాలన్న ఈ దినము రాత్రి పప్పు నీటిలో నానబోయాలి. మరుచటి దినము ప్రొద్దున ఆ పప్పు అంతా మెత్తగా రుబ్బుకోవాలి. తదుపరి రేగిపళ్ళన్నియు తడిబట్టతో శుభ్రముగా తుడుచుకొని తొడిమలు తీసివేసి వుంచుకోవాలి. ఈ రుబ్బిన ముద్ద అంతా ఒక స్టీలుగిన్నెలోకిగాని జాడిలోకిగాని ఎత్తుకోవాలి. తదుపరి ఈ రేగిపళ్ళన్నియు రోటిలో వేసి బండతో కొద్దిగా. దంచుకొనిన ఈ పళ్ళలోని పిక్కలన్నియు బయటకు వచ్చును. ఈ పిక్కలన్నియు తీసివేసి ఈ ముద్ద అంతయు కూడా మినపప్పు ముద్దవున్న జాడీలోకి ఎత్తుకోవాలి. తదుపరి దానికి సరిపడ్డ కారము, ఉప్పు, ఇంగువ ఈ నువ్వులు అన్నియు అందులో వేసి బాగా కలిపివుంచుకోవాలి. తదుపరి ఒక తెల్లని బట్టను గాని పెద్దపెద్దచాటలు గాని బాగా తడిపి నీళ్ళన్నియు పోవునట్టు దులిపి అవి ఎండలో పెట్టి దానిమీద ఈ ముద్ద అంతయు గుండ్రముగా వడియాలు పెట్టుకోవాలి. చిన్నవి కావలసినవాళ్ళు చిన్నవి, పెద్దవి కావలసినవాళ్ళు పెద్దవి ఎవరికి ఇష్టము వున్నట్లువారు పెట్టుకోవచ్చు. ఇవి పచ్చిగా వున్నప్పుడు కూడా వేయించుకొని అన్నములో వేసుకున్న చాలా రుచిగా వుండును. 6 నెలలు దాకా వుండును.

## రేగిపళ్ల రాయిత

దీనికి కావలసిన వస్తువులు: పావు శేరు పెరుగు, పక్వానికి వచ్చిన రేగిపళ్ళు పుల్లనివి 20, పచ్చిమిరపకాయలు, కొత్తిమిరి, కరివేపాకు, ఆవాలు, మెంతులు, నల్లఇంగువ, కొద్దిగా పసుపు.

చేసే విధానము:- రేగిపళ్ళన్నిటికీ తొడిములు తీసుకొని పిక్కలన్నీ తీసివేసి చాకుతో చిన్నచిన్న ముక్కలుగా కోసుకోవాలి. తదుపరి పచ్చి మెరపకాయలు కొత్తిమిరి, ముద్దగా నూరుకొని వుంచుకోవాలి. పొయ్యిమీద బాణలివేసి దానిలో కొద్దిగా నెయ్యివేసి అదికాగగానే కొద్దిగా ఆవాలు మెంతులు ఇంగువ కరివేపాకు వేయాలి. ఆవాలు చిటపటలాడగానె ఈ నూరిన పచ్చిమిరపకాయ ముద్దను అందులోవేసి తదుపరి ఈ రేగిపళ్ళ ముక్కలన్నియు కూడా అందులోవేసి గరిటెతో బాగా కలిపి క్రిందకు దించివేసి ఈ పావుశేరు పెరుగులో పోసివేయాలి. అప్పుడు దానికి తగినంత ఉప్పు కొద్దిగా పసుపువేసి బాగుగా గరిటెతో కలుపుకొని అన్నములోగాని ఉప్మాలోగాని దోశలోనికిగాని వేసుకొని తిన్న చాలా బాగుండును. ఒక్క రోజుకన్న ఎక్కువ దినాలు వుండదు.

—యన్. సుశీల, మహబూబ్ నగరం.]

* * *

# ముల్లంగితో మురబ్బా

కావలసిన వస్తువులు: ముల్లంగిదుంపలు, పంచదార, నెయ్యి, కిస్మిస్, మొగలిపూల ఎస్సెన్సు.

ముల్లంగిదుంపలు శుభ్రంగా కడిగి పల్చగా చక్రాలు తరుక్కోవాలి. మూకుట్లో నెయ్యి వేసి ఆ చక్రాలు దోరగా వేయించాలి. కిస్మిస్ పళ్ళు నీళ్ళలో కొంచెంసేపు నాననివ్వాలి. పంచదారతీగ పాకంపట్టి, వేయించిన ముల్లంగి, కిస్మిస్ పళ్ళూ అందులో వెయ్యాలి. తరువాత యాలకులపొడి, మొగలిపూల ఎస్సెన్సు వేసి బాగా కలిపి దించుకోవాలి. మనకు కావలసినంత చేసుకోవచ్చు గనుక ప్రత్యేకం కొలతయివ్వలేదు. తీపి ఎక్కువ కావాలనుకున్నవారు కొంచెం ఎక్కువ లేనివారు తక్కువ పంచదార వేసుకోవచ్చు.

## 2. పకోడీలు

కావలసిన వస్తువులు: పావుసేరు ముల్లంగి, పావుసేరు సెనగపప్పు, అర్ధపావు మినప్పప్పు; అర్ధపావు బియ్యం, ఒక పచ్చికొబ్బరి చిప్ప, కొద్దిగా అల్లంముక్క, జీలకర్ర, కర్వేపాకు, పచ్చిమిరపకాయలు.

పై రెండుపప్పులు, బియ్యం, రెండు మూడు గంటలు నాననివ్వాలి. ముల్లంగి దుంపలు కోరివుంచుకోవాలి. నానిన పప్పులు, బియ్యం మెత్తగా రుబ్బాలి. తరువాత కొబ్బరి, అల్లం, తగినన్ని పచ్చిమిరపకాయలు ముద్ద నూరి, ముల్లంగికోరు, ఆ మసాలాముద్ద, కర్వేపాకు, రుబ్బి వుంచుకున్న పిండిలో కలపాలి. పొయ్యిమీద మూకుడుపెట్టి, నెయ్యిగానీ, నూనెగానీ వేసి ఈ పిండిని పకోడీలమాదిరి వండాలి.

## 3. మసాలాఉండలు

కావలసిన వస్తువులు: ఒక ముల్లంగిదుంప, కొద్దిగా సెనగపిండి, పావుసేరు టోమాటోలు, కొతిమీర, పచ్చిమిరపకాయలు జీలకర్ర, పసుపు, ఉప్పు, గరంమసాలా.

ముల్లంగి కోరుకుని, ఆ కోరు సెనగపిండిలో వేసి పిసికి ముద్దచెయ్యాలి. ఆ పిండిని పకోడీల మాదిరి నూనెలో వేయించాలి. పొయ్యిమీద గిన్నె పెట్టి తిరగమూతవేసి అందులో తరిగిన టమాటా ముక్కలు వెయ్యాలి. టమాటాలు ఉడకగానే మూడు పావుసేర్లు నీళ్లుపోసి మూతపెట్టాలి. నీళ్ళు మరుగుతున్నప్పుడు, చేసివుంచుకున్న పకోడీలు, గరంమసాలా, ఉప్పు, పసుపు, కొతిమీర, పచ్చిమిరప ముక్కలువేసి కొంచెం సేపు ఉడకనివ్వాలి. చిక్కబడిన తరువాత దింపాలి.

—తెన్నేటి అహల్యాదేవి, హనుమకొండ.]



# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ
# లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

ఆరోగ్యము కొరకు ఆటలు ఆడుట ఆవశ్యకమైయున్నది—అయితే ఆటయందు గాని లేక పనియందుగాని మనము ఎల్లప్పుడూ మురికిగా నగుదుము. మురికిలో వ్యాధి కారకములగు క్రిములున్నవి. వాటివల్ల మన ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాదమున్నది. లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి మిమ్ములను రక్షించును.

లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుటవల్ల మీరు మరల హాయిగా నుందురు. అలసట మటుమాయమగును. లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము చేయుడు—మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు.




L. 265-X52 T L.

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారు.




# సింహము - కోతి

అలసి సొలసి వేటలోన
    కొలనునందు నీర్కుదావి
తరువునీడ మేనువాల్చె
ఘోరముగా సింహ మొకటి.

చెట్టుమీద నున్నదొక్క
చిట్టిపొట్టి మర్కటమ్ము.
తెలివితేటలందు దాని
కెవరు సాటిరారు భువిని.

తీక్షణ మగు తన కనులతో
తేరిపార మృగనాథుని
చూచి మదిని కోతి యిట్లు
చింతసేయ మొదలిడినది :

"శౌర్యధైర్య సాహసముల
కుర్వి తాన నిలయమంచు
గర్విమైన సింహమునకు
గర్వభంగ మేనుజేతు."

మెల్లమెల్ల చిన్నకొమ్మ
లెల్లద్రుంచి కేసరిపై
'విసరివైచి కిచకిచ మని
కసిగ కోతి నవ్వసాగె.

కలతనిద్ర నున్న సింహ
ములికిపడుచు లేచి చూడ,
చెట్టుపైన నున్నకోతి
చేయి చూపి పలుకరించె.

"కన్నుమిన్ను గానకుండ
నన్ను పరిహసించు నిన్ను
ముక్కలుగా చేసెద" నని
మిక్కుటమగు క్రోధంబున.

అనిన దాని మాటలు విని
"జాను మీదు శౌర్యమునకు
వంక లేదు, అడ్డు లేదు
ఇంక వేరు మాటలేల?

చిన్నవిన్నపమ్ముగలదు.
చెట్టుపైన ఉన్న నన్ను
క్రిందనున్న మీరలెట్లు
అందుకొందు" రనెనుకోతి.

మారుమాట చెప్పలేక
మౌనముద్ర దాల్చెసింహ,
మందుమీద కోతి యడిగె:
"అణగినదా మీపొగ"రని.

"నీకులేదు అంత తెగువ.
నీవు ఎక్కి కూరుచున్న
యిమ్మహీరుహమ్ము ధైర్య
మిచ్చె" ననుచు సింహమేగె.

పెద్దవారి అండజూచి
ప్రేలుచుంద్రు నీచమతులు
సజ్జనాళి వారి కెపుడు
సౌమ్యముగా నీతిగరపు.

 కె. ఆర్. మోహనశాస్త్రి 




'నేను క్రొత్త పలకను...నేను క్రొత్త పలకను,' అంది పలక.

'నేను క్రొత్త బలపాన్ని... క్రొత్త బలపాన్ని,' అంది పలకపుల్ల.

'నా చుట్టూ ఎంత అందమైన చట్రం ఉందో' అంది పలక.

రంది సోమరాజు

'నా చుట్టూ ఎంత అందమైన కాగితం చుట్టుకొని ఉందో' అంది పలకపుల్ల.

పలకకు కోపం వచ్చింది. తను ఏమంటే పలకపుల్ల అదే అంటుంది. అందుకనే దానికి కోపం.

'ఛీ...నువ్వు స్వంతంగా ఏమీ మాట్లాడలేవు...' అంది పలక.

పలకపుల్లకు మరింత కోపం వచ్చింది. 'ఎంత అవమానం...ఎంత అవమానం...' అని భగ్గుమ మండింది. 'మొద్దు రాచిప్పవు, నీకు మాటలు కూడా వచ్చా' అంది.

పలకకు కోపం ఉవ్వెత్తుగా వచ్చింది. 'ఇదిగో పలకపుల్లా... ఇట్టే విరిగిపోయే చీపురుపుల్లా...నీకే చెపుతూంట...నోటికొచ్చినట్లు ప్రేలకు...' అంది.

వెంటనే 'నన్ను చీపురుపల్ల అంటావేం...చేట మొగమా...' అంది పలకపుల్ల.

ఇంకేముంది? 'ఏమిటేమిటే, పలక పుల్లా...నన్ను చేటం టున్నావా...చూడు నిన్నేం చేస్తానో...' అంది పలక.

'నీ మొహం...నువ్వేం చేస్తావు' అంది పలక పుల్ల.

'నిన్ను విరగదన్నకపోతేచూడు నాపేరు పలకే కాదు...'అందిపలక.

'తన్నావ్...తన్నవూ...' అంది పలకపుల్ల.

'తన్నానా...తన్ని చూపిస్తా...' అంది పలక.

'బలం ఉందని విర్రవీగిపోకు'



ఎడారి ఓడ

చిత్రకారుడు: కె. కృష్ణారావు—ఏలూరు.

[illegible]

మెల్లిగా అంది పలకపుల్ల.

'నోరుందని నోటికొచ్చినట్లు వాగకు...' పలక ధీమాగా అంది.

మెల్లిగా పలకపుల్ల 'నా నోటి వెంట ముత్యాలు రాల్తాయ్...' అంది.

విసురుగా పలక, 'నీ ముత్యాలు నేనుంటేనే ఎవ్వరికైనా కనిపిస్తాయి' అంది.

'నువ్వు లేకపోతే నేను గచ్చు మీద రాసుకుంటాను' అంది పలకపుల్ల.

'నువ్వు వ్రాయకపోతే నేను సుద్దముక్కలు తెచ్చుకుంటాను' అంది పలక.

'సుద్దముక్క నీ దగ్గఱకు రాదులే, దానికి నల్లబోర్డే కావాలి...' పలకపుల్ల ఉషారుగా అంది.

'గచ్చుకు నువ్వు పనికిరావులే దానికి సుద్దముక్కే కావాలి...' పలక ఘాటుగా అంది.

'ఛీ...నేనేమంటే అదే అంటుంది. వట్టి చెత్తరకం...' పలకపుల్ల పగతీర్చుకుంది.

పలకకు ఎక్కడలేని కోపం వచ్చేసింది. 'ఏమిటన్నావ్...కళ్లు మూసుకపోయి మరీ వాగుతున్నావ్...ఒళ్లు క్రొవ్వెక్కిందా ఏం?' అంటూ గట్టిగా అఱచింది.

పలకపుల్ల తగ్గిపోలేదు. మాటకు మాట తెగులు...నీటికి నాచు తెగులు అన్న సామెత మాకు తెలుసుగా! 'నీ ఒళ్లే క్రొవ్వెక్కింది...' అంది.

పలకకు ఇకకోపం ఆగలేదు. పలకపుల్లమీద పడి, తక్షన దాన్ని రెండు ముక్కల క్రింద చిదగ్గొట్టింది.

పలకపుల్లకు రోషం రెట్టింపయింది. పలకమీద బరబరా, బరబరా రెండు రెళ్లు నాలుగు పిచ్చిగీతలు గీసింది.

'నామీద పిచ్చిగీతలు గీస్తావా' అంది పలక.

'నన్ను ముక్కలక్రింద చితగ్గొట్టి ఇంకా అలా ప్రేలుతావేం...' అంది పలకపుల్ల.

'చూడు నిన్నేం చేస్తానో' అంది పలక.

'ఏడిశావ్...' అంది పులకపుల్ల.

వెంటనే పలక 'ఏమిటన్నావ్' అంటూ బడ్డూలా దానిమీద పడి టిక్కు, టిక్కున పలకపుల్లను పది ముక్కల క్రింద చిదగ్గొట్టింది.

పలకపుల్ల మాత్రం తక్కువదా!

## బలే సోదరులు

అదీ బలంగా విరుచుక పడింది. పలక మీద బర్ బరా—బర్ బరా—వంద పిచ్చిగీతలు గీసేసింది.

దీనితో పలక మరింత విజృంభించింది. ఒకటే టిక్కు టిక్కు టిక్కు టిక్కు టెక్కు టెక్కున పలకపుల్లను తుక్కు తుక్కు క్రింద చిదగ్గొట్టేసింది.

పలకపుల్ల మాత్రం ఊరుకుంటుందా...ఒకటే పిచ్చిగీతలు...బర్ బరా...బర్ బరా సుద్ద పులిమినట్లు పలకనిండా పులిమేసింది.

పాపం పలక ఒకటే పిచ్చి గీతలతో పూర్తిగా మొద్దుబారిపోయింది.

పాపం పలకపుల్ల ఎందుకూ పనికి రాకుండా చిన్ని చిన్ని ముక్క ముక్కలైపోయింది.

పలక మీద వ్రాయాలంటే ఏమీ కనిపించదు.

పలకపుల్ల పట్టుకుందామంటే చేతికి దొరకదు.

ఇదంతా చూసి ప్రక్కనే ఉన్న పుస్తకం చాల విచారపడింది.

'అయ్యో మీ రిద్దరూ సోదరులు కదా...ఎందు కిలా కీచులాడుకుంటారు. పనికిమాలిన కజ్జాలతో పాడైపోతారు. ఒకరిమీద ఒకరు ఆధారపడిన మీరు ఇలా దెబ్బలాడుకోవడంవల్ల చూశారా ఎలా చెడిపోయారో...మీరు కలసి మెలసి ఉంటేనే రాణిస్తారు. లేకపోతే మరణిస్తారు.పోరునష్టం...పొందులాభం' అందీ.

పాపం పలకా, పలకపుల్లా ఈ మాటలు వినగానే ఎలా సిగ్గుపడిపోయారో ఏం చెప్పను! ★

## ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

(12-వ పేజీ తరువాయి)

బియ్యి. గంటనించి జెబ్బ లాడిపొయ్యేలా పిలుస్తా వుంటే, పల్లకుంతా వేందీఅంట" అంది నరసు దమాయింపుగా.

రాజుకి ముచ్చెమటలూ పోసేశాయి. అల్లంతదూరాన అంజలీదేవి, నాగేశ్వరరావూ రేలంగి ఇంకా ఎవరెవరో వేషాల్లో నడిచి వెళ్తున్నారు. ఆ టోగ్రాఫుల పుస్తకం ఉంటే, అందరిసంతకాలూ సంపాయించేదుంగదా అనుకున్నాడు. అంతలో గుండె గుభేలుమంది. వాళ్లు ఇటే చూస్తున్నట్టున్నారు.

'అయ్య బాబోయ్ ఇంకేమేనాఉందా. వాళ్ళు మానిగుర్తు పట్టేస్తే'--అనుకున్నాడు.

మరో స్టుడియోలోంచి సావిత్రి, ఎన్. టి. రామారావూ వస్తున్నారు.

ఓరిబాబోయ్ వీళ్లిటూ, వాళ్లటూ. ఎలాగా! లక్ష్మి నరసో, తనో ఇద్దరూనో అమాంతం మాయమైపోతే బాగుండునని ఆశ పడ్డాడు రాజు. కాని ఆ సదుపాయం జరిగేలా కనబడలేదు. తెరవేలుపులు ఎడనించీ పెడనించీ దగ్గరికొచ్చేస్తున్నారు. రాజుకి ఉపాయంతోచలేదు. కొలంబస్, కిరాతార్జునీయంలో వరాహంలా - ఇతడికి రెండు తలలా ? అనిపించేటంత వేగంగా ఇటూ అటూ, అటూ ఇటూచూస్తు ఆ గ్రూపుకీ ఈ గ్రూపుకీ నమస్తేలు విసుర్తున్నాడు, ఏ ఒకటేనా తగలకపోతుందా అని.

రాజుకి మతిపోతోంది. 'క్లైమాక్సనిసులో బ్యాంక్ గ్రౌండ్ మూజిక్కులా' చెవులు హోరుమంటున్నాయి. "ఇంకేముంది. అంజలీ, సావిత్రీవాళ్ళూ నన్ను ఇక్కడ--ఇలా ఈ ఎగప్పాతో చూసేస్తె, తరవాత హీరోయిను వెయ్యనంటారు. వాళ్లు హీరోయను వెయ్యకపోతే నేను ఎన్ని హీరోగోళ్లు వేసి ఏంలాభం మనసా?" అనుకొన్నాడు. అందుకని తక్షణం రంగు పిరాయించేశాడు.

'హు ఆర్ యూ—లక్ష్మి నరసూ? వాటీజ్ యువర్ నేమ్? నీపేరేమిటి?' అన్నాడు వీలైనంత గట్టిగా, గంభీరంగా చుట్టుపక్కల అందర్నీ ఆశ్చర్యపరచేటంత బెట్టుగా.

'ఎందీ?...ఏంది. నీపేరేటా ... వారినీ. బలేవోడివే—నీ సిగ్గు సట్టుబండలుగాను' అంది నరసు విరగబడినవ్వుతూ'

'వాళ్ళు', వీళ్లవంక చూడకుండానే ఇందాకా రాకుండానే పదిగజాల అవతల ఉన్న ద్వారంలోంచే అటే వెళ్లిపోయారు, తీరా.

కొలంబస్ కూడా స్థిమితపడి సర్దుకుని, అలవాటుప్రకారం టెక్కునటించి, వీళ్ళ లోకంలోకి వచ్చాడు.

రాగానే అతనికంటికి ఆనింది పంచకల్యాణి గుర్రంలాఉన్న లక్ష్మినరసు.

'సో! నీపేరు లక్ష్మినరసు అన్నమాట.' అన్నాడు చనువుగా.

'మాటా లేదు గీటా లేదు...నాపేరు ఏదో ఓటి. నాతోటి నీకేటిమద్దిన.' అంది నరసు రుసరుసలాడుతూ.

'ఓరబ్బో. గుర్రంకబ్టెయ్‌మరి. ఎవరితో మాట్లాడుతున్నావ్ తెలుసా? ఆయామె ప్రొడ్యూసర్స్ బ్రదరిల్లా' అన్నాడు కొలంబస్ కొంచెం కోపంగా.

'ఒస్సి...నాకు తెల్దేటి నీ బెదరిల్లాతనం. ఒగ్గేయి కోతలు ... అవునుగాని రాజా! మద్దినాల కూడుదిని నాతో సూటింగ్ కొత్తనన్నావు......అదే పోవడమా. ఇంకా తిన్నావాలేదా. ఇలాటోల్లతో తిరిగితే ఏటి లాబం. కూడా గుడ్డా' అంది.

'నన్ను మన్నించు నరసూ' అన్నాడు రాజు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ.

ఈలోగా కొలంబస్, ఇకిలించి, మెళ్లో ఒంటిపేట గోల్డుగోల్డు గొలుసు పొగ్గా మెలిపెట్టి తిప్పుకున్నాడు. బంగారపు ముందరిపన్ను, ఈ గొలుసూ రూపంలో ధైర్యసాహసాలను ప్రదర్శించి, జేబులోంచి పదిహేను రూపాయల వాక్స్వాతంత్ర్యాన్ని తీసి లెక్కవేసినట్టుచూసి, పొడిదగ్గుదగ్గి, నరసుకు దగిరగాజరిగి "అయితే లక్ష్మి ఇవాళ కాల్ షీటు ఎక్కడ? — అదే ఏ పిక్చర్లో" అన్నాడు ఆప్యాయంగా భుజంమీద చేయి వేయబోతూ.

రాజుకి అతనితరహా నచ్చలేదు. కొస్త మొహమాటం, కొంచెం భయం వేసినా తెగించి, 'యూసీ. కొలంబస్ గారూ. అయామ్-నేను, నేనూ నరసూ - ఆయి మీనూ-మీరలా ముట్టుకోకండి' అని నసుగుతున్నాడు.

నరసుకి అంతకన్నా నచ్చలేదు కొలంబస్ చొరవ. అందుకని, కొలంబస్‌కుసంబంధించినంతవరకూ, రాజ్యాంగంలో వాక్స్వాతంత్ర్యానికి సంబంధించిన సెక్షను పావు గంటదాకా పనిచేయడానికి వీల్లేనంత పవర్‌ఫుల్ గా పుర్రచేత్తో జవాబిచ్చి, "మాపిటేలకేనా కొంపచేరు" అని రాజునిపురమాయించి చరచర నడిచి వెళ్ళిపోయింది.

* * *

'చురుకుపాలు ఒక్కరవ్వ ఎక్కువున్నట్టుంది' అన్నాడు కొలంబస్ పావుగంట తరవాత తేరుకుని.

'యస్సార్' అన్నాడు రాజు దిగ్భ్రాంతుడై.

'ఏమి యస్సారు మీబొంద? గూబగుయ్యి మంది సార్! పైపెచ్చు పరువుపోతేను. ఎవరెవరు చూశారో ఏమిటో' అన్నాడు కొలంబస్. చుట్టూ కలయజూసి.

'నోసార్' అన్నాడు రాజు కంగారుపడి.

కొలంబస్‌కి ఒళ్లు మండిపోయింది. 'షటప్' అన్నాడు దూకుడుగా.

'ఆల్ రైట్ సార్' అన్నాడు రాజు టిక్కు మొహం పెట్టేసి.

ఒకనిముషం ఎవరూ మాట్లాడలేదు.

'కాఫీ తాగుదాంపద' అన్నాడు కొలంబస్.

కూలబడి మంచి నీళ్ళుతాగాక, 'ఇంతకీ ఆ అమ్మాయి ఎవరు మీచుట్టాలా? అన్నాడు కొలంబస్.

రాజు మొహంలో చిన్న సైజుదీపం లాటిదేదో వెలిగి ఆరిపోయింది. ఆలోచించాడు. తటపటాయించాడు. చివరికి తెగించి 'ఔను సార్' అనేశాడు తలవంచుకుని ముసిముసి నవ్వులు నవ్వుతూ.

'ఏవిటలా సిగ్గుపడిపోతున్నావు. కొంపతీసి ప్రేమించావా ఏమిటి?' అన్నాడు కొలంబస్ ఉత్సాహంగా.

'ఔను సార్. యస్.' అనేసరికే, నవ్వు అతని పెదిమల పరిహద్దు దాటిపోయింది. బలవంతాన ఆపుకుంటున్నాడు. ఆనందాన్ని, ఉత్సాహాన్ని అదుపు చెయ్యలేక భుజాలు నానాఅవస్థా పడుతున్నాయి.

'అలా భుజాలెగరెయ్యకు. జడ్డివాడను కుంటారు ఎవరేనా... పెళ్ళాడుతున్నావా? లేకపోతే టెంపరరీ లవ్వేనా?'

'పెర్మనెంటే నండి'

'ఎప్పణ్ణించి.'

'నిజం చెప్పాలంటే ఇందాకనించే నండి. మిమ్మల్ని ఇలా చేత్తో అనలేమూ—'

'ఇలా అనటం ఏమిటి నీతలకాయ. చెంప ఛెళ్లుతుంది. గూబ గుయ్యిమంది—' అన్నాడు కొలంబస్ చెంప తడుముకొంటూ. రెండు గుక్కలు కాఫీ తాగేదాకా కొలంబస్ మళ్ళీ ప్రసన్నుడు కాలేదు. అయ్యాక, రాజు భుజం తట్టి, 'అయితే, మరి ఇందాక ఆ పిల్లని పలకరించడానికి ఎందుకు సిగ్గుపడ్డావు?...ఎవరన్నా చూస్తే పరువుపోతుందని భయమా?" అన్నాడు.

రాజుసిగ్గుపడ్డాడు. 'యస్సార్ అయాం మెహీరో బికాజ్...అందు కనండి. కానీ అది ఇపుడే వేస్తానంటుంది నాతోటి. నేను చూస్తే సావిత్రి వాళ్ళతో తప్ప హీరో వెయ్యనుగదా. దానికి చెప్తే తెలీదు. షి డోంట్నో బట్ హూ...అదంటే నాకు ఇష్టమే కాని, బట్ హూకెన్ పాసిబుల్ హియర్. థటీజ్ బికాజ్ అంచేత అదికథ" అన్నాడు రాజు ఉద్రేకంగా.

"బ్రదర్ నువ్విక్కడ తప్పబుట్టావు అమెరికన్ పిక్చర్లలో వెయ్యాల్సినవాడివి...సర్లే గాని, డబ్బేమాత్రం ఉంది'

'ఇక్కడ జేబులో ఏం లేదండి. కొంచెం ఉంటే పొద్దున్న ఫీజుకట్టేశానండి. మరినా పెట్టే బేడా పేపరాఫీసులో ఒదిలేశాను గదండి.'

'వెరిగుడ్! ఒక్కడుగు వెళ్ళొద్దాంరా చెబుతా. నాదగ్గర చెక్కుంది రేపుగాని మారదు.' అంటూ లేచాడు కొలంబస్. ఐదు నిముషాలలో ఇద్దరూ ఇవతలకొచ్చారు. కొలంబస్ దర్జాగా టాక్సీని పిలిచాడు.

* * *

పేపరాఫీసులో ఎవరూ లేరు. కుర్రాడు కునికిపాట్లు పడుతున్నాడు.

కొలంబస్, రాజు లోపలికెళ్ళారు. 'అన్నట్లు మర్చిపోయానండి-ఈపెట్టె నాది కాదు. రైల్లో మారిపోయి ఎవరిదో నాకు వచ్చేసింది.' అన్నాడు రాజు.

"నిజం! లక్కీ ఫెలో. బహుశా దీన్నిండా నీకదృష్టం ఉంటే—"

"దీన్నిండా పాత పేపర్లున్నా యను కుంటా"

'నాన్సెన్స్. అదృష్టముంటే, అవి నోట్ల కట్టలైపోవచ్చు. బంగారు నగలుకావచ్చు.'

"లేకపోతే?"

"నీ కర్మం. ఆడదానిశవం ఉండొచ్చు. చావుబాజా, గావుకేక, కాయరాజా, నవలల్లో శవాలన్నీ పేర్చి ఉండొచ్చు. తెరు తెరు" అన్నాడు కొలంబస్ ఆశగా లొట్టలు వేస్తూ.

తాళంచెవి అక్కరలేకుండానే పెట్టె మూత వచ్చేసింది. దాన్నిండా కాళీస్థలం, అందులో ఓమూల ఓ విచ్చ బేడ కాసు ఉన్నాయి.

రాజు కొంచెం ఆశ్చర్యపోయాడు 'బేడకాసు దొరికినందుకు. కొలంబస్ కొయ్యబారిపోయాడు, బేడే ఉన్నందుకు; టాక్సీవాడు బయటఉన్నాడని గుర్తుకురాగానే.

ఒక క్షణానికి తేప్పరిల్లి. హారినీ ఇదేనా! 'పెట్టేబేడా' పేపరాఫీసులో ఉన్నాయన్నావు అంటూ విరగబడి నవ్వసాగాడు.

కొంతసేపటికి రాజుకుకూడా అందులో జోకు తెలిసింది. మరే! పెట్టే బేడా' అంటూ పెట్టెపైకెత్తి ఆడించి బేడ చేసే చప్పుడు వింటూ ఎంతో సంతోషంగా నవ్వాడు.

'ఇడియట్' అన్నాడు కొలంబస్ నవ్వాపుకుని కళ్ళనీరు తుడుచుకుంటూ.(సశేషం)

# ★ దగాపడిన తమ్ముడు ★

(19-వ పేజీ తరువాయి)

పాట్లోడికి పుట్టెడుబుద్ధులని అంతాఅంటారు. క్రితంలో సర్కారునే యెదిరించి చుట్టుపట్ల పేరు సంపాదించాడు. ఆరోజుల్లో సారా ఖట్టీలుపెట్టి, ఉద్యోగులకు చాలపని కల్పించాడు. కొంతమంది వీపు చరుచుచేశాడు. విడిఉనికి కనుక్కోలేక ఎన్నోతిప్పలుపడేవారు. సంజీవిని పటియిచ్చేవారికి అయిదు వందల బహుమానం ప్రకటించారు. సంవత్సరం వరకూదొరకలేదు. ఒక తెలివైన యిన్స్పెక్టరు ఊళ్లో నాలుగురోజులు మకాంవేసి సంజీవివిషయం గుటులాగడానికిప్రయత్నించి కృతకృత్యుడయ్యాడు. ఒక గ్రామనాయుడితో కూడి, ఆచుట్టుపట్ల పదిగ్రామాలలోనూ దండోరా వేయించాడు. ఉత్తరదేశంనుంచి ఒక పైల్వానువచ్చాడని వాడిని ఓడించే మీసంగల మొగోడెవడైనా వుంటే, ఫలానా గ్రామ నడిబొడ్డున ఫలానరోజున కలుసుకోమనీ; నిజానికి ఆ పైల్వాన్ని చూడగానే చాలామంది భయపడ్డారు. నలుగురూ నాలుగువిధాల తననుగురించి అనుకోవడం, సంజీవికి నచ్చలేదు. ఊరుపేరు నిలబెట్టాలని రంగంలోకి వురికాడు. నలుగురూ, సెభాష్ అన్నారు. యిన్స్పెక్టరు అనుకొన్నట్లు ఆ పైల్వాను యిట్టే వోడిపోయాడు. కానీ సంజీవి పోలీసులకి చిక్కిపోయాడు. ఊరంతా గుప్పుమంది. పోలీసులు తుపాకులు చూపించారు. మూడేళ్ళు కారాగారం అనుభవించి వచ్చాడు. నలుగురిలో తలెత్తడానికి సిగ్గువేసింది. ఇంత గడసరీ యెంతో బాధతో కుమిలిపోడానికి అవకాశం, తన వుంపుడుకత్తె యిచ్చింది. ఇంకొకర్ని చూసుకోవటంతో దాన్ని చంపుదామనుకొన్నాడు, అయితే అది హేళనగా అన్నది. "సంపడానికొచ్చావు? ఏంతిని బతికమని కయిదులో కూర్చున్నావు? మచ్చ పెట్టుకొన్నావు! ఆ జీడిమరక వూడుతాదా? ఆ యిల్లాలి ఏడుపే నీకు మచ్చపెట్టింది. దాన్ని సరిగా యేలుకోరా నాయనా" అంది. నిజానికి ఆ సంబోధన బాగానేవుంది. సంజీవికంటె ఆమె కొద్దిగా వయసులో పెద్ద. తను ఆమెను చంపలేడని తెలుసు. చంపగలిగినా చంపాలని లేదు. ఆకత్తి నడియేటిలోనికి విసిరాడు. ఆ రాత్రికిరాత్రే చలిలోనే, 'దిమ్మదిరగా'మునిగేశాడు. ఇంటికి తడిబట్టలతో వచ్చి తలుపు తట్టాడు. భార్య తీసింది. ఆమెను బిగియార కవుగలించుకొని యేడ్చేశాడు. యెప్పుడూ యింకో ఆడదాన్ని సూడనని ఒట్టేసుకున్నాడు. పెళ్ళాం కళ్లుతుడిచింది. ముద్దెట్టుకుంది. హృదయానికి హత్తుకొని సంతోషంతో కన్నీరు కార్చింది.

ఆవేళనుంచి గ్రహంమారిందని చెప్పుకొనేవాడు. ఒళ్ళువంచి పొలంలో పనిచెయ్యటం—యిదినాది అనే మమకారం ఏర్పడడం—జరిగి సంవత్సరంలో ఒక కొడుకును యెత్తుకొన్నాడు. ఇలా పాడైపోతున్న ఇల్లు నిల్చింది. సంసారం బాగా గట్టిపడింది. భార్య చిక్కదనంవల్ల, భార్య అదుపాజ్ఞలలో తను వుండటంవల్ల, వూర్లో తనూ ఒక ఘరానా మనిషిగా అయిదారేళ్ళలోనే పేరుపొందాడు. ఇప్పటికి ముగ్గురు పిల్లల తండ్రైనా, ముఖం బుగ్గమీసాలతో నిగనిగలాడుతూనే వుంటుంది. పులివేషం వేసి, యిల్లెక్కి కోడిపుంజు పీకను పళ్ళతోకొరికేసత్తువుంది.

అలాంటి సంజీవి పుల్లయ్యను పలకరించాడు. ఇద్దరూ వూర్లో జరుగుతున్న అన్యాయాలను గురించి మాట్లాడుకున్నారు. నిరుడికీ ఈయేటికీ ధరలెంతగా పెరిగిపోయాయి? లేని ప్రజలు యెంతగా బాధపడ్తున్నారో? ఉన్నవాళ్లు చెయ్యిదులపకండా వున్నారు! నాయుడ్ని పెద్దరైతులని గట్టిగా అడగాలని పుల్లయ్య అన్నాడు.

ఇంతలో నీలిపిల్లాడ్ని యెత్తుకుని అరుగు దగ్గరకు వచ్చి "అంతా ఇంటున్నాను. రేపు నాయుడు మీ 'రాసను' తీసుకోమంటే మీ బట్టకొనుక్కోమంటే వూళ్ళోయెందరి దగ్గర డబ్బున్నాది?"

"నిజం సెప్పినావు కూతరా!" అన్నాడు

సంజీవి......

పుల్లయ్య "నిజవా! రైతోడికి అఖ్కర్లేక పోతే తిరిగి గవర్నమెంటోడి కిచ్చేస్తే యింకొకలికిస్తాడు. మనపేరు సెప్పిమన కడుపుకొట్టి ఆడుగడించాలా? అంతా చేకే-అంతా చేకే!—"

ఆవేశంతో లేచిపోతున్న మొగుడి వైపు చూస్తూ చిన్నవవ్వు నివ్వింది. పులయ్య ఖుస్సుమంటూ "శెపెళ్ళి టోరుదగ్గరకూర్సుంటాను. వచ్చిపోయినోల్లతో ఈ అన్యాయం సెపతాను" అన్నాడు.

"నాయుడు కొన్నోలని నూపించమంటే!"

"ఎందు కడుగుతాడు? గవర్నమెంటోడుకి సెప్పనా?"

సంజీవికి స్టోర్సులో కొంత పలుకుబడి వుండటంవల్ల "పుల్లిగా! కూకోరా!" అంటూ తను లేచిపోయాడు.

"అమ్మా! నీలమ్మా! గడ్డికుప్పదగ్గర కుక్కేంసేస్తాది? గడ్డితినదు; తిననివ్వదు పుల్లిగా ఊర్లో పెద్దల దగ్గర పరపతి మీద బతుకుతున్నావు. ఎందుకు వూరికే ఆ పరపతి సంపుకుంటావు? తల్లితండ్రి పోతే బతకొచ్చు కానీ, పరపతిపోతే బతకలేం. రేప్పొద్దున్న ఈ లేనోలంతా నీకేం సాయం చేస్తారులే, చేస్తే పెద్దోళ్లే సెయ్యాలి కాని" అంటూ వెళ్ళిపోయాడు.

పుల్లయ్య మాటాడలేదు. మీసాలు మెలేస్తూ పెళ్ళం వేపు చూస్తూ కొడుకును అందుకున్నాడు. అరుగుమీద జార్లబడుతూ కొడుకుని గుండెమీద పడుకో బెట్టుకుంటూ "మల్లూ! నీతాతకొడుకు—నీ అయ్య—కడుపుమాడినా నీతికి నిలబడతాడు—నువ్వో!"

[కొడుకు పకపకా నవ్వినట్లు, ఒళ్ళు గిలిగింతలు పెట్టినట్టయింది.] ★

—ఇంకా వుంది]

# మంచిమాట చెపితే

(31-వ పేజీ తరువాయి)

ప్పుడట ఆవిడ నిస్సహాయులైన తనభర్తలు అయిదుగుర్ని చూచి భగవంతుడే రక్షించాలని యింక ఆకృష్ణపరమాత్ముని ప్రార్థించడం మొదలెట్టిందట. ఎలాగంటే ఒకచేతితో తన వక్షోజాల్ని కప్పుకొని, మరో చేత్తో కుచ్చిళ్లను పట్టుకొని, పరమాత్మా లోకరక్షకా వచ్చి రక్షించమని! కృష్ణ భగవానుడు ఆ, ఆర్తనాదాన్ని విన్నాడు. ఆసమయంలో కృష్ణపరమాత్మ రుక్మిణితో చదరంగం ఆడుతున్నాడట. దుశ్శాసనుడు కొంగు పట్టి లాగబోయాడట; వూడి వస్తోంది! చుట్టూ పండితులూ, శూరులతో నిండినసభ! ఆడది యేం చేయగలదు? తన వక్షస్థలాన్ని రెండు చేతులతో కప్పుకొని హేకృష్ణా, కాపాడు, రక్షించు అని ప్రార్థిస్తోంది. మొర రుక్మిణికీ వినబడింది; కృష్ణుడూ వింటున్నాడు. కాని కదలడు రుక్మిణి కూడా వెళ్లి రక్షించమని అన్నా కదల్లేదు! ఇంకా ఆడుతున్నాడు! ఒక చెయ్యి పైకెత్తి, హేకృష్ణా అంది! మరో చేత్తో వక్షస్థలాన్ని కప్పుతూ. అప్పుడన్నాడట తనను తాను రక్షించుకోగల శక్తివున్నప్పుడు నా అవసరం దేనికని. ఇక్కడ శృతిమించింది. వాడుబట్టలు తొలగించేస్తున్నాడు. హేకృష్ణా! హేకృష్ణా రక్షించు అని రెండు చేతులూ పైకెత్తి మొక్కింది. యిక్కడ కృష్ణుడు గమనించి "త్రోసిరాజు! ఆటకట్టే' అని అక్కడ ఆటపూర్తిచేసి తన్ను నమ్ముకొని పూర్తిగా, మనస్ఫూర్తిగా నమ్మిన ద్రౌపదిని రక్షించ వెళ్లానుకొన్నాడని.

ఇప్పుడో! మనకేమైనా సహాయం చేస్తే, ఇంతనీ మొఖాన్న కొడ్తాం లేదా (అంటే నీవు సహాయం చేయకపోతే) నీకు మేం యివ్వం అని బేరాలు దేవుడితో సాగిస్తున్నారు.

ఒక పన్నెండేండ్లక్రితం ఒక స్నేహితురాలు మా యింటికొచ్చి నాకట్టూబొట్టూ చూచి యింకా యిదేంటండీ! కాలంతో మనమూ మారాలండీ పిన్నిగారూ అంది. ఇంతకి యేమిటంటే నేను రవిక తొడిగేను; ఆవిడ చంకలుదగ్గిరకు వున్న జాకెట్టు తొడిగింది. ఆమె మళ్ళీ మొన్న ఈ మధ్యేవచ్చి పిన్నిగారూ మళ్లీ మా జాకెట్లు మార్చేసేమండీ అంది. అవి 'అప్పటి ఫేషన్లండీ, ఇవి యిప్పటవి అంది. ఇంక నేనేమనగలను? ఒక రెండు మూడేళ్ళలో బొట్టులో యెలాంటి మార్పులొచ్చేయో నేను వేరే చెప్పాల్సిన పనిలేదు. కొంతకాలంమరీ అధ్వాన్నంగా 'మతం పుచ్చుకొన్న వాళ్ళు బాగా పెట్టేరు బొట్లు! మేము నాను, పట్టెడి, జిగినీగొల్సు యిలాంటివి వాడే వాళ్ళం. అవి మీకు మోటైపోయాయి. వాటినే పేరుమార్చి నెక్లెస్ అని మీరు వాడుతున్నారు. ఇంక రాగిడీలు, పాపిడ పిందులూ, నత్తు, అడ్డా బూస మొదలైనవి పూర్తిగా పోయాయి. పసుపు వుపయోగం యిప్పుడులేనేలేదు! క్రియకు మాలాంటి పెద్దలు అనుభవంతో చెపే మీకు రుచించవు. యెందుకంటే మేం నాగరికులం కాదు. ధర్మం యెవరికొక్కవాలి? యే అంజలీదేవో, సావిత్రో, జమునో ఇలా నడుచుకొండి అంటె తెల్లారేసరికి అలాతయారై పోతున్నారు! ఇంకా కొంతకాలానికి వాళ్ళుగాని బట్టలు కట్టుకోవడం నాజూక్కాదంటే అందుకూ సిద్ధపడి పోతారేమో అనుకొంటా! మేం చెప్పేవన్నీ సాధింపులు! వాళ్ళవి అమృతప్పలుకులు! ఇలా వ్రాశానని తిట్టేరు. నావయస్సును బట్టి నేను మీకుమల్లే వ్రాయలేనేమో. కాని మిమ్మల్నందర్నీ జాగ్రత్తగావుండి మంచిమార్గాన వుంచమని నేను సదా ఆపరమేశ్వరుని రెండుచేతులూ జోడించి మొక్కుతున్నాను. ఇకవుంటాను. మీకు ఇవే నాఆశీర్వచనములు. ★



# సినిమా

ప్రముఖ చిత్రదాంశిక నర్గిస్ ను, సంగీత నాటక అకాడమీ బహుమతులందుకొన్న ప్రముఖనటి దుర్గాఖోటే, సంగీతదర్శకుడు సచిన్ దేవ్ బర్మన్ లనూ బొంబాయిలోని చలనచిత్ర కళాకారులు గతవారం సన్మానించారు.

'సభలో ఒకరికి' జరిగిన ఈ సన్మానం యావద్భారత చలనచిత్ర పరిశ్రమకూ చెందుతుంది అని ఆ సభకు అధ్యక్షత వహించిన మోతీలాల్ అన్నారు.

'ఒకానొకనాడు, సినిమా లవాళ్లని అస్పృశ్యులుగా పరిగణించినట్లు అంతా చులకనగా చూస్తూ ఉండేవారు. ఈనాడు పరిస్థితులు మారి, ఈ పరిశ్రమ ఇంతటి గౌరవాన్ని చూరగొనడం గొప్ప విషయం' అని మోతీలాల్ అన్నారు.

## బొంబాయి సినిమా లేఖ

'ఇంతటి ఉచ్చస్థితికి రావటానికి కారకులు, మెప్పూ మెహరాబ్బనీ, లేకపోయినా కష్టనిష్ఠురాలకోర్చి పనిచేసి నెగ్గుకువచ్చిన పెద్దలందరూ స్మరణీయులు' అని శ్రీమతులు దుర్గాఖోటే, నర్గిస్ అన్నారు. సచిన్ దేవ్ బర్మన్ కలకత్తాలో ఉన్నందువల్ల సన్మానానికి హాజరుకాలేదు.

బొంబాయి శ్రీ సౌండ్ స్టుడియోలో జరిగిన ఈ సభలో నటీనటులే కాక చలనచిత్ర కళకు, పరిశ్రమకు సంబంధించిన వివిధ సంస్థల ప్రతినిధులు కూడా పాల్గొన్నారు.

నర్గిస్, దుర్గాఖోటే సన్మాన పత్రాలను బిపిన్ గుప్త, ఎస్. డి. బర్మన్ సన్మానపత్రాన్ని సజన్ చదివి సమర్పించారు. 'ఫిలిం కళాకార్ పరివార్' పేరిట ఈ సన్మానం ఏర్పాటు అయింది.

గౌరవాలూ, సన్మానాలూ ఇలా ఉండగా దేశదేశాలా మన చిత్రాలు తెచ్చుకుంటున్న పేరు ప్రతిష్ఠలు ఇలా ఉండగా, ఈ మధ్య ప్రభుత్వంలో బాధ్యతగల పదవి నిర్వహిస్తున్న ఒక ప్రముఖనాయకుడు ఇందుకు భిన్నమైన ధోరణిలో పాతపల్లవినే తిరిగి ఆలపించడం జరిగింది. ఎగుమతి సలహాసంఘం చర్చలలో చలనచిత్రాల ఎగుమతి విషయం ప్రస్తావనకురాగా, వాటిని ఉల్లిపాయలు, మద్రాసు జేబురుమాలు కూడా మొదలైన సరుకుల జాబితాలో చేర్చివేయడం శోచనీయమని, పరిశ్రమ ప్రతినిధి ఒకరు అన్నారు. సంస్కృతి వికాసానికి దోహదం చేసేవి, విదేశాలలో స్నేహ సద్భావాల వ్యాప్తికి సాధనాలు అయిన చలనచిత్రాలను సముచితంగా గౌరవించాలని, వాటికి ప్రత్యేక సదుపాయాలు చేయడం అవసరమని ఆయన విన్నవించారు. ఆ సభకు వచ్చిన వాణిజ్య మంత్రి శ్రీ మురార్జీదేశాయ్ ఈ వినతిని చాలా తేలికగా కొట్టివేశారు. "చలన చిత్రాలు సంస్కృతి వికాసానికి ఏదో చేస్తాయంటే నాకు నమ్మకంలేదు. మనం ఎగుమతిచేసే సరుకువిషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి" అన్నారాయన...

* * *



పొన్నలూరివారి 'శోభ'లో ముక్కామల, రాజసులోచన.




బి. ఎ. ఎస్. ప్రొడక్షన్స్‌వారి 'చెంచులక్ష్మి' లో నాగేశ్వరరావు, అంజలీదేవి.

సాలీనా తయారవుతున్న మూడు వందల చిత్రాలలోనూ "కల్తీ లేని కల్చరు" ఓడిపోతోందనీ, కళామతల్లి సంప్రదాయబద్ధమైన శాస్త్రీక్తమైన భరతనాట్యం మాత్రమే చేస్తోందనీ, ఎవరూ ఢంకామీద కొట్టి చెప్పటం లేదు. బొంబాయిలో తయారవుతున్న హాలీవుడ్ క్రైమ్ త్రిల్లర్‌లు చూస్తే అంతకన్నా అనరు. ఐతే ఒకమాట మరిచిపోరాదు. అన్ని చిత్రాలూ ఒక్కలాగే లేవు. ఈ దేశంలోనూ, ఇరుగు పొరుగులా, ఇతర దేశాలా కూడా సదసద్వివేచన గల వారందరిచేతా ఓహో అనిపించుకుంటున్నవి, అనిపించుకోగలవీ కూడా చాలా చిత్రాలు రూపొందుతున్నాయి. చలనచిత్రకళాకారుల శక్తిసామర్థ్యాలనూ, చలనచిత్రాల శక్తినీ నిరూపించి చాటినవి ఎన్నో ఉన్నాయి. అయినపుడు, హఠాత్తుగా శ్రీ మురార్జీ ఈ చలనచిత్ర పరిశ్రమను ఇంత తేలిగా, చూచి చిత్రాలన్నిటిమీదా మూకఉమ్మడిగా విమర్శ విసరడం భావ్యం కాదు. అందులోనూ బాధ్యతగల నాయకుడుగా మంత్రిగా ఉన్న పెద్దలు అన్నపుడు మరీ బాధాకరంగా ఉంటాయి.

శ్రీ మురార్జీ నాలుగైదు నెలలనాడు, బొంబాయివచ్చి 24 గంటలసేపు నగరంలో ఉన్నారు. ఆనాడు, రాచకార్యాలు పూర్తికాగా మిగిలిన కొద్ది వ్యవధిలోనూ ఆయన ఒకచిత్రం ప్రత్యేకం వేయించుకొని చూచారు. అది కల్తీలేని క్రైమ్ త్రిలర్...

అది చూచినమీదట్య ఆయనకు ఇటువంటిభావం కలిగి ఈవిమర్శ చేశారేమో తెలియదు.

*   *   *

ప్రభుత్వఫిలింస్ డివిజన్‌వారు, విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ పై ఒక డాక్యుమెంటరీ నిర్మించ నిశ్చయించినట్లు కేంద్ర సమాచార, ప్రసారమంత్రి డా॥ బి. వి. కేస్కర్ మొన్న లోక్ సభలో ప్రకటించారు.

ఈ చిత్రం దర్శకత్వ బాధ్యతను 'పద్మశ్రీ' సత్యజిత్ రాయ్‌కి ఒప్పగించదలచారని, ఈవిషయం ఆయనతో ప్రస్తావించగా, ఆయన ఇందుకు అంగీకరించారనీ తెలియవచ్చింది. ఇందుకు సంబంధించిన వివిధ విషయాలపై సంప్రతింపులు జరిపే నిమిత్తం రాయ్ త్వరలోనే ఢిల్లీ వెళ్తారు.

*   *   *

ప్రముఖ దర్శకనిర్మాత సొహ్రాబ్ మోడిని వి. శాంతారాంస్థానే, కేంద్ర సెన్సారు బోర్డులో సభ్యులుగా నియమించినట్లు అధికార ప్రకటన వెలువడింది.

## వార్తలు

ఎఫ్. సి. మెహ్రా నిర్మించిన అపరాధ పరిశోధక చిత్రం 'ముజ్రిం' గత వారం 21-న బొంబాయిలో విడుదల అయింది. పై వారం దక్షిణాదిన విడుదల అవుతుంది. షమ్మీకపూర్, రాగిణి, జానీ వాకర్, కమల్‌కపూర్, ఎస్. బెనర్జీ, శుభాఖోటే, ముంతాజ్ నటించిన ఈ చిత్రానికి రాల్‌హాన్ దర్శకుడు, సంగీతం ఒ. పి. నయార్.

*   *   *

అశోక్ పిక్చర్స్ పేరిట అశోక్‌కుమార్ నిర్మించిన చిత్రం 'రాగిణి' ఈ నెల ఆఖరు వారంలో విడుదల అవుతుంది. ఇందులో అశోక్‌కుమార్, పద్మిని, కిశోర్‌కుమార్, జబీన్ నటించారు. దర్శకుడు రాఖన్.

## వార్తలు

సంగీతం నయ్యార్.

ఈ కంపెనీ రెండో చిత్రం 'స్ప్రహాత్' నిర్మాణం త్వరలోనే ఆరంభం అవుతుంది. తొలిచిత్రం తీసిన రాఖన్ దీనికికూడా దర్శకత్వం నిర్వహిస్తారు.

*　*　*

ఒకటి రెండు వారాలలోగా విడుదలకు గల మరి రెండు చిత్రాలు ఆర్. ఆర్. ప్రొడక్షన్స్‌వారి 'పియామిలన్', తస్వీరిస్థాన్ వారి 'ఫాషన్'.

'ప్రియామిలన్'లో వైజయంతిమాల, రాజసులోచన, హెలెన్, నాగయ్య, శ్రీరాం, చంద్రబాబు మొదలగువారు పాల్గొన్నారు. సంగీతం రమేష్‌నాయుడు.

'ఫాషన్'లో మాలాసిన్హా, ప్రదీప్ కుమార్, జబీన్, కామో, చంద్రశేఖర్, జగదీష్ నటించారు. దర్శకుడు లేఖ్ రాజ్ భక్రా. సంగీత దర్శకుడు హేమంతకుమార్.

*　*　*

నరసూవారి హిందీచిత్రం 'సితారోంసే ఆగే', మార్చి 7 న విడుదలవుతుంది. సత్యేన్ (బండిష్) బోస్ దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో అశోక్‌కుమార్, వైజయంతిమాల నాయికా నాయకులు. సంగీత దర్శకుడు సచిన్ దేవ్ బర్మన్.

దాస్తాయెవ్‌స్కీ నవల 'క్రైమ్ అండ్ పనిష్మెంట్' ఆధారంగా పారిజాత్ పిక్చర్స్ వారు తీస్తూన్న చిత్రం 'ఫిర్ సుభా హోగీ' ఏప్రిల్ నెలాఖరుకు పూర్తి కావచ్చును. రాజ్ కపూర్, మాలాసిన్హా, రెహమాన్, ముబారక్, జగదిష్ సేఠీ, నానా జల్నేకర్, కమల్ కపూర్ మొదలగువారు నటిస్తున్నారు. 'శ్రీ 420' విడుదల సందర్భంగా రాజ్ కపూర్ ఇటీవల రుమేనియా వెళ్ళి తిరిగివచ్చిన తరువాత, ఈ చిత్రంలోనే ఎక్కువగా పని చేసినందువల్ల నిర్మాణం చురుకుగా సాగింది. ఒకపాట చిత్రణకూడా పూర్తిచేశారు. (సంగీత దర్శకుడు ఖయాం)

రాజ్ కపూర్, సోవియట్ రష్యాలో లాగే, తూర్పు యూరప్ దేశాలలో కూడా సర్వత్రా అభిమానం సంపాదించుకున్నాడని మొన్నటి రుమేనియా యాత్ర ఋజువు చేసింది. అతడు ఎక్కడికి వెళ్ళినా, జనం ఇట్టే గుర్తుపట్టి, చుట్టుముట్టి హర్షధ్వానాలు చేసేవారు.

"మా ఆయనకి విదేశాలలో కూడా చాలా పేరుందని పత్రికలలో చదవడమే తప్ప, ఎన్నడూ చూచి ఎరుగను. ఈసారి, కూడా వెళ్ళి చూడగా బోధపడింది" అంది రాజ్ భార్య కృష్ణ. ఆమె భర్తతో విదేశ పర్యటనకు వెళ్ళడం ఇదే తొలిసారి.

వచ్చేనెల రాజ్ కపూర్ దంపతులు ఇస్రేల్, టర్కీ దేశాలకు వెళ్తారు. 'శ్రీ 420' విడుదల సందర్భం పురస్కరించుకుని, ఆ సమయానికి అక్కడికి రావలసిందని వారికి ఆహ్వానం వచ్చింది.

*　*　*




విశ్వరూపావారి తొలిచిత్రంలో చెలంల చెవుల మెలిపెడుతున్న జమున.

అపోలో ఆర్ట్స్ వారి సంగీత చిత్రం 'కినారే కినారే' పూర్తి కావచ్చింది. దేవానంద్, మీనాకుమారి ఇందులో హుషారైన వేషాలు వేస్తున్నారు. దర్శకుడు చేతన్ ఆనంద్, ఐ. ఎస్. జోహార్, రాగిణి, సుందర్ ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు.

• * •

నటి శీలారామాని సరస్వతి ఆర్ట్స్ ఫిలింస్ పేరిట చిత్ర నిర్మాణానికి ఉపక్రమించింది. తొలి చిత్రం పేరు 'బద్మాష్' ఇందులో ఈమెకు నాయకుడెవరో ఇంకా నిర్ధారణ కాలేదు, దర్శకుడు జుగల్ కిషోర్. సంగీతం లిపిక్, బాబూల్. ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

## డాక్యుమెంటరీ వార్తాచిత్రాల రుసుము తగ్గింపు

ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ వారు సరఫరా చేసే డాక్యుమెంటరీ, వార్తా చిత్రాల ప్రదర్శనకై థియేటరు యజమానుల వద్ద వసూలు చేసే రుసుమును కొత్త ఆర్థిక సంవత్సరారంభంనుండి (ఏప్రిల్ 1) తగ్గిస్తూన్నట్లు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. ఈనిర్ణయం ప్రకారం వారానికి 499 రూపాయలు, అంతకులోపు సంపాదించే థియేటర్ల వారు ఈ చిత్రాలకు వారానికి రెండున్నర రూపాయలు రుసుము చెల్లిస్తే చాలు.

వారానికి 5 వందలు అంతకుపైనా వసూలయే థియేటర్లలో, వినోదంపన్ను మినహాయించగా లెక్కతేలే ప్రతి నూరు రూపాయలకు ఒకరూపాయచొప్పున రుసుము కట్టాలి. ఈ రేట్లు రెండు వేల అడుగుల వరకు వర్తిస్తాయి. రెండేసి చిత్రాలు వేసినా, వాటి మొత్తం నిడివి రెండు వేల అడుగులకుమించని పక్షంలో రుసుము ఇదే రేటున ఉంటుంది. చిత్రాల సంఖ్య లెక్కకురాదు.

ఒకసారి ఆడిన చిత్రాలను తిరిగి తెప్పించుకునే వారివద్ద పైరేటులో సగమే వసూలు చేస్తారు.

* * *

ఈ చిత్రాల ప్రదర్శనం విషయంలో ప్రభుత్వ విధానాలపట్ల థియేటర్ల యజమానుల అభిప్రాయాలు ఎలా ఉన్నా, డాక్యుమెంటరీ ఉద్యమ లక్ష్యానికి సంబంధించినంత వరకూ, ప్రభుత్వం కృషి ఎన్నతగ్గ ఫలితాలను సాధించింది అని అంగీకరించక తప్పదు. ప్రదర్శకుల ప్రతిఘటన కూడా ఇపుడు ఉపశమించి, సర్దుకుంది. ప్రేక్షకులను డాక్యుమెంటరీచిత్రాలు ఆకర్షించగలుగుతున్నాయి. బాగున్నాయని అనిపించుకుంటున్నాయి.



బి. ఎ. ఎస్. వారి 'చెంచులక్ష్మి'లో నాగేశ్వరరావు.

చెప్పుకోవాలి అని అధికారరీత్యా వెలువడిన ఒక నివేదిక తెలియజేస్తున్నది.

కాగా, మన డాక్యుమెంటరీ చిత్రాలలో ఉత్తమ ప్రమాణాలు నెలకొల్పి సర్వత్రా ప్రశంసలు అందుకొన్న చిత్రాలు ఎన్నో ఉన్నాయి. అనేక చిత్రాలను విదేశాలలో, వాణిజ్య స్థాయిన కాకపోయినా, మనరాయబార కార్యాలయాల ద్వారా ప్రదర్శిస్తున్నారు. 1957 పూర్వార్థంలో బ్రిటన్‌లో దాదాపు 1,74,000 మంది భారతీయ డాక్యుమెంటరీ చిత్రాలను చూచినట్లు లండన్‌లోని 'ఇండియన్ హౌస్' వార్షిక నివేదిక తెలియచేస్తూంది. ★



అమ్కో స్టుడియో అధిపతి శ్రీ మజీద్, 'పవన్‌పుత్ర హనుమాన్' నిర్మాత శ్రీ వాడియా, పూర్ణాపిక్చర్స్‌కు చెందిన శ్రీ కామరాజు.

కాగా, దేశ కాల స్థితిగతుల గురించిన మంచీచెడ్డా తెలియచెప్పి ప్రచారం చేయడానికి ఇవి బాగా ఉపయోగపడ్డాయి. సాలుకు 60 కోట్లమంది ఈ చిత్రాలను చూస్తున్నారు. ఈ దృష్ట్యా ప్రబోధాత్మకమైన కార్యక్రమ నిర్వహణలో డాక్యుమెంటరీ చిత్రాలను భారీ ఎత్తున వినియోగించే దేశాలలో అచిరకాలంలోనే మనదేశము అగ్రస్థానం వహించింది. ఈ విషయంలో సోవియట్ రష్యా తరువాత మన దేశాన్నే

## సినిమావార్తలు

బసంత్ పిక్చర్స్‌వారి పౌరాణిక చిత్రం 'పవన్‌పుత్ర హనుమాన్‌ను'ను పూర్ణాపిక్చర్సు వారు తెలుగులోకి డబ్ చేయిస్తున్నారు. తెలుగు చిత్రంపేరు 'రామభక్త హనుమాన్' డబ్బింగ్ అంకోస్టుడియోస్ (పూర్వం ఫిలిం

'రాగిణి' చిత్రంలో పద్మిని, అశోక్‌కుమార్



“మిసెస్ ఎ. వి. యన్. కళాశాల (విశాఖపట్టణము) నాట్యకళాసమితివారు 'దొంగ' నాటికను ప్రదర్శించి మద్రాసు ఆంధ్రవిద్యార్థి విజ్ఞానసమితి నవంబరునెలలో నిర్వహించిన పోటీలలో ప్రథమబహుమతినందుకున్నారు.

## చక్కని హాస్యనాటిక:

# “కుక్కపిల్ల దొరికింది”

ఆంధ్ర సమితి అనే కొత్త సంస్థ ఆధ్వర్యాన, గతవారం మద్రాసు వై. ఎం. ఐ. ఎ. నాటక మందిరంలో, చక్కని హాస్యనాటిక ప్రదర్శనం ఒకటి జరిగింది. ఆ నాటిక పేరు 'కుక్కపిల్ల దొరికింది' రచయిత శ్రీ రావికొండలరావు. ఈ నాటిక 'భార పత్రిక (1956 సెప్టెంబరు)లో ప్రచురితమైంది.

మూడు కుర్చీలు, ఒక బల్ల, ఒక వార్తాపత్రిక, ఒక టెలిఫోను, ఒక్క కుక్కపిల్ల, దీనికి కావలసిన సరంజామా. ఒక డబ్బుగల చిదంబరంగారు అల్లారు ముద్దుగా పెంచుకుంటున్న తెల్ల కుక్కపిల్ల హఠాత్తుగా ఒక రోజు తెల్లవారేసరికి గల్లంతయిపోయింది. ఆయన భోరున ఏడిచినంత పనిచేసి, పత్రికలో ప్రకటన వేయించాడు. కుక్కపిల్లని వెతికి ఇచ్చినవారికి నూటపదహార్లు బహుమానం అని. 1958 మార్కు పిల్లవాడొకడు, ఒక మైనర్ రిపేర్సు కంట్రాక్టరు, ఒక పెద్ద సైజు రౌడీ, భార్య అస్వస్థత, అబ్బాయి బడిజీతం వగైరాలతో బాధపడుతున్న బీద కాంపౌండరూ ఇంకా చిల్లర మనుషులు, చిదంబరం

# సినిమా వార్తలు

సెంటర్)లో జరుగుతోంది.

* * *

తెలుగులోకి తర్జుమా కానున్న మరో చిత్రం పద్మినీ పిక్చర్స్‌వారి 'స్కూల్ మాస్టర్' బి. ఆర్. పంతులు కన్నడంలో నిర్మించిన ఈ చిత్రం ఈమధ్యనే 'ఎంగళ్ కుడుంబం పెరిసి' పేరిట తమిళంలోకూడా విడుదల అయి విజయవంతంగాసాగుతోంది. ఇందులో బి. ఆర్. పంతులు, రాజమ్మ, జానకి, సూర్యకుమార్, సరోజ, మాధవరావు ఉదయకుమార్ మొదలగువారు నటించారు. మాటలూ పాటలూ శ్రీ శ్రీ వ్రాస్తున్నారు.

* * *

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి, సాంఘికచిత్రం 'అన్నతమ్ముడు' గతవారం ఆంధ్రలో విడుదల అయింది. జానకి, మాలతి, రాజసులోచన, గిరిజ, ఎన్. టి. రామారావు జగయ్య, రేలంగి, ముక్కామల, కె.వి. ఎస్. శర్మ చదలవాడ, కుటుంబరావు పాల్గొన్నారు. రచయిత పినిశెట్టి. సంగీతం అశ్వత్థామ. దర్శకుడు సి. ఎస్. రావు.

* * *

విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి పౌరాణికచిత్రం 'గంగాగౌరీ సంవాదం' 16న విడుదల అయింది. జానకి, కృష్ణకుమారి, రాగిణి, సి. హెచ్. నారాయణరావు, నాగయ్య, కాంతారావు, రమణారెడ్డి, సీతారాం, చంద్రశేఖర్, హేమలత, ఋష్యేంద్రమణి సీత మొదలగువారు పాల్గొన్నారు. మాటలు పాటలూ పరశురాం వ్రాశారు. దర్శకుడు వి. ఎన్. రెడ్డి.

సంగీతదర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు. ★

## "కుక్కపిల్ల దొరికింది"

మీద షిప్టుల ప్రకారం దండెత్తుతారు — తలో కుక్కపిల్లనీ పట్టుకొచ్చి. కొందరు వల్లకుక్కల్ని తెచ్చి సున్నం పూసేస్తారు. వీళ్ళంతా చిదంబరాన్ని గుమ్మం కదల నివ్వరు; ఊపిరి సలపనివ్వరు. వీళ్ళెవరూ లేనప్పుడు, ఇంట్లో నౌకరు కుర్రాడు, కుక్కపిల్ల దొరికితే, "మా నాన్న రెండో పెళ్ళికోసం నాకో వందరూపాయలు అప్పిస్తారా" అని వేధిస్తాడు.

చివరకి చిదంబరంగారు, గంటకో కుక్కపిల్ల దొరుకుతున్నందుకు రెండోసారి భోరున ఏడిచేసినంతపనిచేసి, కుక్కపిల్ల దొరికింది బాబోయ్ అని పత్రికలో ప్రకటన వేయిస్తాడు. గుమ్మానికి బోర్డు కట్టిస్తాడు. కుక్కపిల్లమాట ఎలా ఉన్నా, చివరకి అతనికి విశ్రాంతి దొరికింది. ప్రతిమాటమాటునా చక్కని హాస్యం పొదిగి, మొదటినుండి చివరదాకా నవ్వించేవిధంగా ఈ నాటకొన్ని రూపొందించిన రచయితే ఇందులో ముఖ్య పాత్ర (చిదంబరం) నిర్వహించడంతో, ప్రదర్శనానికి మరింత పుష్టి చేకూరింది. అనంత పద్మనాభరావు, వి. వి. రమణారావు, మాస్టర్ సుబ్రహ్మణ్యం, వి. జి. కృష్ణారావు, బి. కాశీనాథ్, ఇతర పాత్రలు నిర్వహించారు.

ఆంధ్రసమితి ప్రారంభోత్సవ సభకు శ్రీ తాపీ ధర్మారావు అధ్యక్షత వహించారు.








Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



రామలింగేశ్వరునకు ఎదురుగా 16 అడుగుల ఎత్తునవున్న
నందీశ్వరుడు

—ఫోటో: టి. రమాదేవి, మార్కాపురం.

Regd. No. M. 4479. Andhra Patrika Illustrated Weekly

# అతి సౌందర్య తిలకంగా నుండుటకు

ఆకర్షణీయమైన సౌందర్య వికాసముతో మనోహరముగా పొద్దు పుచ్చుడు. సంవత్సరాంతమున్ను సంతృప్తిగాను, చల్లగాను, పరిశుభ్రంగాను ఉండుటకు. చర్మమును పోషించునట్టిది, పౌడరు ఆధారమునకు దివ్యమైనట్టిది యగు "'హేజ్‌లైన్' స్నో" ను ఉపయోగించుడు. ఇది చోర-నిరోధక సీలుతో ప్యాక్ చేయబడి వచ్చుచున్నది.




# "'HAZELINE' SNOW"

(TRADE MARK)

"'హేజ్‌లైన్' స్నో" (ట్రేడ్ మార్కు)



బరోస్ వెల్కమ్ ప్రాడక్ట్